# భారతి

**1966 ఆగస్టు**

తెలుగు-ప్రాకృతము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

మనసు

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

కథకుడు, కవి, బాలగంగాధర తిలక్

శ్రీ బుచ్చిబాబు

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల ఒకరూపాయి

# భారతి

మాసపత్రిక

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

ఆగసు 1966

సంపుటము 43 : సంచిక 8 :

విడిప్రతిక వెల ఒక రూపాయి

# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి ఉత్తమ ఆంధ్ర గ్రంథములు

*గ్రంథాలయములకు అత్యంతావశ్యకములైనవి.*

| | | |
|---|---|---|
| 1. | తెలుగు సామెతలు – ముఖ్య సంపాదకులు : శ్రీ విశ్వనాథ సత్యనారాయణ | 10-00 |
| 2. | పదబంధ పారిజాతము ముఖ్య సంపాదకులు. శ్రీ నార్ల వెంకటేశ్వర రావు | 20-00 |
| 3. | నన్నయ పదప్రయోగకోశము – ముఖ్య సంపాదకులు. శ్రీ అబ్బూరి రామకృష్ణరావు | 40-00 |
| 4. | రవీంద్ర శతవార్షికోత్సవ విశేష సంచిక – సంపాదకులు: ఆచంట జానకిరాం | 10-00 |
| 5. | నన్నెచోడ పదప్రయోగసూచిక – ముఖ్య సంపాదకులు: శ్రీ దివాకర్ల వెంకటావధాని | 20-00 |
| 6. | మాండలిక (వ్యవసాయ) వృత్తిపదకోశము – ... | 25-00 |
| 7. | దక్షిణభారత సాహిత్యములు – (తమిళ, కన్నడ, మలయాళ, మహారాష్ట్రములు) | 3-00 |
| 8. | సాహిత్యోపన్యాసములు – 6 భాగములు – భాగము 1 కి | 1-50 |
| 9. | ఆంధ్రక్రియా స్వరూపమణి దీపిక – ముఖ్య సంపాదకులు: శ్రీ విశ్వనాథవారు | 20-00 |
| 10. | ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము – శ్రీ కుందూరి ఈశ్వరదత్తు, బి.ఏ. | 10-00 |
| 11. | సూక్తి సుధాకరము – సంపాదకులు : శ్రీ పెనుమత్స సత్యనారాయణరాజు | 20-00 |
| 12. | ఉర్దూ కథానికలు – శ్రీ బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి | 5-00 |
| 13. | ఉర్దూ సాహిత్యచరిత్ర – అనువాదకులు : శ్రీ యస్. సదాశివ, ఎం.ఏ. | 6-00 |
| 14. | సి. పి. బ్రౌన్ – డాక్టరు కొత్తపల్లి వీరభద్రరావు ... | 5-00 |
| 15. | ఆంధ్ర శతకావళి – సంస్కృతానువాదములు ... | 1-50 |
| 16. | ఆంధ్రమహా భాగవతము — 4 సంపుటములు – ఒక్కొక్క సంపుటము | 5-00 |
| 17. | సూరదాసు పదాలు – అనుకర్త: శ్రీ దుర్గానంద్ ... | 1-00 |
| 18. | రాఘవాభ్యుదయము – పరిష్కర్త డా. బి. రామరాజు ... | 4-00 |
| 19. | రసగంగాధరము – అనువాదకులు: శ్రీ ధరణికోట వెంకటసుబ్బయ్య | 6-00 |
| 20. | అమ్జద్ రుబాయీలు – అనువాదకులు: శ్రీ సదాశివ, ఎం.ఏ. ... | 1-50 |
| 21. | సుమతి వేమన శతకాలు – సంస్కృతానువాదములు ... | 1-00 |
| 22. | అఖిలభారత కవయిత్రులు – సంకలనము : శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ | 7-00 |
| 23. | ఉత్తరభారత సాహిత్యములు – (వంగ, ఓఢ్ర, పంజాబీ, కాశ్మీర సాహిత్య చరిత్రలు) | 4-50 |
| 24. | విష్ణు పారిజాతము – రచయిత్రి: తరిగొండ వెంగమాంబ ... | 2-50 |
| 25. | ఉత్తరరామ చరిత్ర (సంస్కృత నాటకము) – తెలుగు టీకా వ్యాఖ్యానముతో | 8-00 |
| 26. | ఆంధ్రదేశ్య హాస్యకథలు – సంస్కృతానువాదము ... | 0-75 |
| 27. | బ్రౌను నిఘంటువు – తెలుగు ఇంగ్లీషు ... | 30-00 |

## ఆంధ్ర సాహిత్య అకాడమి – కళాభవనము

సైఫాబాద్ : హైదరాబాదు-4.

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1966

# శ ం ఖ పు ష్పి క

## తల్లావఝ్ఝల

గాధావఝ్ఝల చయనులు
గారి గృహాంగణమునందు
ఒక్కనాడు చూచినాను
చక్కని నూతన లతికను.

అందమ్ముల తీగె ప్రాకి
పందిరిపై వ్యాపించెను.
అతివకాని లతికకాని
ఆలంబన మున్నప్పుడె
వృద్ధి చెంది సమగ్రముగ
వికాసమ్ము గాంచుచుండు.

కొలది కాలమునకె తీవ
కోమల రూపంబు తోడ
అలరులతో తనువు నిండ
అలరారుచు నుంట గాంచి,
సలిలసేచనమ్ము చేసి
చల్లని హస్తములతోడ
స్పృశియించితి పూగుత్తులు.

సిగ్గుతోడ సంకోచము
చెందెను సుమగుచ్ఛంబులు.
శంఖాకారమ్ము తోడ
సౌష్ఠవమున అలరు విరులు
మూచూడక పూర్వమ్మె
ముడుచుకొన్న వెందులకో!
అనుమాటలు నా నోటను
అప్రయత్నముగను వెడలె.

అవల సుమము లిట్లన్నవి:
"శివదీక్షా పరుల మేము,
చేతులతో తాక రాదు,
ఉత్తమ గుణవంతు లైన
ఒత్తి చూడ రాదు మమ్ము
పరిమళమ్ము లేకున్నను
పరమేశ్వరు పూజార్థము
వినియోగింతురు మమ్ముల—
వినలేదో యేమొ మీరు!"

"తీవ నుండి ప్రసవమ్మును
త్రెంపువాడ కాను నేను,
కోమలత్వ మగపడగా
కుతుకమ్మున తాకినాను.
నేను కూడ శివపూజా
నిరతుడ నని గ్రహియింపుడు!"
అనుచు మందహాసమ్మున
అంగణమ్ము దాటినాను.

భీకరముగ నిదాఘమ్ము
లోకము జీకాకు పరచు
వేళ నొక్కనాడు నేను
వీక్షించుట సంభవించె
శంఖపుష్ప కుంజమ్మును

చాలు మూల లేక పూలు
నేల రాలి శుష్కించెను.
నిలువుగ నుండెడి తీవియ
ఎండి భూమిమీద వ్రాలె.
ఎవ్వరు శివపూజార్థము
శంఖపుష్ప సందోహము
స్పర్శ చేసినట్లు లేదు!

# నాట్యకళ - గీర్వాణ రూపకము

శ్రీమతి ముష్టి వెంకటలక్ష్మీదేవి

మానవ శరీరము సర్వదేవతామయమని సూత సంహిత మొదలైన గ్రంథములందు పేర్కొనబడి ఉన్నది. దానిని నాట్యరూపముగా విశదీకరించుటకై భగవంతుడు మనకు నాట్యవిద్యను ప్రసాదించినాడు. నటుడు భావావేశముతో సర్వ దేవతామయమైన శరీరమునందు హస్తలాఘవము, అంగ విన్యాసమును చూపించుట చిత్తము భగవంతునియందు లగ్నము చేయుటకేయని విశదమగుచున్నది. జయదేవ మహాకవి వ్రాసినఅష్టపదీగానమునందు బాహ్యముగా శృంగారరస ప్రధానముగా కన్పించినను,తన భార్యను శ్రీకృష్ణ పరమాత్మ అనుగ్రహమువలన బ్రతికించుట యను దృష్ట ప్రమాణముచేత ఈ నాట్య విద్య ఆధ్యాత్మిక విద్యయని తెలియుచున్నది."కృష్ణ లీలాతరంగిణి"లో సప్తమస్కంధములో శ్రీ కృష్ణుడు గోపికలకు తత్వోపదేశము చేయు సందర్భమున "త్వమేవాహమ్' అను పదముతో జీవ బ్రహ్మైక్యసిద్ధిని రాగ, తాళ, లయాన్వితముగా దర్శించినట్లు నారాయణతీర్థులవారు చూపిరి. గనుక ఇట్లు అనేక ఉదాహరణల రీత్యా నాట్య విద్య బ్రహ్మ భావ కలితమై, బహుజన మనోరంజకమై అలరారు చున్నదని చెప్పుటకు సంశయములేదు. ఇట్టి ఆధ్యాత్మిక విద్యను వినుటయేగాక కనులార దర్శించుట మహద్భాగ్యముగా తలంచవచ్చును. కైలాసమందలి పరమ శివుడు తన ప్రియురాలైన పార్వతీదేవి ఆనందము కొరకు నటరాజ రూపము ధరించి అఖండ తాండవము చేసినది అందరికి విదితమేగదా!

## నాట్యము

స్వాయంభువ మనువు ప్రజాపాలనము నందలి విసుగు తొలగుటకై ఏదేని వినోదము సూచింపుమని తండ్రియగు సూర్యభగవానుని ఒకనాడు వేడుకొనెను. అప్పుడు సూర్యుడు మనువున కీ వృత్తాంతము చెప్పినాడు.

"ప్రజాపతి, విష్ణువు సన్నిధికి జని, వినోద మేదైనా నిర్దేశింపు మని ప్రార్థింపగా ఆయన ప్రజాపతిని మహేశ్వరునిసన్నిధానమునకు పొమ్మని చెప్పినాడు. అంతకు పూర్వమే తనకడ గాంధర్వ వేదము నభ్యసించిన నందీశ్వరుని మహేశ్వరుడు పిలిపించి ప్రజాపతికి నేర్పుమని యాదేశించినాడు.

ప్రజాపతి నటుని కొరకు తలపోయుగా అయిదుగురు శిష్యులతో నొకానొక ముని యావిర్భవించినాడు. సరస్వతీదేవి సమక్షమున ప్రజాపతి నాట్యవేదము నుపదింపుడని వారితో చెప్పినాడు. వారు నాట్య వేదమును వివిధాంగములతో నభ్యసించి భావరాగసంయుతముగా ప్రజాపతి యెదుట ప్రదర్శించి మెప్పుపొందిరి. ఆయన వారి భక్తి శ్రద్ధలకు మెచ్చి వారికి ముల్లోకములలో భరతులని పేరు వచ్చుననియు, నాట్య వేదమునకు భరతమని ప్రసిద్ధి కలుగుననియు వరము ప్రసాదించినాడు."

సూర్యుని వలన ప్రబోధము గాంచి స్వాయంభువ మనువు ప్రజాపతిని వేడుకొనగా, ఆయన మనువు వెంట భరతులను భారతవర్షమునకు పొండని యానతిచ్చెను. వారు అయోధ్యా నగరమునకు చని దేవలోకమున ప్రదర్శించిన విధమున దేవర్షుల గాథలను అచ్చట ప్రదర్శించిరి. ఈ భరతశిష్యులు, భరతఖండములో వివిధ ప్రాంతములలో రంగ గృహములు నిర్మించి, నాట్యకళను వ్యాప్తి చేసినారు. మనువు కోరికపై వారు నాట్య వేద

పారమును దేవదశసాహస్రి అనియు, శతసాహస్రి యనియు రెండు గ్రంథములుగా రచించినారు. దీనికే భరతమను పేరు వచ్చినది.

నాట్య శాస్త్రమందు నాట్యవేదావిర్భావము ఈ విధముగా కానవచ్చును. సృష్టియైన పిమ్మట పంచమ వేదమును సృజింపుమని ప్రజాపతిని ఇంద్రుడు వేడినాడు. ప్రజాపతి భంగిని, సంగీతమును, అంగ చలనమును, భావమును వేదముల నుండి గ్రహించి నాట్య వేదమును నిర్మించినాడు. అనంతరము భరతుని అతని శిష్య వర్గమును పిలిచి నాట్య వేదమును ప్రచారము చేయుడని యాదేశించినాడు. ప్రప్రథమ రూపకము దానవసంహార కథ. దేవలోకమున నీ కళ వృద్ధిగాంచినది. నహుషుడు ఇంద్ర పీఠము నధిష్ఠించిన పిదప, భూలోకమున కూడా ఈ కళ వ్యాపింపవలెనని, భరతపుత్రులను పంపినాడు. వారు మర్త్యులలో గలసి పోయిరి. వారి సంతతి వారు నాట్యకళలో ప్రవీణులైరి. కోహళుడు, శాండిల్యుడు మొదలగువారు లోకానుగ్రహ బుద్ధితో ఈ శాస్త్రమును రచించిరి.

తొలుదొల్త నాట్యకళలో నాట్యము, నృత్తము, నృత్యము, అను మూడంగము లుండెను. వీనిని దేవతల ఎదుట గంధర్వులు, అప్సరసలు ప్రదర్శించెడివారు. మహేశ్వరుని అనుచరుడు, ఈ కళలో ఆయన శిష్యుడునగు తండు పేర తాండవము ప్రసిద్ధిగాంచెను. మహేశ్వరుడు తాండవ లాస్యములను రెండు రీతులను యిందు చేర్చినాడు. నాట్య మనగా నాటకము. అందు అభినయము, వాచకము, కలవు. నృత్తమున వాచికము లేకుండా అభినయము మాత్రము వుండును. తాండవలాశ్యములు రెండూ నృత్త రీతులే.

తన భక్తుడగు బాణాసురుని పుత్రిక అయిన ఉషాకుమారికి పార్వతీదేవి లాస్యము నేర్పినది. ఉషాదేవి వివాహానంతరము ద్వారకా నగరమున నివసించుచు అచ్చటి గోపికలకు లాస్యము నేర్పినది. వారి వలన సౌరాష్ట్ర దేశ స్త్రీలకును, వారివలన నితరులకును ఈ కళ అబ్బినది.

గానము, అభినయము, సంభాషణము, రూపారోపమును, గీర్వాణ రూపకమునకు పూర్వకాలముననే యుండెను. భరత ఖండమున గానము వైదిక యుగమునుండి వర్ధిల్లెను. వేదములో గానమున్నది. వానిలో సంవాదములు గలవు. ఋగ్వేదమున 13 సంవాదములు స్పష్టముగా కానవచ్చును. మహాభారతము సూతునకు అతని శిష్యులకును సంవాద రూపమున రచింపబడినది.

ప్రాచీనకాలముననే లక్షణవేత్తలు నృత్త, నృత్య, నాట్యములకు భేదము స్పష్టీకరించినారు. కొన్ని రూపకములు నృత్యముమీదను, మరికొన్ని నాట్యము మీదను ఆధారపడి యుండుటచే ఈ పదములను ముందుగా గ్రహింప వలెను.

నృత్తమున కేవల మవయవ చలనముండును. అనగా నేత్ర, భ్రూ, ముఖ, హస్త, భుజ, వక్షోజ, కటి, పాదాంగుళుల చాలనము.

నృత్తమునకుతోడు గానము, పాఠ్యము, వ్యక్తీకరణము నృత్యమగును. నృత్యనాట్యములకుతోడు రూపకాభినయము, నాట్యాభినయమగును. అవసరము లేనపుడు నృత్యసంగీతముల విడువవచ్చును.

స్త్రీలకు లాస్యము, పురుషులకు తాండవము విధించినారు. నృత్యము భావాశ్రయము. నాట్యము రసాశ్రయము.

### రూపకములు—ఉపరూపకములు

నృత్తము నాధారముగా చేసుకున్నది రూపకముగా పరిణమింపలేదు. నృత్తము రాజప్రాసాదములలోను, దేవాలయ ప్రాంగణములలోను నిలిచిపోయినది. ఇయ్యది గణికల కళ. గణికలవలన రాజకుమారికలు, రాజకుమారులు నృత్తము నభ్యసించెడి వారు. వినోదమునకై నవీన విధానము లావిర్భవించినపుడు కాలక్రమమున రూపకము లేర్పడినవి. రూపకములు నాట్యాధారములు. నృత్యాధారములు ఉపరూపకములు.

హేమచంద్రాచార్యుని కావ్యానుశాసనమున గేయమనునది నేటి నృత్యము (ఉపరూపకము). పాఠ్యమనునది నేటి నాట్యము (రూపకము). అందలి గేయ రూపకము అభినవభారతిలోని నృత్తకావ్యము.

రూపకములు రసాత్మకము లనియు, ఉపరూపకములు భావాత్మకము లని భావప్రకాశమను గ్రంథమున స్పష్టముగా చెప్పి, ఉపరూపకములు నృత్య

భేదము లనియు, రూపకములు నాట్యభేదము లనియు వివరించబడినది. నాట్యము వ్యాక్యార్థాభినయాత్మకము. నృత్యము పదార్థాభినయాత్మకము అని నిరూపింప బడినది.

భరతముని రూపకమునకు లక్షణము చెప్పి విభాగము చేయుటయేగాక, ఉదాహరణముగా కొన్ని రూపకములు రచించినాడు. జామదగ్న్య విజయము (వ్యాయోగము), కుసుమశేఖరవిజయము అను ఈహా మృగము, శర్మిష్ఠాయయాతి అను నంకములను ఈయన రచించెను. నహుషుడు ఇంద్రపీఠము నధిష్ఠించి యున్నప్పుడు, తత్సమక్షమున శర్మిష్ఠయయాతి ప్రదర్శనము జరిగెను.

పితామహుడు సముద్ర మథనమను సమవా కారమును, త్రిపురదాహమను డిమమును రచించెనని ప్రతీతి. ఇంద్రధ్వజమహోత్సవ సమయమున సముద్ర మథనము, హిమాచలోత్తర భాగమున మహేశ్వర సన్నిధానమున త్రిపురదాహము ప్రదర్శనము జరిగెను. సరస్వతీ దేవి లక్ష్మీస్వయంవర నాటకమును రచించెను. ఆమె యానతి చొప్పున భరతమునివలన శిక్షణ నొంది అప్సరసలు ఇంద్రుని నాటకశాలలో దానిని ప్రదర్శించిరి.

భరతముని తర్వాత అనేకులు నాట్యశాస్త్ర విషయములు రచించినవారు కలరు. వారు మన సంప్రదాయప్రకారము, కలియుగమునకు పూర్వమే వర్ధిల్లిరి. వాత్స్యాయనుడు వారి గ్రంథములనుండి ఉదాహరణము లిచ్చినాడు. రామాయణములోను, మహాభారతములోను, నటనర్తక శబ్దములు, సూత్రధారశబ్దములు కలవు. నగరములలో నాటకములు, నృత్యములు బాగుగా జరగుచుండెడివని వానిలో వర్ణింపబడినది.

గౌతమ బుద్ధుని కాలమున సౌగంధికాపహరణము అను రూపకమును రాజగృహమున ఆయన శిష్యులగు ఉపతిష్య, మౌద్గల్యానులు ప్రదర్శించిరి. వరరుచి భాణమునే గాక నాట్యశాస్త్రమును కూడా రచించెనని శ్యామిలకుడు వ్రాసినాడు.

క్రీస్తుపూర్వము 150 సంవత్సరము ప్రాంతమున పతంజలి మహర్షి మహాభాష్యమును జేసినాడు. అందు రెండు పక్షముల గ్రాంధికులు అభినయము లేకుండా నోటిమాట పలుకుదురు. వారు సౌభికుల వలె అభినయింపరు. ఐనను పతంజలి కాలమున నాటకము లుండెను. నటులు గురువులై రంగస్థలమును పాలించిరి. రూపక ప్రయోగములను నిర్వహించెడివారు సౌభికులు. అందు గానము, నృత్యము సంభాషణము ఉండెడివి. ఇది నేత్రోత్సవమేగాక, కర్ణోత్సవము కూడను. పతంజలి, పాణిని మహర్షులకు పూర్వము గీర్వాణరూపకము లుండెడివనుటనిర్వివాదము.

## రూపక భేదములు

ముని 10 విధములగు రూపకములను, 14 విధముల ఉపరూపకములను పేర్కొన్నాడు. ధనంజయుడు తన గ్రంథమునకు దశరూపక మని పేరుపెట్టినాడు. కోహలాచార్యుడు 20 విధముల, అగ్ని పురాణము 27 విధములు, శారదాతనయుడు 30 విధముల చెప్పినారు. ప్రధానములైన దశరూపకములు రసాశ్రయములు. వాక్యార్థాభినయములు. తక్కినవి భావాశ్రయములు, పదార్థాభినయములు.

రూపకములలో నృత్యసంగీతముల బాహుళ్య వైరళ్యములను బట్టి కోహలాచార్యుడు దేశి మార్గ విభాగము చేసినాడు. దత్తిలుడు— సట్టక, తోటక, గోష్ఠి, బ్లిందక, శిల్పక, ప్రేక్షణ, సల్లాపక, హల్లీక, రాసక, ఉల్లాశ్య, శ్రీగదిత, నాట్య, దోర్వల్లి, ప్రస్థాన, కావ్య, లాసిక అను 16 విధముల పేర్కొన్నాడు. దీనిని బట్టి సామాజికుల ఎదుట ప్రదర్శించున వన్నియును రూపకములని సామాన్యముగా నన్నారు· "తేషాం రూపక సౌంజ్ఞాపి—ప్రాయోదృశ్యతయాక్వచిత్" అని శారదాతనయుడన్నాడు.

## రూపక సామాన్య లక్షణం

గీర్వాణ రూపకములను లాక్షిణికులు వివిధముగా విభాగించినారు. తన సాహిత్యదర్పణ గ్రంథమున విశ్వనాథకవిరాజు రూపకములు 10 యనియు, ఉప రూపకములు 18 అనియు విభజించినాడు.

పూర్వకాలముననే ప్రచారము నందున్న తోలు బొమ్మలాటయు రూప్ శబ్దముచే వాడబడుచున్నది. త్రిపిటకములలోని థేరగాథలో రూప్యరూపకము అను మాట కలదు. కళా ప్రదర్శనమునకు తొలుదొల్త రూపక శబ్దమున కర్థము. క్రమముగా దృశ్య ప్రదర్శనమునకు కూడా ఈ శబ్దమే ప్రయోగింపబడినదని తోచును. నాట్యశాస్త్రమున దశరూప

సమాసపదము అరు పర్యాయములు ఈ యర్థమున గావ వచ్చును. ఈ గ్రంథమునందే రూపశబ్దము గోచరించి నను రూపాభాసమని కాని, సౌందర్యమని కాని తాత్పర్యము.

నాట్యశాస్త్రమున దశరూప శబ్దము నాటక ప్రదర్శనము నుద్ఘాటించుచున్నది. పూర్వకాలమున బహిరంగముగా ప్రదర్శించుట యను నర్థమున నాట ధాతువును, నాటకమునకు నాట్యశబ్దము నుపయో గించెడివారు. రూప్ కాలక్రమమున ధాతువుగాను, సుబంతముగాను వ్యాప్తమయ్యెను. రమారమి సహస్ర వర్షముల కాలము రూప, నాటధాతువులు ప్రచలి తము లైననూ, తుదకు నాట మాత్రమే మిగిలినది కాని రూప్ ధాతువు రూపకముగా పరిణమించి నాట్య శబ్దమును త్రోసిపుచ్చి తానే మిగిలినది. క్రీస్తు శకము తొమ్మిది, పది శతాబ్దములలో రూపకము జాతి వాచకమైనది.

## నృ త్తా ది క ము

భావతరంగములు లేచి శరీరముపై కని పించును. ఒకనికి భావోదయమగును. అతడు దానిని నంబాళించు కొనలేక తన కరచరణాదులను కదలిం చును. అతని కన్యుల విషయమై ఆలోచనయే లేదు. ఆత్మసంతృప్తికై అతడు గంతులు వేయును. ఇది నృత్తము. ఈ కళ ఆత్మాశ్రమము. బిడ్డ యాదృచ్ఛి కముగా గంతులు వేయుట నృత్తమున కుదాహరణ ముగా చెప్పవచ్చును.

నృత్యము యాదృచ్ఛికముగా నుండు భావ ప్రదర్శనము. అన్యులకు భావస్ఫోరకముగా నుండు నని గ్రహించినప్పుడు అయ్యది క్రమబద్ధము కావలసి వచ్చును. తన యానందము అన్యులకు నిరూపింప దలచినపుడు నటుడు చేయు ప్రదర్శనము నృత్యమగును. ఇందు సాధారణీకరణమను గుణము గలదు. భావప్రద ర్శనములో నటుడు సంగీత మపేక్షించును. నటునకు కలిగిన భావమును నృత్యమువలన సామాజి కులు గ్రహింతురు. సామాజికుల కాభావము కలుగ నక్కరలేదు. కావున నీ కళ భావాశ్రయమై కొలదిగా విశ్వజనీనత్వము గాంచును.

నాట్యమున నటుడు భావావేశము చెంది, అభి నయమున దానిని వ్యక్తీకరించునప్పుడు సామాజి కులుకూడా తన్మయతను నొందుదురు. ఒకానొక నర్తకి రాజసన్నిధానమున నాట్యముచేయుచు ప్రభు చిత్తమున ననురాగమంకురింప జేయదలచి నాట్యము చేయునప్పుడు రాజుచిత్తము భావోద్రిక్తమగును. ఇయ్యది నాట్యము. ఆత్మాశ్రయత్వమిందు స్వల్పము గను, అన్యాశ్రమత్వమందు విశేషముగను గోచరించును. మాళవికాగ్నిమిత్రములోని చరిత మిట్టిది. నాట్య సర్వస్వ దీపికలోని వివిధ నాట్యములు ఈ జాతిలోనివి.

ఇంతియే గాక వేరొక కళకూడ కలదు. సీతా రాముల వియోగము నొకానొక నటుడు వ్యక్తీకరింప దలచినచో సామాజికుల ఎదుట నేర్పుతో ప్రదర్శ నము చేయును. సామాజికులు నటుని భావమునే పొందుదురు. దీనికై నటుడు నాట్యమునేగాక ఆహార్య మును గూడ నవలంబించును. అప్పుడు రూపము నాట్యముతో కలసినది. అదివరలో విడిగానుండెడి కళ నాట్యముతో కలసి రూపము, క్రమముగా రూప కము అనుపేర్లు పొందినది. రూపకము రమారమి వెయ్యి సంవత్సరముల క్రిందట నిర్ణీతమైనది.

అంతకు పూర్వము నాటకమునకు నాట్య, రూపశబ్దములతో వ్యవహార ముండెడిది. కాలక్రమమున రూపకము జాతివాచకమై నాటకము, నాటకభేద మైనది. "అవస్థానుకృతిర్నాట్యం రూపం, దృశ్యత యోచ్యతే రూపకం తత్సమారోపాత్" అను దశ రూపకములోని లక్షణమును తరువాత లాక్షణికులు అవలంబించినారు.

సంగీత, కావ్య, ప్రేక్ష సమాజాది శబ్దములు ఈకళను మొత్తముమీద సూచించిననూ ఇందలి ప్రత్యే కాంగములనే నిర్ధారించినవి. సంగీతమున గానము హెచ్చుగా నుండును. కావ్యమున పద్యగీతికలు మెండు. ప్రేక్షలో దర్శనీయ విషయములు మెండు.

నృత్యము, నృత్తము, నాట్యము అనెడి మూడు పదములు సాధారణముగా సమానార్థకములు గనే వాడబడుచుండును. అదిపొరపాటు. ఈమూడును పర్యాయ పదములుగావు. అవి నిరూపించెడి యర్థము లందు సామ్యముకంటె భేదభావమే ఎక్కువగా కలదు. వీనిలో నృత్తము తక్కిన రెండింటికంటె ముందు పుట్టినది. తరువాత నృత్య నాట్యములు వెలసినవి.

శరీరావయవ విక్షేపములను లయాన్వితముచేయ నెంచిన పూర్వకాలపు మనుష్యుడు మొట్టమొదట

సృష్టించుకున్న కళ నృత్తము. తాళమునకు అనుగుణముగా లయశుద్ధి యొప్పునట్టు అతడుచూపిన పాదన్యాసమే నృత్తమునకు ప్రారంభదశ. క్రమముగా దానిని అన్ని తాళములకు, అన్ని కాలములకు అనురూపముగా పెంపుచేయవలెనని యాతడు యత్నించెను. ఎంతయత్నించిననూ, పాదన్యాసము, తాళముతుదముట్ట అనుగమింపజాలదు. హస్తనాడులకు గల లాఘవము పాదనాడులకు ఉండదు. గనుక హస్తముతో వేయు తాళగతులనన్నిటిని పాదముతో చేయునృత్త గతులన్నియు ననుసరించలేవు. గనుక నృత్యవిద్య తాళముతో కొంత దూరమే నడచినది. నృత్తము చేయునప్పుడు పూర్వాపర కాయముల సమత కుదురుటకై వేరొక దశలో పాదవిక్షేపమునకు హస్త విక్షేపము తోడైనది. ప్రారంభ దశలోగాని ఈ దశలో గాని నృత్తమునకు శబ్దముతోడి సంబంధ మించుకయును లేదు. అనగా నృత్తము చేయునప్పుడు తాళము మాత్ర మపేక్షింపబడునుగాని గీతమపేక్షింప బడదు.

ఈగాత్ర విక్షేపవిద్య తాళలయాన్వితముగా నుండుటయేగాక శబ్దార్థ సూచకముగా వుండవలెననెడి యాశతో మానవుడు కల్పించిన ప్రక్రియాంతరము నృత్యము. నోటితో గీతమును బాడుచు యందలి భావమును చేతితో ప్రదర్శించుట దాని ప్రధానాంశము. ఆ పాడెడిగీతము తాళబద్ధముగానుండును గనుక తాళమునకు తగినట్లు కాలితో నృత్యముచేయుట దానికొక యంగము. కావుననే నృత్యమునందు అర్థ సూచకమైన హస్తన్యాసమేగాక ఒక్కొక్క యెడ తాళాశ్రయమైన నృత్తముకూడా ప్రకటితమగుచుండును. కృష్ణలీలా తరంగనృత్యమును చూచినప్పుడు మనకిది తార్కాణమగును. నృత్యము నృత్తముకంటె గుణాధికమై శాస్త్రనిబద్ధమైనది. అందుచేతనే దానిని 'మార్గ' యనియు నృత్తమును "దేశి" యనియు ఆలంకారికులు పేర్కొనిరి.

గీతి వాడకమే యర్థవంతముగా నృత్యము నల్లుట, తరువాత గలిగిన పెంపులలో విశేషము. భారతీయ నృత్యమును విజయవంతముగా నేడు ఖండ ఖండాంతరముల ప్రదర్శించుచున్న ఉదయశంకరుని నృత్యమే ఈ వాక్యమునకు దృష్టాంతము.

మిశ్రకళలోని యంగకళకు ఎంత సామరస్య మున్నదో యంత స్పర్థయున్నది. సంగీతమునకు శబ్ద సహచర్యము లేకున్నను లోటులేదని చూపుటకే జంత్ర గానము పుట్టినది. అట్లే కవి వాక్యము లేకున్నను నాట్యము నిలువగలదని చూపుటకే కథాకళివంటి మూకాభినయము యత్నించినది. మరికొంతకాలమునకు, నృత్యమున శబ్దార్థమునేగాక భావాశ్రయమైన వాక్యార్థమును సంయుతము ప్రదర్శింప వలెనని మానవు డింకొక సంస్కారమును జేసెను. తత్ఫలితముగా గాత్ర విక్షేప విద్య కొంత అవస్థానుకృతిమై అభినయమను పేరుదాల్చినది. క్షేత్రపదములు, జావళీలు మువ్వగునవి ప్రదర్శితము లగునప్పుడు దాని స్వరూపమును ప్రత్యక్షముగా చూడగలము.

ఈ అభినయమునకు మీదిమెట్టు నాట్యము. రెండిటికినిగల సన్నిహితత్వమును బట్టియే, అభినయ శబ్దము నాట్యపరముగా సహితముపయోగింపబడినది. వ్యస్తములైన పదములను, జావళీలను మాత్రమే గాక నిబద్ధకావ్యములైన నాటకములను గూడ ప్రదర్శించుటవలన అభినయము నాట్యమైనది. కాగా పదముల యభినయము భావగీతమువంటిది. ప్రబంధము వంటిది నాట్యము.

కూచిపూడివారి నాటకప్రదర్శనమున (నవనాగరికులు సహించని చిందులుత్రొక్కుట, చేతులు త్రిప్పుట) నాట్యవిద్యాపరిణితిలోని ఈభిన్న భిన్నదశలను చూపుటకును నృత్త, నృత్య, నాట్య మిశ్రీకరణము వలన ప్రదర్శనకు లభించు సమగ్ర కళాసిద్ధిని చూపుటకును ఉద్దేశింపబడినవి. కావున యక్షగాన నాట్యము నృత్త నృత్యనుప్రాణితత్వమని గ్రహింపవలెను.

పూర్వకాలమున సంస్కృత నాటక ప్రదర్శనములందు నృత్త, నృత్యములకు యథాభావరసస్థాన మొసగబడినది. ఇప్పటిమార్గ నాటక ప్రదర్శనమునందు కొంచెము నృత్యము (పదార్థాభినయం) మాత్రము నిల్చినది. తక్కినదంతయు నాట్యమే.

ఇట్టి దశా పరిణామము నాట్యకళకేగాక తక్కిన చిత్రకళలకునూ సహజమైయుండినట్లే కన్పట్టుచున్నది. మొదట త్రిస్వరాత్మకముగానే యున్నగానము తుదకు సప్త స్వరాత్మకమగుట యిట్టిదే.

ఆనంద రసాత్మకమై, బహుజనమనోరంజకమై ఈ నాట్య విద్య ప్రపంచములో అలరారుచున్నది.

నాటిక:

# "ఆపదలో అబల"

[గతసంచిక తరువాయి]

శ్రీ రంగధామ్

## రెండో రంగం

(తెర లేవగానే కమలా, నరసింహంగారు స్టేజి మీద వుంటారు. సమయం—మరునాటి ప్రొద్దున్న)

కమల—తెల్లవార్లూ వీళ్ల భజన కాలక్షేపంతో చెవులు చిల్లులు పడిపోయాయి. ఇలా నాల్రోజులు గనక సాగితే నిజంగా మనం ఎక్కడి కైనా వెళ్లిపోవలసి వస్తుంది. అక్కయ్యకి పురుడు రాకపోవడంవల్ల అమ్మ అక్కడ వుండిపోవడంతో మనకి సలహా చెప్పేవాళ్లే లేకుండా అయిపోయింది.

నర—(కళ్లజోడులోంచి చూస్తూ) ఇదుగో, వెంటనే మీ అమ్మకు ఉత్తరం రాస్తున్నాను. అదివచ్చి వీళ్లభజనలేమిటో, అల్లరేమిటోతేలుస్తుంది. క్రిందటిసారి ఆ ప్లీడరుగారు వెనక వాటా ఎప్పటికీ ఖాళీ చెయ్యకపోతే తను పూనుకుని మూడు నిముషాల్లో ఖాళీ చేయించింది.

కమల—ఎలాటి వాళ్లైనాసరే అమ్మదగ్గర ఎంతో భయభక్తులతో వుంటారు.

నర—అప్పుడప్పుడు నేను అనుకుంటూంటాను. నీకూ మీ అమ్మపోలిక వచ్చిందని. నీక్కూడా కోపం పాలు ఎక్కువ. నిన్నరాత్రి అతన్ని చాలా మాట లనేశావ్.

కమల—లేకపోతే ఈ కాలేజీ కుర్రాళ్లకి కాస్తసిగ్గు పడి మర్యాదగా తప్పుకుంటే పూర్తిగా లోకువ కట్టేసి ఏడిపించడం మొదలెడతారు.

(సుబ్బారావు చేతిలో సంచితో ప్రవేశిస్తాడు).

సుబ్బారావు—హల్లో మామయ్యా!

నర—ఓహో ఎప్పుడొచ్చావురా?

సుబ్బా—ఇదేరావడం. హల్లో కమలా! కులాసాయేనా?

కమల—ఓహో! బావగారికి ఇన్నాళ్లకి మేము జ్ఞాపక మొచ్చాం కాబోలు.

సుబ్బా—అబ్బే. ఎప్పుడూ జ్ఞాపకంలోనే వుంటున్నారు. కానీ తీరిక లేక ఇన్నాళ్లూ రాలేకపోయాను.

నర—నువ్వు కాకినాడలో ఇంజనీరుగా పనిచేస్తున్నావు కదూ!

సుబ్బా—అవును మామయ్యా. మొన్ననే 'కోర్సు' పూర్తిచేసి ఉద్యోగంలో చేరాను.

కమల—ఇప్పుడే వస్తా (అని లోపలికి వెడుతుంది).

నర—నిన్ను చూసి అయిదారేళ్లయిందిరా. మీ అమ్మా నాన్నా అంతా కులాసాయేనా?

సుబ్బా—అంతా కులాసాయే. అత్తయ్యేదీ?

నర—మా పెద్దమ్మాయిదగ్గరికి వెళ్లింది.

సుబ్బా—కమల చాలా పొడుగైంది కదు మామయ్యా! కాలేజీలో చదువుతోందా?

నర—లేదురా. పి. యూ. సీ. చదివి మానేసింది. ఇక్కడే డి. ఇ. వో. ఆఫీసులో టైపిస్టుగా పనిచేస్తోంది.

(కమల కప్పుతో కాఫీ తెచ్చి సుబ్బారావు కిస్తుంది.)

కమల—కాస్త కాఫీ తీసుకో బావా.

సుబ్బా—ఓ. నీచేత్తో ఏమిచ్చినా తీసుకుంటాను.

కమల—ప్రస్తుతం కాఫీయేలే. (నరసింహం నుద్దేసించి) నాన్నా, ఒక్కసారిలోపలికి వస్తారా.

నర—ఇదిగో వస్తున్నా. (కమలా, నరసింహం లోపలికి వెడతారు. వెంటనే నరసింహం కూరగాయల సంచితో ప్రవేశిస్తాడు.)

నర—ఇప్పుడే అలా బజారు వెళ్లొస్తాను. (అని వీధిలోకి వెడతాడు.)

సుబ్బా—కాఫీ చాలా బాగుంది.

కమల— ఏదోలే. అభిమానంకొద్దీ అంటున్నావు.

సుబ్బా—అబ్బే. నిజంగానే కమలా. మీ వూరొద్దామని రెండునెలలనుంచి ప్రయత్నం. కాని కొత్తగా ఉద్యోగంలో చేరడమేమో ఊపిరి సలపని పని అనుకో.

కమల —అంతా మెషిన్లతో పని అనుకుంటూ, చాలా కష్టం కదూ.

సుబ్బా—అబ్బో! చాలా పెద్దమెషిన్లులే. ఫారిన్‌నుంచి వచ్చాయి. వాటి మెకానిజం అంతా తెలుస్తేనే గాని లాభం లేదు. ఒక్కొక్కప్పుడు వాటి మెకానిజం మార్చెయ్యాలసి వస్తుంది.

కమల—ఫారిన్ మెషిన్‌లకే లోపాలుంటాయా?

సుబ్బా—ఏమనుకున్నావు మరి. ఫారిన్ అని పేరేగాని వాళ్లూ మనలాటి ఇంజనీర్లే.

కమల—మీ ఇంజనీర్లను చాలా గొప్పవాళ్లనాలిసిందే. అలాంటి చదువులవల్ల దేశాని కెంతో వుపయోగం.

సుబ్బా—అదివరేగాని కమలా, నేనిప్పుడొక ముఖ్యమైన పనిమీద వచ్చాను.

కమల—ఏమిటాపని బావా?

సుబ్బా—అబ్బే మరేంలేదు. నేనూ మానాన్నా మాటా మాటా అనుకున్నాం. ఆయన నాకు పెళ్లిసంబంధాలు వెతుకుతున్నాడు. అందులో ఒక సంబంధం చేసుకోమని చాలా బలవంతం చేస్తున్నాడు.

కమల—అయితే పెళ్లికొడుకు వయ్యావన్నమాట.

సుబ్బా—ఆ సంబంధం నాకెంతమాత్రం ఇష్టం లేదు.

కమల —అయితే మానెయ్యి.

సుబ్బా—అందుకే మామయ్యకా విషయం చెబ్దామని వచ్చాను.

కమల —బాగానేవుందిగాని బావా, రాత్రి తెల్లవార్లూ నువ్వు ట్రైనులో అలిసి పోయివుంటావు, కాస్త వేన్నీళ్లు స్నానం చేసి విశ్రాంతి తీసుకో. అన్నట్లు చెప్పటం మరిచాను. తెల్లవార్లూ మాకూ నిద్దర్లు

సుబ్బా — ఏం? ఏమైంది?

కమల —మాయింట్లో అద్దెకున్న స్టూడెంటుగారు భజన కాలక్షేపం ఏర్పాటు చేసారు.

సుబ్బా —స్టూడెంటా? భజన కాలక్షేపమా?

కమల —అదంతా పెద్ద కథలే. పద, స్నానం చేద్దువుగాని

సుబ్బా —ఏమిటా కథ? వెంటనే చెప్పెయ్యి.

కమల —ఏమీలేదు. మూడు నెలలనుంచీ ఆగదిలో అద్దెకుంటూ మమ్మల్ని నానా ఇబ్బందీ పెడుతున్నాడు. చివరకు మాకు విసుగొచ్చి గది ఖాళీచెయ్యమంటే, మామీద కసికొద్దీ మమ్మల్ని బాధ పెట్టాలని తెల్లవార్లూ భజన చేయించాడు.

సుబ్బా —ఏమిటీ? ఎవడీ ఆకతాయి! వాడి సంగతేదో ఇప్పుడే తేల్చేస్తానుండు. వాణ్ణి వెంటనే గది ఖాళీ చేయించేస్తాను.

కమల —నువ్వు కలుగ జేసుకోకు బావా. అతను చాలా పెద్ద రౌడీ.

సుబ్బా—నాసంగతి వాడికి తెలియదు. నేనుతలుచుకుంటే అసలు వాడిని ఏ కీలు కా కీలు ఊడ తీసి కూర్చో పెడతా.

కమల —ముందర స్నానం చెయ్యి బావా. తరువాత చూద్దాం.అయినా వాళ్లింకా నిద్రనుంచి లేవలేదు.

సుబ్బా —సరే, అయితే నువ్వన్నట్లు స్నానం చేస్తాను. (అనిగదిలోకి వెడతాడు.)

(నరసింహం కూరగాయల సంచితో ప్రవేశిస్తాడు.)

నర —కొట్టువాడు అరువివ్వననేశాడు. అప్పుడు పాపం ఆకుర్రాడు రెండ్రూపాయలు అప్పిస్తే, కూరలు కొనుక్కొచ్చా

కమల —ఉష్! బావవింటాడు. ఎలాగో ఒకలాగకొను క్కొచ్చారు. అదేచాలు. (అని కూరగాయల సంచి లోపలికి పట్టికెళ్తుంది. నరసింహం, కుర్చీలో కూచుని ఏదో రాసుకుంటాడు. వేణు ప్రవేశించి రమణరావు గదిదగ్గర నిలబడతాడు.)

వేణు —ఒరేయి రమణా! (రమణరావు లోపల్నుంచి నైట్ డ్రస్‌లో వస్తాడు.)

రమ - ఏమిట్రా గోల.

వేణు —తొందరగా తెమ్మలా. మనం ఎలక్షన్ప్రచారం గాండాకి వెళ్ళాలని శర్మ చెప్పాడు.

రమణ —ఎంత సేపయిందిరా నువ్వు లేచి?

వేణు — నేనులేచి చాలా సేపయింది. అలా కాఫీ హోటలుకువెళ్ళి కాఫీ త్రాగొచ్చాను.

రమ —సరే ఇప్పుడే వస్తున్నావుండు.

(అనిమళ్ళీ గదిలోకి వెడతాడు. వేణు వీధిలోకి వెడతాడు. సుబ్బారావు లోపల్నుంచి వస్తాడు.)

సుబ్బా— గడియారం టైము కరెక్టేనా మామయ్యా?

నర — కొంచెం ముందుకు పరిగెట్టొంటుందిరా. ఎన్నిసార్లు రిపేరు చేయించినా అలాగే వుంది.

సుబ్బా—పరేలే. దాని మెకానిజం మార్చేద్దాం.

నర —నువ్వు గడియారాలు కూడా బాగు చేస్తావేమిట్రా?

సుబ్బా —ఒక్కగడియారమేమిటి? ఏదైనా సరే మెకానిజం మార్చి పారేస్తాను.

నర —అబ్బా!

సుబ్బా —నీక్కావాలంటే సరదాకి ఒకరాకెట్ తయారుచేసి చంద్రమండలానికిపంపించేస్తాను.

కమల — (ప్రవేశించి) ఆ కాఫీమిషను బాగు చేశావా బావా?

సుబ్బా—అబ్బే. అది అలా బాగుపడదు. దాని 'మెకానిజం' మార్చిపారెయ్యాలి. నేను రేపుదాన్ని నాతో తీసికెళ్ళి బాగుచేయిస్తా.

నర —వదు లేరా. ఏదో ఒకమాదిరిగా బాగానే పనిచేస్తోంది. కాస్త 'స్క్రూ' లూజవుతూంటుంది. దాన్ని బిగిస్తే సరి.

సుబ్బా —దానిబదులు ఒక్కకొత్తదే తయారు చేస్తాను.

కమల —స్క్రూ లూజవడం ఒక మెషిన్లకేకాదు. మనుషులకు కూడా అవుతూంటుంది.

సుబ్బా— మనంకూడా 'మెషిన్ల' లాంటి వాళ్ళమే ననుకో. ఈశరీరమనే 'మెషిన్' సరిగాపని చేసినంతకాలమే. లేకపోతే..........

కమల — (నవ్వుతూ) మెకానిజం మార్చెయ్యాలి సొస్తుంది.

సుబ్బా —సరిగ్గా చెప్పావు.

(రమణరావు బాత్‌రూము వైపు వెడతాడు. సుబ్బారావు అతన్ని చూస్తాడు.అదే సమయంలో శర్మ, రమణరావుగది వరకూ వచ్చి నిల్చుని మాటలు వింటాడు.)

సుబ్బా —ఈయన ఎవరూ?

నర —ఆరూములో అద్దెకుంటున్న అబ్బాయి.

సుబ్బా — (కమలతో) ఇతనేనా అల్లరి చేస్తున్నాడని చెప్పావు.

కమల — అవును.

సుబ్బా—సరే ఇతన్ని సాయంకాలంకల్లా ఖాళీ చేయించేస్తానుండు.

కమల —నీకెందుకులే బావా శ్రమ. ఏదో సరదాగా వచ్చావు. ఈఒక్కరోజూ తగువుల్లో, తంటాల్లో గడపడమెందుకు.

సుబ్బా — అబ్బే,అలాఅనకు. నువ్వు ఇటువంటి రౌడీల మధ్యఅష్టకష్టాలూ పడుతూ కాలం గడుపుతూంటే నేనక్కడ ఎలా వుండగలను. నిన్నిలా వదిలిపెట్టి వెడితే, హృదయమంతా 'డ్రిల్లింగ్ మెషిన్' క్రింద పెట్టినప్లేటులా చిల్లులు పడిపోతుంది.

నర—ఒరే, కమలకీయేడాదే పెళ్ళి చేసేద్దామని వుందిరా.

సుబ్బా—ఎవరా వరుడు?

నర —నేను కట్నాలిచ్చుకోలేనని నీకు తెలుసుకదా. కట్నంలేకుండా ఎవరు చేసుకుంటే వారికే ఇస్తాను.

సుబ్బా —ఆ విషయమే నీతో నేను మాట్లాడాలని వచ్చాను.

కమల —నాన్నా, మళ్ళీ ఒకసారి భూషణంగారి దగ్గరకువెళ్ళి రాత్రంతా వాళ్ళు చేసిన గోల చెప్పొస్తా నన్నావు.

నర — (ఖంగారుగా) అవునమ్మా. అప్పుడే తొమ్మి దయింది. మళ్ళీ ఆయన బయటకు వెళ్లే వేళయింది. ఇప్పుడే వెళ్లొస్తా. (అని బయ టకు వెడతాడు)

కమల —ఇప్పుడే వస్తానుండుబావా. అన్నం వారుస్తు న్నాను.

(కమల ఇంటిలోపలికి వెడుతుంది. రమణరావు బాత్‌రూములోంచి బయటకు వస్తాడు. సుబ్బారావు 'ఏయ్‌మిస్టర్' అని పిలిచినా వినిపించుకోకుండా వెళ్లిపోయాడు.)

సుబ్బా —మిమ్మల్నే. (అంటూ అతనివెనకాలే వెడతాడు. రమణరావు వెనక్కి తిరిగి చూడ కుండా తనగదిలోకి వెడతాడు. సుబ్బారావు అతనివెనకాలే గదిలోకి వెడుతూంటే, శర్మ అడ్డుపెడతాడు.)

శర్మ —ఆగండి, అసలు మీరెవరు?

సుబ్బా —నేను ఆయనతో మాట్లాడాలి.

శర్మ —వీల్లేదు. ఆయనతో మాట్లాడాలంటే చాలా గొడవుంది. నేనాయన అంతరంగిక కార్యదర్శిని. ముందర నాదగ్గర 'పర్మిషన్' పొంది, 'ఎంగేజుమెంటు ఫిక్స్' చేసుకోవాలి. ఇంటర్వ్యూ గ్రాంటయ్యాక మాట్లాడాలి.

సుబ్బా — ఈ ఇల్లెవరిదో తెలుసా మీకు.

శర్మ —మీదిమాత్రం కాదని తెలుసు.

సుబ్బా —మా మేనమామగారిది.

శర్మ —కావచ్చు.

సుబ్బా —ఆయన నీ రూము ఖాళీ చెయ్యమనండి.

శర్మ —అలా చెప్పటానికి మీకేమీ హక్కులేదని తెలియ జెయ్యటానికి చాలా విచారిస్తున్నాను. మీరొచ్చిన పనేదో మీరు చూసుకోండి.మా విష యాలలో కలుగ జేసుకుంటే చాలాచిక్కుల్లో పడతారు.

సుబ్బా —మిస్టర్, మీ బెదిరింపులకు జడిసి పోవడానికి, ఆ ముసలాయన్ను కాదు.

శర్మ —మిస్టర్, మీ డాబుల్ని నిజమనుకోటానికి ఆడ పిల్లలం కాము.

సుబ్బా —మీరు మర్యాదగా రూము ఖాళీచేస్తారా? లేదా?

శర్మ —మీరు మర్యాదగా అవతలికి దయచేస్తారా లేదా?

సుబ్బా —అసలు మీ రెవరండీ? అద్దెకున్నది అతను. అతనితో మాట్లాడడానికి నేనువస్తే నన్ను మీరు ఆపుతారేమిటి?

శర్మ —నేనూ అదే లడుగుతున్నా. ఇంటాయన చుట్టాలందరూవచ్చి రూము ఖాళీ చెయ్యమన డానికి వాళ్లకు హక్కేముందంట? మీ మంచి కోసమే చెప్తున్నాను. మావాడికి కోపం వచ్చిం దంటే మీరు బొత్తిగా 'డామేజిడ్ కండిషను'లో ఇంటికి వెళ్లాల్సొంటుంది.

సుబ్బా —ఏమైనాసరే, ఆయనచేత గది ఖాళీ చేయిస్తాను.

(లోపల సోడాబుడ్డి కొట్టిన శబ్దమవుతుంది. రమణరావుచేతిలో సోడాబుడ్డితో బయటకు వచ్చి, సుబ్బారావునిచూసి 'యూ గెటవుట్!' అని అరుస్తాడు.)

రమణ —నువ్వు ఈ గది సంగతెత్తావంటే జాగ్రత్త.

(నరసింహంగారు ఖంగారుగావచ్చి 'పదరా సుబ్బా రావ్' అని పిలుస్తారు. రమణరావు ఒక్క నిముషం చేతిలో సోడాబుడ్డితో నిలబడతాడు. వేణూ, గదిరోంచి బయటికి వస్తాడు.)

నర -- (ఆతృతగా, స బ్బారావు చెవివద్ద) ఆ బుడ్డితో ఎదుటివాడిబుర్ర బ్రద్దలు కొడతాడటరా.

సుబ్బా—అమ్మబాబోయ్! గాజుబుడ్డితోనే!

(రమణరావు సోడా గడగడ త్రాగేసి గది లోపలికివెళ్లి బుడ్డిపెట్టి బయటికి వస్తాడు.)

రమణ—ప్రతి అడ్డమైన గాడిదా గది ఖాళీ చెయ్య మంటే ఊరుకునేదిలేదు.

(రమణరావూ, వేణూ, శర్మా ముగ్గురూ బయటికి వెళ్ళిపోతారు)

సుబ్బా—ఎందుకని వూరుకున్నానుగాని వాడిని అక్కడ పాతేసివుందును.

నర —వూరుకోరా, వాడుత్తి మొండిఘటం.

కమల —(గబగబ వచ్చి) ఏం జరిగింది?

నర —ఏముందీ, కాస్సేపుంటే ఆ సోడాబుడ్డితో కొట్టేసి వుండేవాడు రమణరావు వీణ్ణి.

కమల—ఎంత ప్రమాదం! నీకు తెలియదు కాబోలు. అతను సోడాబుడ్లలో యుద్ధం చేస్తాడుట!

సుబ్బా—ఆ సంగతి తెలుసుంటే ఒక మిషను గన్నో, రైఫిలో నేనూ తెచ్చేవాణ్ణి.

కమల—పోనిస్తూ బావా. ఏదో రాకరాక వచ్చావు. కాస్సేపు సరదాగా మాట్లాడుకొందాం. అతనిని పట్టించుకోకు.

నర—అన్నట్లు, మరి నీ పెళ్లి విషయం ఏదో చెప్తా నన్నావు.

సుబ్బా—(పరధ్యానంగా) నా పెళ్లి విషయమా?

నర—అదే, నీ పెళ్లి విషయమే.

సుబ్బా—అదికాదు మామయ్యా, అతనలా గది ఖాళీ చెయ్యకుండా మొండికేస్తే మనం వూరు కోవడమేనా?

కమల—ఇంక ఒక్కటే మార్గంవుంది.

సుబ్బా—ఏమిటది?

కమల—సత్యాగ్రహమే. ఇంక అతని రూముముందు కూర్చుని అతను ఖాళీ చేసేటంతవరకూ నిరాహారదీక్ష నవలంబించడమే.

సుబ్బా—నువ్వొద్దు కమలా. ఆ పని నేనుచేస్తాను.

కమల —నీ కెందుకు బావా, ఆ పని నేను చేసితీర తాను.

సుబ్బా —నువ్వు నిద్రాహారాలు లేకుండావుంటే నాకు దిగులు వేస్తుంది. నేను బ్రతకలేను .

కమల —నీకు నామీద ఆమాత్రం సానుభూతివుంటే అదే చాలు.

సుబ్బా —నువ్వంటే నాకు ఎంత ఇదో నీకు తెలియదు.

కమల —నువ్వుమాత్రం బాధ పడడం నా కిష్టమను కున్నావా?

సుబ్బా —నామీద ఆమాత్రం జాలుంటే అదేచాలు.

నర —మీ ఇద్దరూ వద్దు. ఆ సత్యాగ్రహ మేదో నేను చేసా ను.

సుబ్బా —పోనీ మన ముగ్గురిలో ఎవరుచెయ్యాలో లాటరీ వేద్దాం.

కమల —అక్కర్లేదు. నేను చెయ్యాలని నిశ్చయించు కున్నాను.

సుబ్బా —(ఏదో జ్ఞాపకం వచ్చిన వాడిలా) నేనిప్పుడే ఒక స్నేహితుణ్ణి కలుసుకుని వసా ను. (బయటికి వెళ్తాడు.)

నర -వంటయిందా అమ్మాయి?

కమల —ఆ! బావ భోంచేసివెడితే బాగుండును.

నర —ఏదో చట్టపు చూపుగా వచ్చినందుకు వాడికీ బాధ తగులుకుంది.

కమల —బావది చాలా మెత్తని మనసు.

('బావగారూ' అంటూ దీక్షితులు హోల్డాలూ, పెట్టే పట్టుకుని ప్రవేశిస్తాడు.)

నర —ఓహో! దీక్షితులుబావగారా. రండి. రండి.

దీక్షితులు —నే ననుకున్నట్లేఅయింది ;సరిగ్గా భోజనం వేళకి ముందే రాగలిగాను. బావగారూ, రైలు గంటన్నర లేటయ్యేటప్పటికి, ఇక్కడ భోజ నాల టైముకి రాగలుగుతానో లేదో అని బాధ పడ్డాను. ఎందుకంటే అడ్డమైన హోటళ్ల లోనూ భోంచేస్తే నా వంటికి పడదు. అక్క గారు మీ యింటికి వెళ్లమని మరీ మరీ చెప్పారు. ఆ! ఏ మమ్మాయి, అలా నిలబడి పోయావేమిటమ్మా కాసిని మంచినీళ్లియ్యి.

కమల —అలాగేనండి (అని లోపలికి వెడుతుంది.)

దీక్షితులు —ఇలాంటి విషయంలో మా పెద్దకోడ లుందే, బహు చలాకీ. ఓహోహో! ఆ అమ్మాయి తెలివి తేటలు అద్భుతం. మా పెద్దబ్బాయి మనసులో మాట ఇట్టే గ్రహిం చేస్తుంది. వాడుమట్టుకు తక్కువా. పెద్ద డాక్టరు. బావగారూ,మీకు తెలుసో లేదోగాని, ఇండియాలోఉన్న డాక్టర్లందరిలోకి ఫస్టు రావలిసినవాడు మా అబ్బాయి.

నర —అలాగా!

దీక్షితులు—వంటయిందికదూ అమ్మాయి? పంథొమ్మిది వందల ముప్ఫైమూడులో మొట్టమొదట నే నీ వూరు వచ్చాను. ఆ రోజులే వేరు. అయ్యరుహోటల్లో నాకోసం ప్రత్యేకంగా వండించేవారు. అవి చరిత్రాత్మకమైన రోజులు. నేను ఆ రోజుల్లో రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగా వుండేవాణ్ణి. వంటంతా నేతితోనే చేశావా? నూనె నాకు పడదు.

నర—ఆఁ దానికేముంది. మీకోసం గబగబ అర గంటలో నేతిపోపుతో కూ రేదేనా చేస్తుంది

దీక్షితులు—(కమలతో) త్వరగాకానియ్యి. పోనీ నాలుగు కూరముక్కలు నేతిలో వేయించెయ్యి. ఆ, బావ గారూ, పంథొమ్మిదివందల నలభై అయిదులో నేను తిరుపతి వెళ్లాను. ఓహోహో, ఏమి తిరుపతి! చరిత్రాత్మకమైన దర్శనం. జన్మ తరించిపోయింది. ఆ యేడే జయప్రకాశ్ పుట్టాడు.

నర—అంటే మీ రెండో అబ్బాయి కదూ?

దీక్షితులు—అవును. వాడి తెలివి తేటలు అద్భుతం. పంథొమ్మిదివందల నలభైలో మా యింటికి ఒక జ్యోతిష్కుడు వచ్చాడు. అతను బ్రహ్మాండ మైన శాస్త్రవేత్త. ఆయన చెప్పాడు, మరొక అయిదేళ్లల్లో మా యింట్లో ఒక గొప్ప వ్యక్తి పుడతాడని. అలాగే మావాడు పుట్టాడు. వాడు పుట్టిన రెండేళ్లకే మనకు స్వరాజ్యం వచ్చింది.

నర—ఇప్పుడేం చేస్తున్నాడు?

కమల —మామగారూ, కొంచెం కాఫీ కలిపియ్యనా?

దీక్షితులు—అలాగేగాని, ఇప్పుడు భోంచెయ్య బోతూ కాఫీ ఎందుకూ. పంథొమ్మిదివందల ఇరవై అయిదులో అయింది నా కీ కాఫీ అల వాటు. అప్పటినుంచి అలా సాగిపోతూనేవుంది. అప్పుడొక అయ్యరు స్నేహితు డుండేవాడు. మా యిద్దరి స్నేహం చరిత్రలో సువర్ణాక్షరా లతో ఉండిపోదగింది.

నర —మీ రెండో అబ్బాయి ఏం చేస్తున్నాడన్నారు?

(కమల లోపలికి వెడుతుంది.)

దీక్షితులు—వాడి చరిత్ర అద్భుతం. వాడికి రాజాజీ అంత తెలివితేటలున్నాయి. ఆ మాటకొస్తే వాడు సర్ సి. వి. రామన్ అంతవాడవుతాడని అనుకుంటున్నాను. ప్రస్తుతం బి. యస్. సీ. లో పార్టు ఒకటి ఉండిపోవడంవల్ల రేపు సెప్టెంబరు పరీక్షకు వెడుతున్నాడు. (కమల కాఫీ కప్పుతో ప్రవేశించి 'తీసుకోండి మామ గారూ' అని ఇస్తుంది.) వాడికోసం ఒక గది అద్దెకు తీసుకుందామని వచ్చాను. మీఇంట్లో ఒక గది ఉందిటగా. మా కివ్వడానికి మీకేం అభ్యంతరం లేదనుకుంటాను.

నర—అయ్యో! అంతకన్నానా. ప్రస్తుతం ఒక స్టూడెంటు ఉంటున్నాడు. అతన్ని ఖాళీచెయ్య మంటున్నాం. కానీ ఖాళీ చెయ్యనని మొండి కేస్తున్నాడు. అతను ఖాళీచేస్తేతప్పక ఇస్తాను

దీక్షితులు—రక్షించారు. ఎలాగా ఈ నాలుగు నెలలూ కాలక్షేపం చెయ్యడం? అని చూస్తున్నాను. పంథొమ్మిదివందలనలభైనాలుగునుండిహోటలు భోజనం పడటంలేదు. ఇక్కడే వుంటే నాలుగు మెతుకులు అమ్మాయో, అక్కగారో వుడకేసి పెడతారు.

కమల—(లోపల మండిపోతున్నా పైకి మర్యాదకి) మీ అబ్బాయి చదువుకి మీరు కూడా ఇక్కడే ఉండాలా?

దీక్షితులు—నాకూ ఈ వూళ్లో పనుంది. అందుకని ఉండదల్చుకున్నాను.

కమల—ఆ గదిలోవున్న స్టూడెంటు వట్టి మొండి వాడు. అతను కాళీ చేసేటట్టు లేడు.

దీక్షితులు—నాకోసం ఖాళీ చెయ్యమని బ్రతిమాలాను. మా అబ్బాయికి కూడా హోటలు భోజనం పడదు. ఎలాగా తర్వాత నువ్వు మా కోడలువి అవబోతున్నావు కాబట్టి వాడి సంగతంతా నువ్వే చూసుకోవాలి. వట్టి మొహమాటస్తుడు.

కమల—(లేని నవ్వు తెచ్చిపెట్టుకొని) ఆఁ. మనం అను కున్నవన్నీ అవుతాయేమిటి.

దీక్షితులు—(నవ్వుతూ) నాకు తెలుసు. మా అబ్బా యిని చేసుకోవాలని నీకు వుందని. నీ మనసు లోని కోరిక నెరవేరుతుంది.

కమల—ఛ! ఛ! నా కలాంటి వూహేలేదు.

దీక్షితులు—సిగ్గుపడకు. ఇప్పుడే నేను అలా బజారులో కెళ్లి అబ్బాయికోసం ఒక ఫ్లాస్కు కొను క్కొస్తాను. ఆట్టే ఆలస్యం చెయ్యను. (వెడతాడు.)

కమల—(కోపంగా) నాన్నా, ఏమిటీ బోరు. ఈయనకు గది ఇస్తానని ఎందుకన్నారూ?

నర—ఆ స్టూడెంటు ఎలాగా ఖాళీ చెయ్యడు కాబట్టి మర్యాదకి అన్నాను.

కమల—అసలు ఈయన మనింట్లో తిష్టవేస్తే వీళ్లకి చాకిరీ ఎవరు చేస్తారు. నేను చెయ్య లేను బాబూ. పైగా నేతిపోపట. హొటలు తిండి పడదట.

నర—పోనీయమ్మా. అతను మా అక్కయ్య పిన మామగారు. ఏదో ఒక్కరోజుండి వెళ్లిపోతాడు.

కమల—ఒక సంవత్సరం లోపల కదిలేటట్లు లేడు.

నర —అబ్బే. కాస్సేపుంటే రమణరావుగది ఖాళీ చెయ్యడని తెలియగానే మరోగదికోసం వెతు క్కొని వెళ్లిపోడు?

కమల—బ్రతికాం. అతను గది కాళీ చెయ్యకపోవడం మనల్ని రక్షించింది.

నర—అది తెలిసే నే నా మాటన్నాను.

(సుబ్బారావు హడావుడిగా వస్తాడు.)

సుబ్బా—మామయ్యా, రమణరావు ఇహ కాళీచేసి తీరతాడు.

నర—ఏం? ఏం జరిగింది?

సుబ్బా—మా స్నేహితుడి తండ్రి వరదానంగారని ఆయన ఎంతచెప్తే ఇతనికి అంతట. నేను మా స్నేహితుడి కీ విషయమంతా చెప్పాను. అతను వాళ్ల నాన్నగారిద్వారా, గది ఖాళీ చెయ్యమని రమణరావుకి చెప్పిస్తానన్నాడు.

కమల—వద్దులే బావా. అతను ఖాళీ చెయ్యకపోతేనే మంచిది.

నర—ఒరేయ్, ఇంక మనం అతన్ని ఖాళీ చెయ్యమని పట్టుపట్టవద్దు.

సుబ్బా—అదేమిటి? ఇప్పటివరకూ అతను ఖాళీ చెయ్యకపోతే సత్యాగ్రహం చేద్దామనుకున్నాం కదా. మళ్లీ గాలి ఇలా తిరిగిందేమిటి?

కమల—కారణం ఏమిటో ఇప్పుడే నీకు తెలుస్తుంది.

(దీక్షితులు ప్రవేశిస్తాడు.)

దీక్షితులు—అన్నట్టు, బావగారూ చెప్పు లెక్కడో పారేసుకున్నాను. బయట కాళ్లు కాలిపో తున్నాయి. మీ చెప్పు లొకసారివ్వండి. పంథొమ్మిదివందలఏభై యారులో ఒక చెప్పుల జత కొన్నాను. అది మూడేళ్లు వాడాను. మళ్లీ పంథొమ్మిదివందల అరవైలో మరొక జత కొన్నాను. అది నాలుగేళ్లు వాడాను. అది నిజంగా నాకు చరిత్రాత్మకంగా సేవ చేసింది. మళ్లీ ఈ జత మొన్ననే కొన్నాను. రైల్లో పోయాయి.

నర—అయ్యో, నా చెప్పులు వేసుకోండి.

కమల—(వెటకారంగా) అవి పంథొమ్మిదివందలఅరవై యారులో కొన్నవి.

దీక్షితులు—(సుబ్బారావుకేసిచూసి) ఈ అబ్బాయెవరు?

నర—అతను మా మేనల్లుడులెండి. ఇంజినీరుగా ఉంటున్నాడు.

దీక్షితులు—ఇతనేం ఇంజినీరు గాని, మా పెద్దమ్మాయి కొడుకు—వాడండీ ఇంజినీరంటే. వాడికి అయిదేళ్లున్నాయో లేవో ఇంట్లోవున్న వస్తువు లన్నీ విరగ్గొట్టేస్తాడు. రేడియోలూ, గడియారాలూ, అన్నీ వాడి చేతిలో ధ్వంసం అయిపోవలసిందే. వాడు పెద్దయితే చూసు కోండి, ఎంత గొప్ప ఇంజినీరు అవుతాడో.

నర—అలాగా!

దీక్షితులు—వాళ్లమ్మ పోలికలెండి అది నిజంగా చదువులో సరస్వతి. పంథొమ్మిదివందల నలభై మా వూళ్లో యం. యస్. సుబ్బలక్ష్మి పాటకచ్చేరీ చేసింది. ఆ మర్నాటి నుండీ రోజూ మా యింట్లో మా అమ్మాయి పాటకచ్చేరీ చేసేది. దాన్ని మేమంతా గాన సరస్వతి అని పిలుస్తూవుంటాం.

నర—మా సుబ్బారావు కూడా వచ్చేశాడు. భోంచేసేద్దాం.

దీక్షితులు—ఇదిగో ఇప్పుడే వచ్చేస్తాను. భోంచేశా నంటే మళ్లీ పడుకోవలసి వస్తుంది. ఇప్పుడే వెళ్లి సరుకులు కొనుక్కొచ్చేస్తాను. అన్నట్లు మా జయప్రకాశ్ రేపు ప్రొద్దున్న వస్తున్నాడు. జాగ్రత్త అమ్మాయి. వాడి భారమంతా నీదే. ఆ గదిలో అబ్బాయిని సాయంకాలమే ఖాళీ చేసెయ్యమందాం.

నర—అతనితో చాలా పేచీయే.

దీక్షితులు—నే నతన్ని ఒప్పిస్తాగా. ఆ సంగతి నాకు వదిలెయ్యండి. పంథొమ్మిదివందలనలభైలో ఒక

చారిత్రాత్మక సంఘటన జరిగింది. ఇలాగే ఒకరింట్లోంచి ఒక అద్దెకున్న ఆసామి చెయ్యలేదు. ఆయన ఎవరు చెప్పినా వినలేదు. అప్పుడు నే నాయనతో ఒకపూట మాట్లాడాను. ఆయన వెంటనే ఖాళీ చేసేశాడు. నేనా అబ్బాయితో మాట్లాడుతాను. లతనే ఖాళీ చేస్తాడు. వస్తా. (బయటికి వెడలాడు.)

సుబ్బా—ఎవరీ 'కేలండరు' మహాశయుడు?

కమల—మా అక్కయ్య పినమామగారు.

సుబ్బా—ఇక్కడి కెందుకొచ్చాడు?

కమల—వాళ్ళబ్బాయి సెప్టెంబరు పరీక్షకి కట్టాడుట. మన గది ఖాళీ అయితే అందులో వుంటారుట. పాపం ఆయనకి హోటలు భోజనం పడదుట.

సుబ్బా—'మైగాడ్'! మా యింట్లో తిష్ఠ వెయ్య దల్చుకున్నాడన్న మాట. అయినా తనవాళ్ల గురించి రైలింజను రొదలాగా తెగ వాగుతా డేమిటి! 'బోరు' కొట్టెయ్యటంలేదు?

కమల—ఏదైనా భరించగలంకాని ఆయన బోరు భరించలేం బాబూ.

నర—తను బోరుకొట్టుతున్నానని అతనికి తెలియదు.

కమల—అది మరీ ప్రమాదం. మనలాటి తెలిసిన వాళ్లయితే ఫరవాలేదుగాని, తెలియనివాళ్ళు ఇతనికి 'స్క్రూ' లూజనుకుంటారు.

సుబ్బా—తలలో 'బేరింగు'లు దెబ్బ తిన్నట్లున్నాయి. కాస 'మెకానిజం' మారిస్తే బాగుండును.

కమల—నాన్నా! ఏమైనాసరే ఆ గదిమాత్రం అతని కియ్యొద్దు.

నర—ఎలాగమ్మా! అతను మా అక్క పినమామగారు. అతనిమాట కాదంటే మా బావగారు ఏమను కుంటాడో, నాకేమీ తోచటంలేదు.

సుబ్బా—ఇంతకీ ఆ స్టూడెంటు ఖాళీ చెయ్యాలికదా.

కమల—అతను ఎల్లాగూ ఖాళీ చెయ్యడు కాబట్టి ఆయనను వెంటనే మరోగది చూసుకోమందాం.

సుబ్బా—పాపం. అన్యాయంగా ఆ స్టూడెంటు ఖాళీ చెయ్యటంలేదని బాధపడ్డాం. నిజంగా అతని పట్టుదల ఇప్పుడు మనకి రక్షయింది. మామయ్యా, ఆ స్టూడెంటుని నువ్వు చాలా మర్యాదగా చూడాలి.

కమల—కొంచెం కోపధారి అనేగాని, అతనంత మర్యాదస్తుడున్నాడా.

నర—అవునుసుమీ. ఏమాట కామాటే చెప్పుకోవాలి. అతనిమాట తీవ్రమైనా మనసు మెత్తన.

కమల—వాళ్లు తెల్లవార్లూ భజన కాలక్షేపం పెట్టు కున్నా మన కేమీ ఇబ్బందిలేదని చెప్పెయ్యండి.

నర—కావలిస్తే మనం కూడా భజన మొదలెడదాం.

సుబ్బా—అదేమిటి? ఏదో రిక్షా వచ్చినట్లుంది! (రమణరావూ, శర్మా బయటనుంచివచ్చి లతని గదిలోకి వెడతారు. రెండు పెట్టెలూ, రెండు బెడ్డింగులూ బయట పెడతారు.)

రమణ—ఒరేయ్ శర్మా, నువ్వా సామాను రిక్షాలో వేయించరా. నేను ఈ యింటాయనతో మాట్లాడి వస్తాను.

(కమలా, సుబ్బారావు ఒకరి మొహం ఒకరు తెల్లబోతూ చూసుకుంటారు. నరసింహంగారు రమణరావు వైపు చూస్తారు.)

నర—సామానంతా బయట వేస్తున్నారేమిటి?

రమణ—ఏమండీ. నేను ఇప్పుడే మీ రూము ఖాళీ చేసేస్తున్నాను.

(కమలా, సుబ్బారావు 'ఆ!' అంటారు.)

నర—అయ్యో! అదేమిటి? ఇంత హఠాత్తుగా ఖాళీ చెయ్యడ మేమిటి?

సుబ్బా—ఇలా ఖాళీ చేస్తారనుకోలేదే.

కమల—అంత అవసరం ఏ మొచ్చిందబ్బా!

రమణ—అదేమిటండీ, మీరేగా నన్ను ఖాళీ చెయ్య మన్నారు.

నర—అబ్బే. ఏదో మాట వరుసకన్నాను. కానీ.....

సుబ్బా—నిజానికి మీరు ఖళీ చెయ్యాలనే ఉద్దేశం. లేదు.

కమల—అయినా ఎందుకు ఖాళీ చెయ్యడం?

రమణ—బలే! మీరు చాలా చిత్రమైన వ్యక్తుల్లా వున్నారే. ఈ క్షణంవరకూ నన్ను గది ఖాళీ చెయ్యమని తెగ వత్తిడి చేసారు. తీరా నేను ఖాళీ చెయ్యదల్చుకునేసరికి ఇలా ప్లేటు మారుస్తున్నారేమిటి?

నర —ఏదో ఆ గది అవసరం వుంటుందనుకున్నాం. ఇప్పుడు మరి మీరు ఖాళీ చెయ్యనక్కరలేదు.

సుబ్బా—మీరు మరోలా అనుకోకపోతే, ఆగదిలో మీ యిష్టమొచ్చినన్ని రోజులు ఉండాలని నా అభిప్రాయం.

కమల —మీరుంటే కాస్త సందడిగా ఉంటుంది.

రమణ —ఇదంతాచూస్తే తమాషాగావుంది. అయినా వరదానంగారు నాతో చెప్పారు కాబట్టి నేను ఖాళీ చేసేస్తున్నాను.

నర —ఎంతమాత్రం చెయ్యవద్దని 'రిక్వెస్ట్' చేస్తున్నాను.

రమణ —ఎందుకులెండి, నా స్నేహితులతో చేరి నానా గొడవా చేస్తూంటాను. నేను వుండడం అంత మంచిదికాదు.

కమల —అలా మేమెప్పుడూ అనుకోలేదే!.

రమణ —ఎందుకనుకుంటారూ! అసలు నేను త్రాగుబోతుని కాబట్టి ఈ గది నా కద్దె కివ్వడమే పొరపాటయిం దనుకుంటున్నారు.

సుబ్బా —అలా ఎవరన్నారు? మీ అంతమంచి వాడు లేడని వరదానంగా రబ్బాయి చెప్పాడు.

రమణ —చూడండి. మనిషన్నవాడికి ఒక్కసారి చెప్తే బుద్ధుండాలి. మీరు అన్నిసార్లు ఖాళీ చెయ్యమని చెప్పాక ఉండడం నాదే పొరపాటు.

కమల —మా ఉద్దేశం అదికాదు.

రమణ —పైగా నేను వట్టి మొండివాణ్ణి.

నర —ఛ! ఛ!

రమణ —మొండివాడు రాజుకన్నా బలవంతుడని మీరే చెప్పారు.

కమల —(నొచ్చుకుంటూ) కోపంలో అన్నమాటలు పట్టించుకుంటే ఎలా?

రమణ —నేను ఎలాగా రౌడీనయ్యె. రౌడీలకు కోపం రాకూడదంటే ఎలాగండీ?

సుబ్బా —శుద్ధ అబద్ధం. వరదానంగారి అబ్బాయి మీరు చాలా పెద్దమనిషి అని చెప్పాడు.

రమణ —పొరపాటు. కటిక కసాయి వాడికైనా జాలీ మర్యాదా ఉంటుందేమోగాని నాకు ఉండ దని వీళ్లే అన్నారు.

కమల —నోటి కొచ్చినట్లల్లా వాగేశాను. అందుకు ఇప్పుడు విచారిస్తున్నాను.

రమణ —శర్మా, సోడా పట్టారా (శర్మ సోడాబుడ్డి తెచ్చి ఇస్తాడు)

నర —ఇప్పుడు సోడాబుడ్డి ఎందుకు?

రమణ —కొళాయినీళ్లల్లో మందు కలిపిన దగ్గర్నుండీ ఆ మందునీళ్ళు తాగలేక దాహమైనప్పుడల్లా ఒక సోడా త్రాగుతున్నాను. (అని సోడాకొట్టి త్రాగేస్తాడు)

నర —ఓరి! ఇదా సోడాబుడ్ల అంతరార్థం!

(కమలా, సుబ్బారావూకూడా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతారు.)

సుబ్బా —మరి మీరు సోడాబుడ్డితో ఎదుటి వాళ్లతో యుద్ధం చేస్తారన్నాడు మా మామయ్య?

నర —అలాగని ఆ అబ్బాయి చెప్పాడు. లేకపోతే నాకేం తెలుసు.

రమణ —శుద్ధ అబద్ధం. దాహమేస్తే తప్ప నేను సోడా ముట్టుకోను.

కమల —మీరు సోడాబుడ్డి పట్టుకున్నప్పుడల్లా ఎవరి తలో పగలగొడతారని హడలిచచ్చాం.

రమ —వాట్! అంత అవసరం నాకేం వచ్చింది?

నర —ఏమో. మీరు తాగుతారనీ, బెజవాడలో ఇంటాయనను చావగొట్టారనీ అతనే చెప్పాడు.

రమణ —నాన్సెన్స్! బెజవాడలో మా స్వంత యింట్లో ఉన్నాను. పైగా నేను త్రాగడమేమిటి?

సుబ్బా —రామ! రామ! వరదానంగారబ్బాయి ఇతను చాలా దైవభక్తి కలవాడనీ, ఇతనికి ఏ దురలవాట్లూ లేవనీ చెప్పాడు.

కమల —నే నా మాట అంటూనే ఉన్నాను. నామాట వింటేనా మీరు.

నర—మరి మీ స్నేహితుడు అలా చెప్పేదేమిటి? మీరు పెద్ద రౌడీ అనీ, లెక్చరర్లను కూడా కొట్టారనీ చెప్పాడు.

రమణ —ఎవరు, వేణా ఇవన్నీ చెప్పింది?

నర —అవును.

రమణ—వాడంతేలెండి. పైకి మెత్తగా మాట్లాడుతూనే, వాడంత అబద్ధాలకోరు మరొకడుండడు. అయినా వాడు వచ్చి ఒక పూటైనా కాలేదు వాడి మాటలు ఎలా నమ్మారు.

కమల —అవి నమ్మదగినవికావని అనుమానిస్తూనే ఉన్నాను.

సుబ్బా—స్నేహితుడిమీద ఇంత ద్రోహమా?

రమణ —ద్రోహమేంకాదు. వాడు సరదాకి మిమ్మల్ని కాస్త భయపెడదామని ఈ మాటలు చెప్పి వుంటాడు. మీరు నిజం అనుకున్నారు. ఇప్పటికైనా అసలు నిజం తెలుసుకున్నారు, వెళ్తా.

నర—అహ! ఎంతమాత్రం వీల్లేదు. మీ రీ రూములోనే ఉండాలి.

కమల —మా మాటలు పట్టించుకోవద్దు.

సుబ్బా —మీరు ఎంతమాత్రం ఖాళీచెయ్యద్దు.

రమణ —మీ అందరి మాటలూచూస్తూంటే ఖాళీ చెయ్యడం కష్టంగానేవుంది. అయినా ముందు ఖాళీ చెయ్యమనీ, మళ్లీ ఖాళీ చెయ్యొద్దనటంలో ఆంతర్యం నాకర్థం కాలేదు.

దీక్షితులు —(ప్రవేశిస్తూ) బయట రిక్షాచూసి, మా జయప్రకాశ్‌గాని వచ్చాడేమోననుకున్నా. తీరా కనుక్కుంటే, ఈ ఇంట్లోవాళ్లే ఎక్కడికో వెడుతున్నారని తెలిసింది.

రమణ —మీరెవరు?

దీక్షితులు—మీరేనా ఈ గదిలో అద్దెకున్నవారు? చూడండి, నేను వారికి కావలసినవాణ్ణి. మా అబ్బాయి సెప్టెంబరు పరీక్షలకు చదువుకోడానికి వస్తున్నాడు. అందుకని మీరు గది వెంటనే ఖాళీ చేసెయ్యాలి. మీకు తెలుసునో లేదో, నేనంటే ఈ వూళ్లో చాలామందికి గురుభావమే. మీరు కూడా నామాట వినాలి.

రమణ —(కొద్దిసేపు పరిశీలనగా అందరివైపూ చూస్తాడు. అసలు విషయం చాలావరకూ గ్రహిస్తాడు. కమల తనవైపు కొంత ప్రార్థనాపూర్వకంగా చూడడంతో మనసు మార్చుకొంటాడు) అలాగా. "అయితే నేనొక నెల అద్దె అడ్వాన్సు ఇచ్చాను. పైగా ఇల్లంతా బాగు చేయించినందుకు నాకు చాలా ఖర్చయింది. అదంతా మీ రిచ్చేస్తే ఖాళీ చేసేస్తాను.

దీక్షితులు —బావగారూ! అతనికి రావల్సిందేదో అతనికిచ్చి పంపెయ్యండి.

నర—అంత డబ్బు నా దగ్గరెక్కడుందండీ. ప్రస్తుతానికి మీ రిస్తే తరువాత నే నిచ్చేస్తాను.

దీక్షితులు —నేనూ ఎక్కువ డబ్బు తీసుకురాలేదే.

రమణ —అయితే లాభంలేదు. నేను ఖాళీ చేద్దామనుకున్నా, కొందరు నా శ్రేయస్సుకోరి ఖాళీ చెయ్యొద్దంటున్నారు.

దీక్షితులు —మీరిలా మొండిపట్టుపడితే ఎలాచెప్పండి. ఈ ఇంటివారూ మేమూ కావలిసిన వాళ్లం. మీ డబ్బు మీ కెలాగైనా మా బావగారిచేత ముట్టచెప్పించే బాధ్యత నాది.

కమల —ఆయన మా గదిలో చాలాకాలంనుండి ఉంటున్నారు. ఇప్పుడు హఠాత్తుగా ఖాళీ చెయ్యమనటం ఏం బావుంటుంది మామగారూ!

రమణ —చూశారా, ఇంటిగలవాళ్లు ఎంత మంచివాళ్లో. నన్ను ఖాళీ చెయ్యమనడానికి ఎంత మొహమాట పడుతున్నారో.ఖాళీ చెయ్యమంటే నేనేం అనుకుంటానో అని పాపం ఎంతో బాధపడుతున్నారు. అలాటివార్ని వదిలి ఎలావెళ్లడం చెప్పండి?

నర—మీవల్ల ఏ తప్పూ లేనప్పుడు మిమ్మల్ని ఖాళీ చెయ్యమనడం ఎలా?

రమణ —పాపం! రామ రామ! అసలు ఖాళీ చెయ్యమనేమాట మీ నాలుకమీదకు రానేరాదు. నావల్ల ఎంత ఇబ్బంది కలిగినా వూరుకుంటున్నారు.

నర —మీవల్ల మా కే ఇబ్బందీలేదు.

దీక్షితులు —అసలు ఇలా గృహస్థుల ఇళ్లలో బ్రహ్మచారులకు గది ఇవ్వడం మంచిదికాదు. పంథొమ్మిదివందల ఏభై యారులోమావూళ్ళో ఇలా ఒక ఇంట్లో విద్యార్థికి అద్దెకిస్తే అతను ఆ యింటివారి అమ్మాయికి ఉత్తరాలు రాయడం మొదలెట్టాడు.

రమణ —నాకా 'ఐడియా' తట్టలేదు.

దీక్షితులు—ముందు ముందు చాలా అనర్థాలు రావచ్చు. అందువల్ల ఖాళీ చెయ్యడమే మంచిది. నా మాట విని కాళీ చేసెయ్యండి.

రమణ —ఎంతమాత్రం చెయ్యను. నేను ఖాళీ చేసినా మా స్నేహితు డొకడున్నాడు. వేణు అని. వాడు ఈ గదిలో చేరదలుచుకున్నాడు. అందువల్ల మా క్రిందే వుంటుంది.

దీక్షితులు—బావగారూ. నా స్నేహితు డొకాయన ఇంట్లో గది ఖాళీగా వుందిట. వారి గది ఖాయం చేసుకుని ఇప్పుడే వస్తాను.

నర—సరే అయితే.

(దీక్షితులు బయటికి వెడతాడు.)

కమల —బ్రతికాం. ఈ జిడ్డు ఎలా వదుల్తుందా అనుకున్నాం.

సుబ్బా —రమణరావుగారికి మనం చాలా కృతజ్ఞులం.

నర —సరిగ్గా ఆపదలో అడ్డుకున్నారు. మీరు ఖాళీ చెయ్యననబట్టిగాని లేకపోతే ఆ చాదస్తపు మనిషి మా మెడకు తగిలేవాడు.

రమణ —మొదట ఖాళీ చెయ్యమని నా ప్రాణం తీశారు. తీరా ఖాళీ చేసే సమయానికి వద్దు వద్దనడం మొదలెట్టారు. కాలేజీ విద్యార్థి అంటే మీ ఉద్దేశంలో చాలా చెడ్డవాడనీ, ఎందుకూ పనికిరానివాడనీ. కాస్త శుభ్రంగా బట్టలు వేసుకుని సరదాగా తిరిగే కాలేజీ కుర్రాణ్ణి చూస్తే వాడొక రౌడీ అని మీ కనుమానం. మనుష్యులలో మంచిని గ్రహించటం మీకు తెలియదు. మీరు మంచిగా ప్రవర్తించి నంతకాలం కాలేజీ కుర్రాళ్లంత మంచి వాళ్ళుండరు. మీరు హద్దుమీరి ప్రవర్తించిన నాడు మీ కన్నా పదిరెట్లు వాళ్ళు అల్లరి చేస్తారు. మనుష్యుల్ని గౌరవించడం నేర్చుకోవాలి. వస్తా. (తన గదిలోకి వెడతాడు.)

కమల—ఇప్పటికే భోజనానికి చాలా ఆలస్యమైంది. బావా నీకు వడ్డించేస్తాను రా!

నర —అవున్నా, సుబ్బారావు, నువు భోంచెయ్యి.

సుబ్బా —భోజనానికికేం గాని మామయ్యా, అసలు విషయమేమిటంటే నేను కమల్ని తప్ప ఇంకె వర్నీ వివాహం చేసుకోనని మా నాన్నతో చెప్పి వచ్చాను. ఆ విషయం మెల్లిగా మీతో చెప్దా మనుకున్నాను. కాని ఆలస్యంచేస్తే ఏ దీక్షితులుగారి అబ్బాయో, లేకపోతే ఆ గదిలో అద్దె కున్న విద్యార్థో కమల్ని ఎగరేసుకు పోతాడేమో నని భయంగావుంది. అందువల్ల వెంటనే అడిగేస్తున్నాను. మీ ఉద్దేశమేమిటి?

నర —అంతకన్నా కావలిసిందేమిట్రా!

సుబ్బా —అయితే కమలా, నువ్వేమంటావ్?

కమల —వెంటనే భోజనానికి లెమ్మంటాను.

నర—అవున్నా. దీక్షితులుగారుకూడా వస్తున్నారు. భోంచేద్దాం పద.

(లోపలికి వెడతారు.)

—తెరవాలుతుంది.





## లక్ స్మృతి

# బాలగంగాధర తిలక్

### శ్రీ వరవరరావు

కీ. శే. బాలగంగాధరతిలక్ నాకు రాసిన ఆఖరి ఉత్తరంలో ఇట్లా రాసాడు : (27 మే 66)

'........అన్ని రుతువులలోనూకూడ ఎండిపోయిన యీ మనుష్యులూ, ఊళ్ళూ మరీ చికాకుని కలిగిస్తున్నాయి. తెలుగుదేశంలో అందం ఆనందం అనేవి దొరకవేమో. ఇంత యిదిగా చచ్చి పురుగు పట్టిన సామాజిక జీవితం ఒక్కొక్కసారి నాలో భయంకరమైన నిరాశని కలిగిస్తోంది.

'.......కవి అవసరమూ, కవి ప్రేరణా యీనాడే—యీ అవ్యవస్థలోనే ఎక్కువ వుంది.... కాని దురదృష్టవశాత్తూ Mediocre Talent వస్తోంది మన రాజకీయాలూ, సినీమాలులాగా; ఏమిటి చెయ్యడం?'

'మనం తిరిగీ కొన్ని విలువల్నీ సౌందర్యాన్నీ సృజించగలమా! ఇది మనకు సవాల్!'

'........ఎంతో చికాకునీ బాధనీ లోపల్లోపల సహిస్తున్నాను.' వైయక్తికమయిన స్వప్న లోకంలో ఎన్నాళ్ళు ఉండగలడు ఎవడైనా!'

ఈ వాక్యాలు రాసిన నెలరోజులకే తిలక్ మరణించాడు. ప్రతి సాహిత్యకారుడూ శ్రద్ధగా పరిశీలించవలసిన మాటలుగా నా కివి కనిపిస్తున్నవి.

ఎండిపోయిన బావిలో కుళ్ళిపోయిన ఆకుల కింద
ఎన్నడో స్మృతి తప్పి పడిపోయిన జీవికి
ఏదో విద్యుద్ఘాతంలా సోకి కళ్ళు తెరచి చూసి నపుడు
ఆకాశంలో ఎగిరిపోతున్న గోర్వంక
కోమల పక్ష తాడనం వినిపించింది.
వెన్నెట్లో ఆడుకుంటున్న అందాల అక్షరాల బాలల
అపూర్వ సౌందర్యం కనిపించింది.
ఆధునిక జీవితాన్ని నిర్వచించే
కఠినోపనిషత్ ఘోషలు వినిపించినవి.

మనస్సరస్తీరంలో కవిత్వపు కొత్త కోణాకారపు చెట్లను
నాటుతూ రాత్రిందివాల మధ్య
రహః కిర్మీరాల రథ్య
ఒంటరిగా సాగిపోతున్న
అదృష్టాధ్వగమనుడు కనిపించాడు.

అప్పుడు, తమ్ముడూ అని నన్ను పిలిచే కవిహృదయం
అదృశ్యంగా నా అంతరాల్ని స్పృశించింది.
అన్ని రుతువుల్లోనూ ఎండిపోయిన
ఈ మనుష్యులూ పూళ్ళూ ఈసడించి
ఈ దేశంలో దుర్లభమైన
అందం, ఆనందం వెతుక్కోవడానికి
వైయక్తికమయిన స్వప్నలోకం లోంచి
విశాలమైన స్వర్గలోకాని కెగసిపోయింది ఆ అమృతపక్షి:

# శేషస్మృత్

దేవుడు
పాపం పెద్దవాడు
యుగ యుగాల వయోభారంతో
కుంగిపోయినవాడు

## తిలక్ స్మృతి

నిన్నరాత్రి వచ్చి
నీపక్కన కూచుని
మమ్మల్నీ
మా తలలమీద కొమ్ము
కత్తులు పట్టుకు మేం
నగ్నంగా తిరుగుతున్న
నాగరకతారణ్యాన్నీ
మామధ్య మొలిచిన గోడల్నీ
గోడలమీద
గొలుసుకట్టు అణుగోళాల్నీ
చూసి
కన్నకడుపు తీపితో
కంటనీరు పెట్టినప్పుడు
తానొక మిజరబుల్ ఫెయిల్యూర్‌నని
అన్నప్పుడు
నువ్వు
దేవుడి కన్నీటిని తుడిచావు
దేవుణ్ణి ఓదార్చావు
భూగోళాన్ని భద్రంగా
బాహువుల్లో ఇముడ్చుకున్నావు

అయినా వెళ్లి
మళ్లా మళ్లా మళ్లా మళ్లా వచ్చి
నీ పక్కన కూచునే దీనుడు దేవుడి
చేయి పట్టుకు
హఠాత్తుగా ఎక్కడికో ఎందుకో
వెళ్లిపోయావు
చూడు
భూమిచుటూ నీ శేషస్పర్శ
రేడియంలా మెరుస్తూ
దానిమీద అమృతం కురుస్తూ

—శ్రీ ఇస్మాయిల్

# "మరణించిన కవికుల తిలకునికి..."

మిత్రమా,

నువ్వు బ్రతికుండగా వ్రాద్దామనుకున్న లేఖ
ఈనాడు వ్రాస్తున్నాను నువ్వు మరణించాక
పుడుతూనే చచ్చిన బిడ్డల్లా, ఆలోచనలని
ఆవేదన మింగుతోంది.
అందంగా, ఆనందంగా, మల్లెపువ్వులా
సాగుతున్న జీవయాత్ర హఠాత్తుగా ఆపి
ఏ అదృశ్యలోకాలు వెతుక్కుంటూ వెళ్ళిపోయావు!
మొన్నలా, నిన్నలా వుంది.
మినా బిస్కట్ల షాపులో బిస్కట్లు తింటూ
గంటలని నిమిషాలుగా, నిమిషాలని సెకన్లుగా
గడపిన ఘట్టం. ఎందుకయ్యా అంత కోపం
మా మీద! నీ మిత్రుల మీద.
చల్లగా, తెల్లగా వెన్నెలకురిస్తే,
కమ్మగా మధురంగా కోయిల కూస్తే,
పరిమళాన్ని ఒలకబోసి జాజులు వికసిస్తే
నీ రూపమేకదా మా మనసుల్లో మెదుల్తుంది!
నీ భావనేకదా, అయోమయమ్మైన మా సాహితీ
జీవితాలని ఆల్కెమిస్తుంది. స్వర్ణమయం చేస్తుంది.
కవితా తత్వాన్ని తెలుసుకోలేక
ఎరువుతెచ్చుకున్న భావాలతో
అనుకరణతో, అంత్యప్రాసతో
కలగాపులగపు ఇమేజరీతో
Confusion Worse Confounded గా
దారి తెలియక, మాకు మేమే కల్పించుకున్న వలయంలో
పరిభ్రమిస్తున్న వేళ
"కఠినోపనిష"న్మార్గాన్ని చూపించి
సాహితీ లోకంలో జీవన్మృతులమ్మై యున్న
మామీద "అమృతం కురిపించిన రాత్రి"— ఆ రాత్రి
అంధకారమయమ్మైన మా జీవితాలలో ఒకే ఒక్క శరద్రాత్రి.

## తిలక్ స్మృతి

జరీఖండువాలూ బిరుదాంకితమైన సువర్ణపతకాలూ
ధరించి—మానవారణ్యంలోని పెద్దపులులు చేస్తున్న
కథకళీ నృత్యం చూడలేక
స్టెన్‌గన్‌లూ సోల్జర్‌లూ నాగరికతని రక్షించటానికి
మనుషుల్ని చంపటం సహించలేక
సురుచిరమూ సుందరమూ
సత్యమూ శాశ్వతమూ ఐన
లోకాన్ని వెతుక్కుంటూ నువ్వు వెళ్ళిపోయినా
అంధకారబంధురమైన మా జీవితపు చిక్కుదారుల కూడలిలో
ఈ కవితా శరీరం నిలచే ఉంటుంది
అనుక్షణం మాకు మార్గ నిర్దేశం చేస్తూనే ఉంటుంది.
ఈ ఆశ మోడువారిన మా బతుకులను
చివురింప చేస్తుంది.
మా మనఃకేదారాలలో సుకవితావర్షం
కురిపిస్తుంది. కనుకనే మేము
ఇవతలి గట్టున ఉన్నా—నువ్వు
ఆవలి గట్టు చేరుకున్నా
మన బంధం విడిపోదు—ఈ
అనుబంధం తెగిపోదు.

"జానకీజాని"

# గులాబీలు క్షణాల్ని రాల్చలేదు!

నీవు మొదటిశ్వాస తీసిన
ఆరోజున—
ఆకాశంలో నక్షత్రం నవ్విందో
లేదో
నాకు తెలీదు.

నీవు విన్పించిన కవిత విన్న
ఆరోజున—
నావంటి మిత్రుల కళ్ళల్లో
వెల్గిన తారలే

నాకు తెలుసు.
నీవు చివరిసారి వెళ్ళిపోయిన
ఆరోజున
ఆకాశం నీపైకి నక్షత్రాన్ని రువ్విందో
లేదో
నాకు తెలీదు.

నీవు ఆఖరుసారి రాసిన ఉత్తరం
మళ్ళీ చదువుకొంటూ—
హృదయంలో నీ జ్ఞాపకాల్ని
పొదవుకొంటున్న చుక్కలు
అవే నా కన్నీటి చుక్కలు
నీ వెళ్ళిపోయేదారిని వెలిగిస్తాయి
దారి కన్పించదని — వెలుగు లేదని
నీకేం కొఱత?
గుండెల్ని చీల్చుకొనివచ్చిన
కన్నీటి చుక్కలు
చీకటినేకాదు — నింగినే చీల్చేయగలవు!
కన్నీటితో
కాగితాల కత్తి పడవల్ని వదిలే
చిన్న పిల్లాడి లాంటి
నీ అమాయకపు చిఱునవ్వు
ఎందరికి గుర్తుంది నేస్తం?
కవిత్వంకన్న మృదువైన
నీ మనసులోతుల్లోకి తొంగిచూసిం దెంతమంది నేస్తం!
సానుభూతికోసం పరితపించని నీ మృతిలాంటిదే
బహుమతికోసం ఏడవని మంచి రచనలాంటి
నీ జీవితంకూడా!
షష్ఠి పూర్తులు జరుపుకొన్న
ఎంతోమంది ఇంకా పుట్టనే లేదు
మెఱుపులా నీవొచ్చి వెళ్ళిపోయా వప్పుడే!

పాటతోనే పుట్టి
పాడుతూనే కన్నుమూసే హంసలాగా—
దేనికోసం ఎదురుచూడని పరమహంసలాగా

తి ల క్ స్మృ తి

నిరీహతో నిర్గమించిన
నీవు
శబ్దాన్ని ఛేదించిన
నిశ్శబ్దఋషివి.
అందుకే నీవుపోయినప్పుడు
రాళ్ళు కన్నీళ్ళు కార్చలేదు
గులాబీలు క్షణాల్ని రాల్చలేదు!

శ్రీ అరిపిరాల విశ్వం

## స్వప్న జరి

'నిన్నరాత్రి'
నాలోని 'కిటికీ'
'ఒక్కసారి'
తెరచుకొన్నట్లయింది
'నేను కాని నేను'
'శిఖరారోహణ'
చేసినట్లయింది
అరిషడ్వర్గాలు అణచివేసి
అమరుణ్ణి అయినాననిపించింది
అజ్ఞానపు యామిని చీల్చుకొని
'జ్ఞానదీపం' వెలిగినట యింది
'విశ్వమానవుణ్ణి'అయి
ఆదర్శం అవ్వాల'నిపించింది
'నగరంమీద ప్రేమగీతం' కాక
ప్రపంచంమీద సానెట్
వ్రాయాలనిపించింది
కాని—
అదంతా క్షణికంలా
కరగిపోయిన కలలా
కథే మిగిలింది
'నువ్వులేవు నీ పాట వుంది'
అనిపించింది.

—శ్రీ "శర్మ"

# ఈ రో జు

ఈ రోజు
మా కన్నులలో చీకటి
వెన్నెలలో చీకటి
గది గదిలో చీకటి
ఎద ఎదలో చీకటి
కిరణకాంతి తరంగాలు
కమ్ముతున్న కాంతిజ్యోతి ఆరిపోయింది.
నింగినుండి తొంగి చూసే
ఏలపు చక్కని చుక్క నేల రాలిపోయింది.
మధురమయిన పరిమళాల
మత్తెక్కించే ముచ్చటయిన మల్లెపువ్వు వాడిపోయింది.

*            *            *

ఆ నాటి రాత్రి
అందరూ నిద్రించిన రాత్రి
అందమైన అప్సరసలు
అందించిన అమృతాన్ని ఆస్వాదించావు గదా
అపుడే ఎలా అంతమయ్యిందయ్యా నీ జీవితం ?
పాపా ఐవంటి సహజాతిసహజ
ఆపాతమధుర దీపాల మధ్య
ఉండలేక పాపల్లాంటి దీపాలవంటి నీ కనుపాపలు
ఆరిపోయాయా అన్నయ్యా!
మౌంట్ వెసూవియస్ ఆగ్నేయ దర్పోజ్వల జ్వాలలా
వెలిగించి దిగ్భిత్తికలు ప్రకంపింప
పాడిన నీ పాట
తరతరాలు మా హృదయాంతరాళాలలో
ప్రతిధ్వనిస్తూ దిగ్ర్గాంతులను చేస్తుంది మమ్మ
అనుకోకుండా జరిగిపోయింది
ఆ చీకటి మొగలో నిలచి పాడుతున్న నిన్ను
మృత్యువు
మొగలి పొదనుండి తిగకన్ను వోని
కుబుసం విప్పిన కోడె త్రాచయి

## తిలక్ స్మృతి

కస్సున కాటేసింది.
మా కోసం—
మిన్నేరు పన్నీరుగా దింపి
కన్నీరు మున్నీరుగా కురిసిన
నీ కోసమై
మా ఎదలు నదులై
హోరుమని భోరుమని విలపిస్తున్నాయి
ఎటకో ప్రవహిస్తున్నాయి.
దేముడు నిన్నరాత్రి వచ్చి
నీ మంచంమీద కూర్చుని
దీనంగా కన్నులు చించుకొనినప్పుడు
నువ్వు ఏమన్నావో తెలిసింది
—ఇరుకైన ఇరుల నుండి
మురికైన నరుల నుండి
తీసుకు పొమ్మని ఉంచావు—దూరంగా.

అయినా
ఇప్పటికి—ఎప్పటికి
వినిపిస్తూనే ఉంటుంది మాకు—
విచిత్ర విపంచికను మీటుకుంటూ
ప్రతి మనిషి ముందూ—ప్రతి మనసు ముందూ
ప్రతి గడప ముందూ—ప్రతి గవాక్షం ముందూ
జాలిగా—బేలగా
నువ్వు పాడిన పాట
నువ్వు ఆడిన మాట.

-శ్రీ పైడిపల్లి సత్యానంద్



# తెలుగు - ప్రాకృతము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

[కడచిన 'భారతి'లో 'అష్టభాషలను' గూర్చి వ్రాయునపుడు తెలుగు భాషకు, ప్రాకృతమునకు గల సంబంధమును గూర్చి చర్చించి, కొన్ని నిర్ణీతాంశములను తెలిపియున్నాను. వాని కాధారముగా, ఈ వ్యాసమూలమున మఱికొన్ని విషయములను వివరించుచున్నాను.]

మొట్టమొదట తెలుగుభాషకు, సంస్కృతముతో సంబంధములేనట్లే, ప్రాకృతముతో కూడా సంబంధములేదు. కాని తెలుగులో తద్భవము లేర్పడు కాలము నాటికి ప్రాకృతభాషతో సంబంధమారంభమైనదని చెప్పవచ్చును. సంస్కృత పదములు, తద్భవములుగా, పరిణామము చెందిన కాలమున ఆయా శబ్దములలో మార్పులు ప్రాకృత భాషామూలమున వచ్చినవని గ్రహింపనగును. దీనిని బట్టియే, ఈ తరువాతి వైయాకరణులు, లాక్షిణికులు తెలుగునకు, ప్రాకృతమునకు జన్యజనక సంబంధమున్నదని నిరూపించిరి. కాని తెలుగున ప్రాచీన కవులు, లాక్షిణికులు, వైయాకరణులు చెప్పిన విషయములు పరిశీలించినచో నీ యభిప్రాయ మెంతమాత్రమును సరికాదని తేలుచున్నది.

## నన్నయ

తెలుగు సాహిత్యమున-నన్నయ తాను [1]'ఉభయ భాషా కావ్యరచనాభిశోభితు'డనని మాత్రమే చెప్పుకొన్నాడు. (ఆది 1—9). కాని ప్రాకృతమును గూర్చి తెలుపనేలేదు. తన సహాధ్యాయియైన నారాయణభట్టు ప్రాకృత పైశాచిక భాషలయందు ప్రవీణుడని నందమపూడి శాసనమున తెలిపియున్నాడు. కాని నారాయణభట్టు కృతులు లభింపలేదు.[2] ఇంతకు ఆ శాసనము సంస్కృతమున నున్నది. శాసనముల మూలముగా తెలుగు కవులుగా తెలియవచ్చుచున్న గుండిమెడ అన్నమంత్రి (క్రీ. శ. 1128) నాగదేవభట్టు (క్రీ. శ. 1154) అను వారిరువురు తాము పాకృతభాషావిదులమని చెప్పుకొనలేదు. తెలుగున తొలి ఛందోలక్షణ గ్రంథమగు కవిజనాశ్రయమున—ప్రాకృతభాషా ప్రశంస లేదు.

## శివకవులు

శివకవులగు నన్నెచోడడు, పాల్కురికి సోమనాథుడు—తమ తెలుగు కృతులలో ప్రాకృత భాషా విషయము స్మరింపనేలేదు. నన్నెచోడకవి "బృహత్కథా దృఖిల విద్యా వేదికల" అని బృహత్కథను పేర్కొనినట్లు కన్పట్టుచున్నది.[3] కాని యిచ్చట నీ తరువాత ప్రాకృతభాషా భేదముగా పరిగణింపబడుచున్న పైశాచి భాషలో రచింపబడిన 'బృహత్కథ' కానట్లు తోచుచున్నది. గుణాఢ్య పండిత రచితమైన బృహత్కథ క్రీ. శ. 10 వ శతాబ్దినాటికే లభ్యము కాలేదు. క్షేమేంద్రుడు సంస్కృతభాషలో నీ మహా గ్రంథమును, 'బృహత్కథామంజరి' అనుపేర ననువ

---

1. ఉభయభాషలనగా—తెలుగు, సంస్కృతము. తిక్కనకు ఉభయ కవిమిత్ర బిరుదము కలదు. ఆ బిరుద వివరణము కేతన ఇట్లు కావించియున్నాడు.

అభినుతుఁడు తిక్కభూవిభు
సభ తెనుఁగున సంస్కృతమున చతురుండై దా
నుభయకవి మిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్.
దశకుమార చరిత్ర (1—26.)

2. భారతమున 'పాయక పాకశాసనికి' అన్న పద్యము కొన్ని వ్రాతప్రతులలోలేదు.
చూ. తెలుగుకవుల చరిత్ర. పుట 158.

3. కుమార సంభవము. 10—211.

దించియున్నాడు. ఆతడు క్రీ. శ. 1062 నాటి వాడు. నన్నయ సమకాలికుడు. ఇచట 'బృహత్కథ' యనగా, క్షేమేంద్రుని బృహత్కథామంజరిగాని, దాని నామాంతరమగు "కథాసరిత్సాగరము" కాని కాదగునని విజ్ఞుల యభిప్రాయము.4

శివకవులు—ప్రాకృతభాషా దేశిపదములకన్న—తమిళ, కన్నడ పదములను యథేచ్ఛగా వాడిరి. వారు తెలుగున దేశి పదజాలముతోపాటు, ద్రవిడ, కన్నడ సమపద ప్రయోగములను గావించి, తమ రచనలను 'దేశి' సంప్రదాయమునకు నాలంబనము చేసిరి. ఇట్టి రచననే 'జాను తెనుగు' అని నన్నచోడ పాల్కురికి సోమనాథులు పేర్కొనిరేమో చర్చింపదగియున్నది. ఇంక సంస్కృతపదములు దేశి సంప్రదాయాను సారము, మాఱినవి—శివకవులు వాడిరి. శివకవులు, సంస్కృతమును వాడినను దేశిపలుకుబడికే హెచ్చు ప్రాధాన్యత యిచ్చినందు వలన, శివకవుల భాష—నన్నయాదుల భాష కంటె, విలక్షణమై పండితలోక మును స్వల్పముగానే ఆకర్షించినది. ఇదియును శివకవులకు ప్రాకృతభాషతో సంబంధములేదని సూచించును.

### పాల్కురికి సోమనాథుడు- ప్రాకృతము

శివకవులలో పాల్కురికి సోమనాథుడు సంస్కృత మున సోమనాథ భాష్యమునందు బసవశబ్ద వ్యుత్పత్తిని నిరూపించునప్పుడు మాత్రము ప్రాకృత వ్యాకరణ కర్తయగు వరరుచిని పేర్కొన్నాడు.

బసవ శబ్ద

కో బసవ ఇతి ఇదానీం కలియుగే శివభక్తి ముద్ధర్తుం బసవాభిధేయేన వృషభ ఏవజాతః। వృషభస్య బసవ నామకత్వం కస్మాత్కారణాదాసీత్। వృకారస్య బకారాదేశో భవతి। "వబయోరభేదః"। "శషోస్స" ఇతిసూత్రాత్ షకారస్య సకారాదేశో భవతి। వః పవర్గస్యేతి వారరుచ్య సూత్రాత్ వకారస్య బకారాదేశో భవతి। ర తద్భవాత్ "బసవ" ఇతినామా వక్ష్యతే। పశూన్ పాతీతి పశుపః వృషభః తత్పశుపత్యక్షరత్రయంచ సంభవతి। కుతాల కుద్దాల తామర సాదిపదేషు తత్తదాద్యక్షరాణాం తత్తద్వర్గ తృతీయాక్షరాదేశో భవతి। యథా కుతారస్యాంధ్రభాషాయాం గకారాదిర్భవతి। తామరసస్యాంధ్ర భాషాయాం దకారాదిర్భవతి। తథైవ పశుపతి నామాద్యక్షర పకారస్య బకారాదేశో భవతి। 'శషోస్స' ఇతిసూత్రాత్ శకారస్య సకారాదేశోభవతి। "వః పవర్గస్య ఇతివరరుచి సూత్రాత్ వకారస్య బకారాదేశో భవతి।తద్భవే అతఏవ పసుపేత్యక్షరత్రయస్య బసవేత్యక్షర త్రయసిద్ధిర్భవతి.

(ప్రథమ ప్రకరణము—వృషభేంద్రమాహాత్మ్యము)

పై విషయమునే చతుర్వేదసారమున నొక సీస పద్యమున నిట్లు చెప్పియున్నాడు.

సీ. పశుపతి వృషభంబు పశుపతి పరముండు
నవఁగను జెల్లు శుభాక్షరములు
బసవ వాక్యంబు పవర్గతృతీయాక్ష
రము బకారము పకారంబు వలనఁ
బరగఁ గుద్దాల తామరస కుఠారముల్
వరుస గుద్దలియుఁ దామరయు గొడలి
యను క్రియయును శషోస్సయను వ్యాకరణసూత్ర
మున జొప్పడు సకారమున శకార
గీ. మున నహోవాయుతత్సూత్రమున వకార
మును పకారంబునను దోఁచుఁ బొలుపుమీఱ
బసవనామంబిదియు లింగభావ్యమగుట
బసవ లింగాహ్వయం బొప్పు బసవలింగ. 8. ప.

తెలుగుభాషలో మొట్టమొదట ప్రాకృత సూత్రములను తద్ద్వారమున తద్భవ ప్రక్రియా విశేషములను పేర్కొన్నవాడు సోమనాథుడేయని పై యుదాహరణము వలన విశదమగుచున్నది. అయితే ప్రస్తుతము వరరుచి ప్రణీతమైన ప్రాకృత ప్రకాశములో పై సూత్రము లగుపడవు. వానికి సంగ్రహ రూపములున్నవి. "వః పవర్గస్య" అనుదానికి 'పోవః' అని కలదు. ఇట్లే మకార, వకారముల మార్పునకు 'మోవః' అనికలదు.6

పాల్కురికి సోమనాథుడు, వరరుచిని సోమనాథ భాష్యమునందేకాక పండితారాధ్య చరిత్రమున

4. కీ. శే. నడుకుదిటి వీరరాజుగారు. కుమార సంభవటిప్పణి. అముద్రితము.

5. సోమనాథభాష్యము; గంగపట్టణపు సుబ్రహ్మణ్యదేవర ప్రకటితము. ముద్రితము. రెండవ కూర్పు 1914. భైరవ ముద్రాక్షరశాల, బందరు.

6. పోవః—పకారస్యానుక్తస్యాదివర్తినో వకారాదేశో భవతి; ప్రాకృత ప్రకాశము పరిచ్ఛేదము — 2—1 సూ; పుట—15.

స్మరించియున్నాడు. మహిమ ప్రకరణమున సంస్కృత కవులను వైయాకరణులను పేర్కొను సందర్భమున వరరుచి ప్రశంస గలదు.

"భరత విద్యాధర పాణిని క్షేమ
హరదత్త వరరుచి వరభట్ట మాఘ
జయకీర్తి కవిరాజశాకటాయన వి
జయదత్త." 105 పుట.

## తిక్కన యుగము

శివకవుల వెనుక తిక్కనయుగము సాహిత్య విషయముననేగాక భాషాపరిణామ చరిత్రమున ప్రము ఖత వహించినది. తిక్కనకాలముననే ప్రథమాంధ్ర వైయాకరణి కేతన విలసిల్లినది. కేతన వ్యాకరణము మొదటి భాషాలక్షణ గ్రంథము కాబట్టి ప్రాకృత భాషను గూర్చి యందేమి కలదో తెలిసికొనుట మనకు కర్తవ్యము.

## ఆంధ్రభాషా భూషణము

కేతన తన గ్రంథ ప్రారంభములో నిట్లు చెప్పియున్నాడు.

సంస్కృత ప్రాకృతాది లక్షణముఁ జెప్పి
తెనుఁగునకు లక్షణము జెప్పకునికి యెల్లఁ
గవి జనంబుల నేరమిగాదు నన్ను
ధన్యుగావింపఁ దలఁచిన దలఁపుగావి 7 ప.

కేతనకు ముందు తెలుగున భాషాలక్షణమగు వ్యాకరణములేదు. కాబట్టియే కేతన "సంస్కృత భాషకు, పాకృతభాషకు వ్యాకరణములున్నవి. కాని తెలుగునకు లేవు. నాకు ముందఱి కవులెవ్వరు చేయ లేదు. నేను చేయుచున్నాను" అని పై పద్యమున తెలిపియున్నాడు......ఇందున్న ప్రాకృత పదము వలన తెలుగునకు, ప్రాకృతమునకు జన్యజనక సంబంధ మున్నట్లు గ్రహింపరాదు. కేతనయు తద్భవములను నిరూపించునప్పుడు—వానికి ప్రాకృత ప్రకృతులను చూపక, సంస్కృతప్రకృతులనే చూపియున్నాడు. చూడుడు—

అర్ఘంబె యగ్గువ, దీర్ఘిక డిగ్గియ,
గుణములు గొనములు, కులము కొలము,
స్నిగ్ధంబునిద్దంబు, శ్రీ సిరి, భంగంబు
బన్నంబు, దిశ దెస, భాష బాస
యక్షులు జక్కులు, యముఁడుజముండగు,
నాజ్ఞప్తి యానతి, యాజ్ఞ యాన
ద్యూతంబు జూదంబు, దోషంబు దోసంబు,
ముగ్ధుండు ముగుదుండు, ముఖము మొగము
పసదనంబు ప్రసాదనం బసము యశము
నమ్మెటయు చర్మయష్టి కర్జంబుకార్య
మీారసం బీర్ష్య పేరంబు వైర మిట్టి
పగిది పల్కులు తద్భవ పదము లయ్యె23 ప.

పై యుదాహృతులను బట్టి కేతన ప్రాకృత మునకు తెలుగునకు జన్యజనకత్వము నిరూపించ లేదనుట నిశ్చితము.

తిక్కన కాలమున నితర కవులును ప్రాకృతభాషా ప్రశంస చేయలేదు. తిక్కన నిర్వచనోత్తర రామా యణమున-నన్నయ ననుసరించి, తాను 'ఉభయ కావ్య ప్రౌఢిఁ బాటించుశిల్పముననన్‌పారగుడన్'(1-13)అని చెప్పుకొన్నాడు. తిక్కన శిష్యుడు మారన—తిక్కనను ఉభయ కవిత్వ తత్త్వవిభవోజ్జ్వలు (1—9) అని పేర్కొన్నాడు. ఆ కాలము వాడేయగు మంచన కేయూరబాహు చరిత్రలో "ఉభయ కావ్యసరణిజ్ఞాని" 1—7అని తన్ను గూర్చి వ్రాసికొన్నాడు.

ఇట్లే కవులు ప్రాకృతభాషా ప్రశంస చేయక పోయినను తిక్కన కాలమున కవులు సంస్కృతాంధ్ర ములతో పాటు ప్రాకృతభాషల నభ్యసించినట్లే క్రింది యంశము వలన తెలియుచున్నది.

క్రీ. శ. 1400 ప్రాంతమున నున్న జక్కన తన పూర్వులలో నొకడగు పెద్దయామాత్యుడు—నెల్లూరి తిక్కరాజు కాలమున—(క్రీ. శ. 1240 ప్రాంతము) నాతని సభలో—

"సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల
గడియలో నొక శతకంబు" జెప్పెనటుల తన

విక్రమార్కచరిత్రమున వ్రాసియున్నాడు—

## ఎఱ్ఱన—గాసట బీసట

ఎఱ్ఱన నృసింహపురాణములో

భాసుర భారతార్థ బహుభంగుల నిక్కమెఱుంగనేరమిన్
గాసట బీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసముని ప్రణీతపరమార్థము
తెల్లగజేసినట్టి యబ్జాసనకల్పులందలఁతు
నాద్యుల నన్నప తిక్కనార్యులన్. (1—9.)

అని నన్నయ తిక్కనల నుతించియున్నాడు.

ఇచట 'గాసట బీసట' అను పదమునకు శబ్ద రత్నాకరమున పై పద్యమే యుదాహరింపబడి "దే. వి. సలక్షణముగాని చదువు" అని 234 పుటలో యున్నది. కాని యీ యర్థము సరికాదని నేను నిరూపించి యుంటిని[7]. దాని వివరణ యిచ్చుచున్నాను.

'గాసట బీసట' అనునది గాసట—బీసట అను రెండు పదముల సమాసము.

గాసట—గాథాసప్తశతి—తద్భవరూపము
బీసట—బేతాళపంచవింశతి

ప్రాకృత బాషాసంప్రదాయము ననుసరించి, పై తద్భవరూపము లేర్పడును. గాథా గాహా-గా; సప్తశతి సయి—సట. బేతాళ-బే పంచవింశతి-సట—సంస్కృతమున వేతాళపంచవింశతి; విజయాదిత్య శబ్దము 'బేత' య్యెనట్లుగా బేతాళపంచవింశతి 'బీసట' అయినది.

ఆంధ్రరాజులు ప్రాకృతము రాజభాషగా చేయుటచేత, తెలుగువారు, ప్రాకృతభాషలోనున్న పై రెండు కావ్యములను చదివెడివారు. అవి గాథా ఛందస్సులలో నున్నవి. అయినను—అవి కేవలము—కథాకావ్యములకు సంబంధించినవి. గాథాసప్తశతి—సంకలన గ్రంథము. బేతాళ పంచ వింశతి కేవల కథా కావ్యమే. అవి చదువుట వలన, భౌతికమైన సాహిత్య వినోదమేకాని, అధ్యాత్మిక నైతిక దృష్టి కలుగదు. ఇంతేకాక, అవి వైదిక సంప్రదాయములను మాత్రము తెలుపవు. దీనిని బట్టి 'గాసట బీసట' అనగా—ఆధ్యాత్మిక దృష్టిలేని చదువు అని యర్థము. నా యీ వివరణము విద్వాంసు లామోదించిరి.[8]

ఈ 'గాసట బీసట' అనుపదము విన్నకోట పెద్దన కాలముననే అర్థము కాకుండపోయినది. అది ఏదో 'తెలియని భాష' అను నర్థముక్రిందికి వచ్చినది. పెద్దన గ్రామ్యలక్షణము చెప్పుచు నిట్లు వ్రాసి యున్నాడు.

ఈసడములు గోరదములు
గాసర బీసరలు నైన కట్టిడి పలుకుల్
భాసిల్లు గ్రామ్యములునా
హాసోక్తులు దెగడు చోట నవియును నొప్పున్. (9—20)

అచ్చులో 'గాసర బీసరలు' అని యున్నను వ్రాత ప్రతులలో "గాసట బీసటలు" అని స్పష్టముగా నున్నది.[9] గోరడములు అనుచోట "గోసడములు" అని యుండవలెను. గోసడము—ఘోషణ శబ్దభవము—గొప్పలు చెప్పుకొనుట అని యర్థము.

ఈ పదము, కకారాది పదముగా గ్రహించి, యర్థము తీయుటకు, విమర్శకులు ప్రయత్నించిరి.[10]

'కాసట బీసట' అనునది కాసరకూసర, కొక్కొరి బిక్కిరి, చీకిలిమాకిలి, వీసరపోసర, వంకరటింకర—ఇత్యాది జాతిలోనిది. కాసట బీసట అనగా 'తెలియనిభాష' యని యర్థము.

శబ్దరత్నాకరమున నీ పదము 'గ' కారాదిగానే యున్నది. కాని యీ యర్థము వలన పద్యములోని భావమునకు భంగమువచ్చును. 'గాసట బీసటే చదివి' అనునప్పుడు 'గాసట బీసట' అనగా 'తెలియనిభాష' అనునప్పుడు—తెలియనిభాషను చదువుట యేమి? అను ప్రశ్న వచ్చును. 'చదువు' అను క్రియ ముఖ్యము గావున, దాని ననుసరించి, శబ్దరత్నాకరకారులు—"సలక్షణముగాని చదువు" అని వ్రాసియున్నారు. అనగా ఆ చదువు కావ్యములు సలక్షణములుగా లేవని అందలి యర్థము. ఎఱ్ఱనయు నీ పద్యమున నన్నయ భారత రచనకు పూర్వము తెలుగువారు కొన్ని కావ్యములు చదివెడి వారనియు, అవి మహాభారతమువంటి కావ్యములు కావనియు స్పష్టపఱచి యున్నాడు.

నేడు, మనకు గాసట బీసట పదము యొక్క అర్థము స్పష్టమైనది. దీనిని బట్టి మొదట ప్రాకృత

---

7. భారతి—రజితోత్సవ సంపుటము. జాన్యువరి 1949.

8. నృసింహ పురాణము. పద వివరణము. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు.

9. కావ్యాలంకార చూడామణి పాఠభేదములు. ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణ.

10. గాసట బీసట-కీ.శే.విమర్శాదర్శక నడకుదిటి వీరరాజు. సారస్వత సర్వస్వము. సం. 2 సం. 4 పుటలు 78—82. (1924)

కావ్యముల నాదరించిన తెలుగువారు, మహాభారతము సంస్కృత భాషనుండి తెలుగులో అవతరించిన వెనుక, ఈ ప్రాకృత కావ్యపఠనము ప్రాయికముగా నంతరించిన దనియే చెప్పవచ్చును.

శ్రీ నా థు డు

ప్రాకృత కావ్యపఠనము లేకపోయినను ప్రాకృత భాషాభ్యసనము తెలుగుకవులు చేయుచున్నట్లు శ్రీనాథుని జీవితచరిత్ర నుండి మనకు తెలియుచున్నది. శ్రీనాథునికి కొంచెము ముందుగా క్రీ. శ. 1350 ప్రాంతమున వెన్నెలకంటి అన్నయ్య—షోడశ కుమార చరిత్రలో—"అష్టభాషల ప్రశంస" గలదు. అష్ట భాషలలో ప్రాకృతమున్నది గావున ఆ కాలమున కవు లభ్యసించుచున్నట్లు స్పష్టము.

ఇక తెలుగునకు సంబంధించిన ప్రాకృతభాషా చరిత్రలో శ్రీనాథుడు ఒక ముఖ్యఘట్టము. అతడు తన తెలుగు కావ్యములలో ప్రాకృత భాషాప్రసక్తిని తేకపోయినను, ప్రాకృతభాషలలో పరిణితప్రజ్ఞుడై నట్లు దుగ్గన నాసికేతూపాఖ్యానమున 'సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య భాషావరిజ్ఞాన పాటవంబు' (1—18)అన్న సీసపాదము చెప్పుచున్నది. ఇక మనకు తెలిసినంతవఱకు ప్రాకృతకావ్యమును తెలుగులోనికి అనువదించిన తొలికవి శ్రీనాథుడే. ఆతని శాలివాహన సప్తశతి భాషాంతరీకరణమును గూర్చి యీవఱకే తెలిపితిని. శ్రీనాథయుగము పూర్వార్ధమున—సింహాసన ద్వాత్రింశికలో (1—46) కొఱవి గోపరాజును, పర్వత పురాణము అను శ్రీశైలఖండమున (4—32) నాగు లూటి శేషనారాధ్యుడును, ప్రాకృతభాషా పాదములు గల సీసపద్యములు రచించియున్నారు. శ్రీనాథ మహాకవి శాలివాహనసప్తశతి రచనము క్రీ. శ. 1400 ముందే యగుట నిశ్చితము.

ఇట్లు కవిత్రయము, శివకవులు, శ్రీనాథ యుగ ప్రథమదశ — ఈ కాలము వఱకు అనగా క్రీ. శ. 1050 నుండి క్రీ. శ. 1400 వఱకును— ప్రాకృతభాషా ప్రసక్తిని వివరించితిని.

క్రీ. శ. 1400 నుండి తెలుగునకు ప్రాకృ తత్వము సంఘటించినదని చెప్పవచ్చును.ఆ కాలముననే యున్న విన్నకోట పెద్దన తెలుగు ప్రాకృత భేదమని స్పష్టపఱచుటయే గాక ఆ ప్రాకృత వ్యాకరణ కర్తల నిద్దరిని పేర్కొన్నాడు.

విశ్రుతులు హేమచంద్రత్రివిక్రమాదు
లొనర జూపిరి ప్రాకృతంబునకు త్రోవ
ఆంధ్రభాషయు ప్రాకృతాహ్వయముకాన
వలయుఁ దల్లక్షణంబులు వరుసఁ దెలియ
(9—8)

పై వ్యాకర్తలలో హేమచంద్రుడు మహా ప్రసిద్ధుడు. క్రీ. శ. 1088—1177 వఱకు జీవించినవాడు. త్రివిక్రముడు క్రీ. శ. 1350 ప్రాంతమువాడు. ఈ పెద్దనయే—ప్రాకృత నిభమగు నది—అనగా ప్రాకృతముతో సమానమైనది తెనుగు భాషాభేదములలో తద్భవమని యీ క్రింది పద్యమున జెప్పియున్నాడు.

వదలక సిద్ధాక్షరములఁ
బొదివిన వర్ణములఁ దూలిపోఁబలికిన న
ర్థదమై ప్రాకృతనిభమగు
నది తద్భవపదమునాగ నభినుతమయ్యెన్
(9—14)

ఇచట సిద్ధాక్షరములనగా, సంస్కృతము నందు సిద్ధమైన అక్షరములు. అవి—ఉచ్చారణవశమున తేలి పలికినపుడు—ఆ యక్షరములున్న పదములు— దానినుండి—అనగా సంస్కృతము నుండి—పుట్టినవని యర్థము.! ప్రాకృతపదము లన్నియు చాలవఱకు నిట్లేర్పడినవే కాబట్టి తద్భవములు ప్రాకృతముతో సమానమైనవి.

పెద్దన యిట్లు ప్రాకృతమని చెప్పినను— ఆతడిచ్చిన యుదాహరణము లన్నింటియందును, సంస్కృత ప్రకృతులే చూపబడినవిగాని ప్రాకృత భాషా సమములు చూపబడలేదు.

సి. యజ్ఞంబు జన్నంబు యత్నంబు జతనంబు
చంద్రముడనుపేరు చందమామ
యోధులు జోదులు యోగులు జోగులు
భేదంబు బిందంబు పృథివి పుడమి
విషయండు వెన్నుండు, వెజ్జునావైద్యుండు
పుస్తంబు పొత్తంబు ప్రోడ ప్రౌఢ

కుబ్జుండు గుజ్జుండు కుక్కుకుర్కురమగు
శయ్యయుసజ్జనా జాడిజాతి
యనెడు పల్కులు తద్భవాహ్వయములండ్రు."
(9—15)

పై వానియందెల్ల సంస్కృత ప్రకృతులే చూపబడినవి. పెద్దనకు రెండు శతాబ్దులకు పూర్వమే కేతన సంస్కృత ప్రకృతులనే చూపెనని యీవఱకే తెలిపితిని. దీనివలన క్రీ. శ. 14 వ శతాబ్ది నాటికి తెలుగుభాషలో తద్భవములకు ప్రకృతి, ఒక్క సంస్కృతమే యనియు ప్రాకృతముకూడ మఱియొక ప్రకృతిగా పరిగణితము కాలేదనియు స్పష్టమగుచున్నది.

పెద్దనయు, వేఱొకచోట కూడ తెనుగు ప్రాకృత భాషారీతినే వెలసినదని తెలిపియున్నాడు.

తెలుగుం బ్రాకృతభంగిని
బలియుటచే నేకవచన బహువచన పదం
బుల కాని ద్వివచనంబులు
గలుగవు త్త్రిక్రియల కారకంబుల యందున్
(9—72.)

పెద్దన యిట్లు చెప్పినను ప్రాకృతమునకు తెలుగునకు సంబంధములేదు. దీని నిట్లు నిరూపింప వచ్చును.

1. ప్రాకృత పదములకు తెలుగు ప్రత్యయములను చేర్చినగాని యథాస్వరూపముగ గ్రహింపజాలము.

| సం. | ప్రా. | తెలుగు |
|---|---|---|
| విష్ణు | విణ్హు | వెన్నుఁడు |
| యజ్ఞ | జణ్ణో | జన్నము |
| ఆశ్చర్యమ్ | అచ్చేరం | అచ్చెరువు |

2. పదాంతమున—ప్రాకృతమున—నిండుసున్న నిలుచును.

ప్రయాణమ్—పయాణం.

3. ప్రాకృతమున పదమధ్యమున అచ్చుండును—తెలుగున నట్లుండదు.

వచన—వఅణ—

లోక—

4. మహాప్రాణములు తెలుగులోలేవు. ప్రాకృతమున నుండును.

అర్థ—అత్థ—సంవత్సర—సవచ్ఛర.

5. ప్రాకృతమున పదాదియందు ణ, ళ, ఫ్హ, వో—అను నక్షరము లుండును.

తెలుగున అట్లుండవు.

నగ—ణఅ. ఊర్ధ్వ—వుడ్ఢ—

6. సంధి విషయమున తెలుగునకు ప్రాకృతమునకు సంబంధములేదు. ప్రాకృతమున హలంత పదములు—పదమధ్యాచ్చు ఉండుటయే వీనిభిన్నత్వము సూచించుచున్నది.

7. విభక్తులలో నామములకు ప్రత్యయములు చేరవు.

అపరద్వారే—అపరదారే.

8. క్రియారూపములు సంస్కృత క్రియారూపముల ననుసరించి యుండును.

భవతి—హవఇ — హోయి — తెనుగు—వచ్చుచున్నాడు.

9. ప్రాకృత సర్వనామములకు తెలుగునకు సంబంధములేదు.

సం. సభార్యా నాగనికా.

ప్రా. భయాయచ స నాకానికాయ.

తె. భార్యనాగనికతో కూడినవాడు.

10. పాకృతమున సమాసములు సంస్కృత పరిపాటి బట్టి యేర్పడును. మార్పుండదు.

ప్రాకృతకావ్యం—పాఉఅ కవ్వం

11. కారకము, వాక్యనిర్మాణము సంస్కృతము ననుసరించి యుండును.

సం. శ్రావస్త్యాం కిల అదత్త పూర్వకో నామ బ్రాహ్మణో అభూత్.

ప్రా. సావత్థియం కిర అదిణ్ణ పువ్వకో నామ బ్రాహ్మణో అహోసి.

12. విశేష్యవిశేషణముల లింగవచన విభక్తులు, సంస్కృతము ననుసరించియే యుండును.

## వర్ణ సమామ్నాయము

### సంస్కృత ప్రాకృత వర్ణవిభజనము

ఇక తెలుగు వ్యాకరణములలో ప్రాకృత భాషా ప్రసక్తి యెట్లున్నదో వివరించుచున్నాను.

వర్ణసమామ్నాయమును వివరించు సందర్భమున సంస్కృత ప్రాకృత వర్ణ విభజన, సంస్కృత భాష యందున్న తెలుగు భాషా వ్యాకరణములందే యున్నది గాని, తెలుగున రచించిన వ్యాకరణములలో లేనేలేదు. ఈ విషయమొక్కటియే తెలుగు ప్రాకృత ములకు జన్యజనక సంబంధము లేదని స్పష్టపరచు చున్నది. అంతేకాదు. ఆ సంస్కృత వ్యాకరణములు తెలుగు వ్యాకరణములకన్న సర్వాచీనములని నిర్ధారితము లగుచున్నది.

నన్నయభట్టు విరచితమని చెప్పబడిన 'ఆంధ్ర శబ్ద చింతామణి'లో వర్ణసమామ్నాయ వివరణ సందర్భ మిట్లున్నది.

ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః (సంజ్ఞాపరిచ్ఛేదము— ౫ సూ.)
ప్రకృతేస్తు తే దశోనస్యుః ,,
షట్త్రింశ దత్ర తేఽ న్యే చాస్మిన్ప్రవిశన్తి ,,
శబ్దయోగవశాత్ ,,

పై వానిని బట్టి సంస్కృతమున కేబది వర్ణములని, ప్రాకృతమునకు నలువది అని, తెలుగు నకు ముప్పది ఆఱు అని (షట్త్రింశత్—ఇచ్చట సప్త త్రింశత్ అని పాఠభేదము) తెలియదగియున్నది.

దీన్ని ననుసరించియే చిన్నయసూరి బాల వ్యాకరణమున నిట్లు సూత్రింపబడినది.

సంస్కృతభాషకు వర్ణంబు లేబది—సంజ్ఞా ,, 1
ప్రాకృతంబునకు వర్ణంబులు నలువది ,, 2
తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు ,, 3

కాని వర్ణసమామ్నాయ వివరణమున- ఇట్టి భాషా విభజనగాని, సంఖ్యావిభజనముగాని తెలుగు వైయాకరణులుగాని లాక్షణికులుగాని చేయలేదు. వారు వర్ణ సమామ్నాయమునంతయు నేకైకముగా తెలుగుభాషావర్ణసమామ్నాయముగానే పరిగణించిరి. చూడుడు.

### కేతన—ఆంధ్రభాషాభూషణము

ఇందు రెండు పద్యములు వర్ణసమామ్నాయ మును గూర్చి గలవు.

ఆదులు స్వరములు నచ్చులు
కాదులొగిన్ వ్యంజనములు హల్లులు ననఁగా
మేదిని నెల్లెడఁ జెల్లును
కాదుల నైదైదు గూర్ప నగు వర్గంబుల్
15 ప.

యరలవలును శషసహలును
నరయఁగ నంతస్థ లూష్మ లనఁగాఁ జెల్లున్
సరవి నివె పేళ్లు పెట్టుదుఁ
దిరముగఁ దల్లక్షణంబుఁ దెలిపెడి చోటన్
16 ప.

### పెద్దన—కావ్యాలంకార చూడామణి

(నవమోల్లాసము)

స్వరములు నచ్చులు ననఁగా
నరయ నకారాది సంజ్ఞ నయ్యక్కరముల్
దిరముగ హల్వ్యంజనములు
వరుస గకారాది పంచవర్గాక్షరముల్ 9 ప.

యరలవ లంతస్థలునా
నురవగు శషసహలు పొల్పు నూష్మలనంగాఁ
బరువడి ప్రయోగముల యెడ
విరచింపుదుఁ దెలియ వలయు వీని తెలుఁగుల్.
10 ప.

### అనంతుడు—ఛందోదర్పణము

అనంతుడే తెలుగు లాక్షణికులలో, వర్ణ సమామ్నాయము సంఖ్యాపూర్వకముగ దెల్పిన మొదటి కవి. పైని వివరించిన పంచాశద్వర్ణములు అనంతుడు పేర్కొనుచు, వానిని సంస్కృతమునకు తెలుగు భాషకు సమానమనియు, తెలుఁగున ఱ, ళ అను రెండు వర్ణము లధికమనియు నిట్లు చెప్పియున్నాడు.

భూమిఁ బదాఱచ్చులునా
గా మెఱసి అకారమాదిగా స్వరములగున్
కా మొదలు క్ష కారము తుద
యై ముప్పదినాల్గు హల్లులగు వ్యంజనముల్
(4—123)

తగు హ్రస్వంబులు దీర్ఘము
లగు ఆఇ ఉ ఋ ఇ లును వెండి హ్రస్వాభావం
బగు ఏ ఐ ఓ ఔలు నె
సగు అంఅ యనగ షోడశ స్వరము లగున్
(4—124)

కచటతప వర్గ వర్ణము
లెచటన్ స్పర్శలగు నిరువదేన్మై మఱి యం
దుచితగతిన్ ఙ ఞ ణ న మ
ప్రచయం బనునాసికాఖ్యఁ బ్రస్తుతి నొందున్
(4—125)

యరలవ లంతస్థలు నాఁ
బరగును శషసహలు తేటపడు నూష్మ లనన్
నొరిది క్షకారము గూడఁగ
నరినేఁబదియయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్
(4—126)

ళలలకు భేదములేదను
పలుకున ళా దొలఁగి యెదుపదులగువర్ణం
బులు సంస్కృతభాషకు మఱి .
తెలుగున ఱ ళ లనఁగ రెండధికమంద్రడు హరీ
(4—127)

తాతంభట్టు కవి—చింతామణి

స్వరములు నచ్చులు ననఁగా
నరయ నకారాదిగ గల యక్షరములునౌ
యరలవ లంతస్థలు భా
స్వరముగనై యొఱలు వృద్ధి శషసహ లూష్మల్
(ప్రారంభము)

గణపవరపు వెంకటకవి
(ఆంధ్రకౌముది)

ఆదులు స్వరములు వచ్చులనగ నొప్పు
గాదులు హల్ వ్యంజనాఖ్యలఁ దగు
................శషసహలూష్మలగును.

పై ఉదాహరణను బట్టి తెలుగున వ్యాకరణములో—వర్ణసమామ్నాయమున ప్రాచీనమునుండి సంస్కృత ప్రాకృత విభజనలేదని విశదమగుచున్నది. ఇక క్రీ. శ. 1656 ప్రాంతమున వ్యాప్తిలోనికి వచ్చిన అష్టభాషా పరిగణన (తెలుగు సంస్కృతములతో ఆఱు ప్రాకృతములు) అంతకుముందులేదని తెలియు

చున్నది. క్రీ. శ. 1674 ప్రాంతమునన్న గణపవరపు వెంకటకవి ఈ విభజన చేయకుండుటచేత ఈసంస్కృత ప్రాకృత విభజనగల ఆంధ్రశబ్ద చింతామణి 1600 ప్రాంతమున రచితమైనదని, అది నన్నయకృతము కానేరదని స్పష్టమగుచున్నది.[11]

పైని యుదాహరించిన లాక్షణికులలో విన్నకోట పెద్దన తెలుగును ప్రాకృత విభమని చెప్పి ప్రాకృత వైయాకరణులను కంఠోక్తిగా పేర్కొనెనని యీవఱకే తెల్పితిని. అట్టి ప్రాకృత భాషావాది కూడ వర్ణసమామ్నాయమున 'ప్రాకృతము' పేరైన తలపెట్టలేదు.

కాబట్టి వర్ణసమామ్నాయ విషయమున ప్రాకృత భాషాప్రసక్తి లేదని నిర్ధారితము.

### తత్సమ తద్భవ దేశ్య విభాగము

తెలుగు వ్యాకరణము లన్నింటియందును, పదజాలము — తత్సమ తద్భవ దేశ్యములనెడి విభాగ ముండుట యందఱెఱింగినదే. అయితే ఆంధ్రశబ్ద చింతామణిలో 'తత్సమ' పదము ప్రయుక్తము కాలేదు. తరువాత చింతామణి ననుసరించిన సంస్కృత వ్యాకరణ ములలో 'తత్సమ' పదమున్నది. కాని ఇంతవఱకు నే వ్యాకరణ వ్యాఖ్యానములందుగాని, వ్యాకరణ సర్వస్వ, భాషాచరిత్ర, భాషావికాసాదుల యందుగాని, ఈ విభాగ మెచ్చటనుండి గ్రహింపబడినది అన్న విషయము చర్చింపబడలేదు. తత్సమము—తత్-సంస్కృతముతో, సమ—సమానమైనది అను వ్యుత్పత్తిచేత నిది సంస్కృత భాషనుండి గ్రహింపబడ లేదనుట నిర్వివాదాంశము. సంస్కృతము భాషాకుటుంబములలో సంశ్లిష్ట భాషావర్గమునకు చెందినది కాబట్టి, అందిట్టి విభజన ఎంతమాత్రము చేయుటకు నీలులేదు. ఇక దేశభాష లలో, తమిళమున సంస్కృతపదము తత్సమ రూపముగా ప్రవేశించుటకు అవకాశము లేకపోవుట చేత, ఆ వ్యాకరణము నుండి ఈ విభాగము గ్రహింపబడలేదు. కన్నడభాషలో 'తత్సమ' ప్రసక్తి యున్నను—అందు సమసంస్కృతము—అను విభాగ మునకే ప్రాధాన్యము. అయితే యీ విభాగ మెక్కడినుండి గ్రహింపబడినది అనుదానికి-తెలుగుభాషా విషయక గ్రంథములలో రెండు గ్రంథములయందు మాత్రమే ప్రత్యుత్తరము గలదు.[12]

"ఒక భాషలోని కితరభాషలనుండి సంక్ర మించిన పదములన్నింటిని, అన్యదేశ్యములుగా పరిగ ణించిన చాలదా అని విచారించినచో వీరికీ సంప్ర దాయము ప్రాకృత వ్యాకరణముల ఫక్కి ననుసరించుట వలన వచ్చినదని తెలియకపోదు. మొదట 'తత్సమ తద్భవ దేశి విభాగము' ప్రాకృతవ్యాకరణములలో గనబడు చున్నది. ఆంధ్ర వైయాకరణులును వారి మార్గమునే యనుసరించి యుండురనుటకు సందేహము లేదు" అని కలదు.

రెండవదానిలో "ప్రాకృత వైయాకరణుల వలెనే దేశభాషా వైయాకరణులు నీ భాషాశబ్దము లను తత్సమ, తద్భవ, దేశ్యములనియే విభాగించిరి" అని యున్నది.

పై యుదాహృతులను బట్టి తత్సమ తద్భవ దేశ్య విభాగము ప్రాకృతవ్యాకరణములనుండి గ్రహింప బడినదని వ్యక్తమగుచున్నది.

### కేతన—హేమచంద్రుడు

తెలుగు వ్యాకర్తలలో ప్రథముడైన కేతన— తత్సమ తద్భవ దేశ్య విభాగమును, మహాప్రసిద్ధుడగు హేమచంద్రాచార్యుని ప్రాకృత వ్యాకరణము ననుసరించి నట్లు పైనుదాహరించిన మొదటి గ్రంథమున నున్నది.[13] కాని కేతన హేమచంద్రుననుసరించియే,

---

11. చింతామణి ననుసరించి చిన్నయసూరి బాల వ్యాకరణమున ప్రాకృతప్రసక్తి యున్నదిగాని—అంతకు ముందు- అనగా క్రీ.శ. 1858 కి ముందు పుట్టిన అయిదు వ్యాకరణములలో 1. పట్టాభిరామ పండితీ యము (1820) 2. ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము (1834) 3. గురుమూర్తిశాస్త్రి వ్యాకరణము (1839) 4. శేషయ్య వ్యాకరణము (1856) 5. లఘువ్యాకరణము (1857) దేనియందును వర్ణ సమామ్నాయమున ప్రాకృతభాషా విభజనలేదు.

12. (1) భాషాచారిత్రక వ్యాసములు = ఆంధ్ర దేశ్యము అన్యదేశ్యము అను శీర్షిక, పుట. 111.

(2) భాషాసారస్వతములు—దేశి—31

ఈ రెండింటికి కర్తలు కీర్తిశేషులు శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు

13. చూడుడు పుటలు 109—110.

ఈ విభాగము తెలుగున నెలకొల్పెననుటకు వారివారి కాలములే నిరోధించుచున్నవి. హేమచంద్రుని కాలము స్పష్టమైనదే. అతడు క్రీ. శ. 1088—1173 ప్రాంతమున జీవించియున్నాడని ముందు తెలిపితిని. కేతన కాలము స్పష్టమైనది.[14] అతడు తిక్కన జీవిత ప్రథమదశలో మనుమసిద్ధి యొద్ద మంత్రిత్వము వహించినప్పుడు తన దశకుమార చరిత్ర మును కృతినిచ్చియున్నాడు. అది క్రీ. శ. 1250 ప్రాంతము కాదగును. కేతన తిక్కనకన్న పెద్దవాడని దశకుమారచరిత్ర కృత్యాదినిబట్టి తెలియుచున్నది.[15] క్రీ.శ. 1250కే పెద్దవాడగు కేతన క్రీ.శ. 1173లో కీర్తిశేషుడైన హేమచంద్రాచార్యుని గ్రంథమును చూచి, తన గ్రంథములో నా విషయము ననువదించె ననుట కేయాధారమునులేదు. "సంస్కృత ప్రాకృతాది లక్షణము చెప్పి" అను పాదమునందలి 'ప్రాకృతాది లక్షణము' అనునదియే, హేమచంద్రుని కేతన యను సరణమునకు మూలమైనదని వ్రాయుటకు హేతువైనది. కాని యంతకుముందు వరరుచి ప్రాకృత ప్రకాశము వ్యాప్తిలో నున్నట్లు ముందే చూపితిని. కాని కేతన ప్రాకృత వ్యాకరణముల ననుసరింపలేదు.

ఆతడీ విభజనమును—దండికావ్యాదర్శము నుండి గ్రహించియున్నాడు. అభినవదండి యగు కేతన— దండి దశకుమార చరిత్రతోనే కాక, దండి కావ్యాదర్శముతోడను సుపరిచితుడనుటకు సందేహమే లేదు. కావ్యాదర్శమున పై విషయమిట్లు తెలుపబడినది.

సంస్కృతంనామ దైవీవాగన్వాఖ్యాతా మహర్షిభిః
తద్భవస్తత్సమోదేశీ త్యనేకః ప్రాకృతక్రమః
ప్రథమపరిచ్ఛేదము—33 శ్లో.

తత్సమతద్భవదేశ్య విభాగము దండి కన్నను చాలా ప్రాచీనమైనదే. భరత నాట్య శాస్త్రమునం దిట్లు గలదు.[16]

"నాట్యప్రయోగమందు ప్రాకృత పాఠ్యము— సంగ్రహముగా మూడు విధములు. సమానము (తత్సమము) విభ్రష్టము (తద్భవము) దేశీగతము (దేశి లేదా గ్రావ్యము.)"

దీనిని బట్టి కేతన యీ విభజనలో ప్రాకృత వైయాకరణుల ననుసరింప లేదనియు, సంస్కృత అలంకార శాస్త్రజ్ఞులనే యనుసరించెననియు, కేతన ననుసరించి, తక్కిన లాక్షణికు లందఱును తెలుగున నీ విభజన పాటించిరనియు నిశ్చితమగుచున్నది.

## ప్రాకృతసమములు—ప్రాకృతభవములు

చిన్నయసూరి బాలవ్యాకరణమున, ఆంధ్ర శబ్ద చింతామణి ననుసరించి, తెనుగునకు ప్రకృతి ద్వయము నంగీకరించి, ప్రాకృత సమములు ప్రాకృత భవములు—అను విభాగము గావించినాడు.

సంస్కృత ప్రాకృతతుల్యంబగు భాష తత్సమంబు—సంజ్ఞ. 19. సూ—అను సూత్రమున అగ్గి, ఆడి, ఓలి, కారము, గారవము, జడ, మేర, జముఁడు, రాణి, సింగారము, సిరి—అను పదకొండు పదములును ప్రాకృత సమములుగా నుదాహరించి యున్నాడు.

సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు—సంజ్ఞ. 20 సూ—అను సూత్రమున— ఇంగలము, అచ్చర, అచ్చెరువు, పనస, పుడమి, పయనము, పవడము (పగడము), మచ్చరము; జన్నము, లచ్చి, వెన్నుఁడు, వెజ్జు, కంబము, తోరము—అను పద్నాల్గు పదములను — ప్రాకృతభవములుగా నుదాహరించి యున్నాడు.

కాని పై విభాగమును నంతకుముందు తెలుగు వ్యాకరణకర్త లెవ్వరును తెలుపలేదు. చిన్నయసూరి చింతామణి నాధారము చేసికొన్న కారణముచేత, అనావశ్యకముగ నీ విభజన చేసెను. ఇంతేకాదు. పూర్వ వ్యాకర్త లెవ్వరును సంస్కృతమునకువలె ప్రాకృత మునకు నెంతమాత్రము తత్సమత్వ మంగీకరింపలేదు. చిన్నయసూరియు 19 వ సూత్రమున—ప్రాకృత

14. కడచిన భారతిలో 'మారన మహాకవి కాలము' అను వ్యాసమున ప్రసక్తమైన కేతన కాలము విమర్శనీయము.

15. ఈ సందర్భమున కేతన తిక్కనకు పరోక్ష శిష్యుడన్నమాట యపాస్తమని యెఱుంగునది. దశ కుమారచరిత్ర యవతారికను సరిగ నర్థముచేసికొనినచో నిట్టి భావమునకు తావేలేదు.

16. భరతనాట్యశాస్త్రము—తెలుగు-17 అధ్యాయము పుట 481. శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు గారి అనువాదము.

తుల్యంబగు భాషతత్సమమని నిర్వచించినను, తత్సమ పరిచ్ఛేదమును సంస్కృత పదములనే తప్ప, ఒక్క ప్రాకృత సమ పదమునైన గ్రహించియుండలేదు. 'సంస్కృతము తెనుగైన తత్సమపదంబు' అను ప్రాచీనాంధ్ర వైయాకరణ తత్సమ నిర్వచనమునకు విరుద్ధముగా సూరి తత్సమ లక్షణముండుటకు కారణమీ ప్రాకృత భాషాప్రకృతిత్వమే కారణమని మనము నిర్ధారణ చేయవచ్చును. ''సంస్కృత సమము'' అనునది సూరి ప్రాకృతవ్యాకరణము నుండి గ్రహించినదే.17 ఈ సంస్కృతసమపదప్రయోగము విమర్శనీయమే.

ప్రాకృతము సంస్కృతభాషా జన్యము. ప్రకృతి, ప్రత్యయ, లింగ, కారక, సమాసాదుల యందన్నింటను ఆ భాష సంస్కృతమునే అనుసరించును కాబట్టి తత్సమములను విభాగమున్నను దానిని గూర్చి ప్రత్యేకముగ నా వ్యాకరణములలో చెప్పవలసిన యావశ్యకత లేదు. సంస్కృతసమములనుటు సరిపోయినది. తెలుగు భాష అట్లుకాదు. అది సంస్కృత ప్రాకృతములకన్న విజాతీయమైనది. కాబట్టి తత్సమ శబ్దములకే గాక ప్రాకృతభవములకు—అనగా తద్భవములకు ప్రత్యయములు చేర్చి వానిని తెలుగులో కలుపుకొని తెలుగుగా జేసెడి పద్ధతులు, తెలుగు వ్యాకర్తల కావశ్యకమైనది. ఈ ప్రక్రియ ననుసరించి 'రామః' అను సంస్కృత పదము 'డు' ప్రత్యయము చేర్చుటచే 'రాముడు' అయి తత్సమమైనది. అట్టి 'రాముఁడు' అను పదమును అర్ధానుస్వార సహితముగ 'సంస్కృత సమము' అని సూరి సంస్కృత సమముల క్రింద చూపుట ఎంతమాత్రమును సమంజసముగాలేదు. ప్రాకృత సమభవములలో చూపబడిన 'జముఁడు, వెన్నుఁడు'—నవి కూడ యిట్లేయని తెలియదగియున్నది. ఈ విషయ మింతకుముందే సూచించియున్నాను.

సూరి 'తెలుగుదేశీ' నైసర్గిక స్వరూపమెఱిగిన వాడైనను చింతామణి సూత్ర ''లేక'' మంత్ర ప్రభావముచేత పైరీతిగా ప్రాకృత భాషాసంబంధము తెలుపవలసి వచ్చినది.

పైని నేను వ్రాసిన విషయములను పరిశీలించిన యెడల తెలుగుభాషకు ప్రాకృతమునకు చారిత్రకమైన సంబంధమేగాని జన్యజనక సంబంధము లేదని స్పష్టమగుచున్నది.

భాషా చారిత్రక చర్చలలో, ఇతరుల వ్రాతల కన్న మూలగ్రంథములే ప్రామాణికములనుటలో భేదాభిప్రాయము లేనేలేదు. ఇట్లయ్యును తెలుగులో నొక విచిత్ర పరిస్థితి యేర్పడినది. తెలుగుభాషలో భాషాలక్షణ గ్రంథములగు వ్యాకరణములు, సంస్కృతములోను, తెలుగులోను కలవు. తెలుగున వ్యాకరణములేగాక లక్షణగ్రంథములును గలవు. కాని ఈనాడు సంస్కృతభాషలో రచింపబడిన ఆంధ్రశబ్ద చింతామణి, అధర్వణకారికావళి, అహోబల పండితీయము—వాని ననుసరించిన—అప్పకవీయము, బాలవ్యాకరణము-వీనికే ప్రాధాన్యముగాని తెలుగున గల ఆంధ్రభాషా భూషణాది వ్యాకరణములకు, లక్షణ గ్రంథములకు 18ప్రాధాన్యతలేదు. తెలుగుభాషా వ్యాకరణ లక్షణ గ్రంథములను గూర్చి కూలంకషముగా వ్యాసంగము జరిగిన గాని, తెలుగుభాష ఉత్పత్తి వికాసములను గూర్చి ప్రస్తుతము వ్యాప్తిలోనున్న వాదోపవాదములు, చర్చలు చల్లార నేరవు.

పాక్షిక దృష్టిలోగాక, సత్యాన్వేషణ దృష్టితో పై తెలుగు మూలగ్రంథ పరిశీలనతోపాటు, ప్రాచీన భాషాసం పదాయములు, ఉపలబ్ధములైన శాసన పద్యగద్య వాఙ్మయముల భాష—శివకవుల భాష—వీని లక్షణముల నాకళించుకొని సమన్వయము చేసినట్లయితే ''తెలుగుభాష—అటు ప్రాకృత జన్యమూ కాక ఇటు ద్రావిడ జన్యముగాక స్వతంత్రభాష'' అని నిర్వివాదముగా నిరూపింపవచ్చును.

నేటి భాషాశాస్త్రకర్తలు- భాషాచరిత్ర రచయితలు ఇట్టి నిరూపణకుపూనుకొందురు గాక.

---

17. ''సంస్కృతసమంతు సంస్కృతలక్షణే నైవగతార్థమ్''—హేమచంద్ర వ్యాకరణము. సూరి యుపయోగించిన ఈ పదసామంజస్యమును గూర్చి బాలవ్యాకరణ వ్యాఖ్యాత లెవ్వరును ప్రత్యేకముగ చర్చించినట్లులేదు. ఇట్లే యీ సంజ్ఞా పరిచ్ఛేదము నందలి పారిభాషిక పదముల విమర్శన కూడ విపులముగా వెలయవలసిన ఆవశ్యకత యున్నది. అవకాశమును పురస్కరించుకొని ముమ్ముందు దానిని విశదీకరించెదను.

18. ఇట్టి రూపములు, శివకవి భాషాసంప్రదాయము ననుసరించి ప్రామాణికములే. చూడుడు—శబ్దరత్నాకరానుబంధము.

# మ న సు

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

"అరవై యేళ్ళు దాటి, రిటైరయిన తర్వాత బ్రతికి వుండడమే పెద్ద తప్పు.." అనుకున్నాను నేను చిరాకుతో, ఆ ఫోటో ముందు కూర్చుని పగిలిపోయిన అద్దం పెంకులను ఏరుతూ.....

పెద్ద అవసరం వచ్చిన వాడిలా కుర్చీ వేసుకుని మరీ పైకి ఎక్కి దాన్ని క్రింద పడేసిన కుర్రవెధవ నా ప్రక్కనే కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తూ నిల బడ్డాడు. గాజు పెంకులను ఏరుతూవుండగా ఒక బ్లేడువంటి గాజు ముక్క వ్రేలికి గీరుకు పోయి నా చిరాకును సహస్రాధికం చేసింది. గారడీ చూస్తున్న వాడిలా నిలబడిన ఆ కుర్ర వెధవను ఉద్దేశించి కోపంగా "నువ్వు అవతలికి పో ముందు" అని అరిచాను. వాడు బొత్తిగా భయ భక్తులు లేని శుంఠ... అనవసరంగా నవ్వుతూ నన్ను మరింత ఉడి కిస్తూ లోపలికి వెళ్ళాడు.

చాలా ఓపికగా గాజు పెంకులు ఏరి బయట పారబోసి ఆ ఫోటోను చేతిలో వుంచుకుని వాలుకుర్చీలో కూల బడ్డాను. మనసంతా ఎవరిమీదో, ఎందుకో తెలియని ఉక్రోషంతో, కసితో నిండి పోయివుంది.

నేను ఏళ్ళతరబడి పెద్ద పదవిలో ఠీవిగా, దర్జాగా కాలం గడిపి సంవత్సరం క్రిందటనే రిటైరయినాను. అంతకాలమూ మధ్యందిన మార్తాండునివలె ఒక వెలుగు వెలిగాను. అయినా ఎప్పటికీ సూర్యుడలా నడినెత్తినే ఉండి పోవడం సాధ్యం కాదు గదా! ఈ సూర్యుడు ఉద్యోగ విరమణ చేసి పెన్షన్ తీసుకోవలసి వచ్చింది. సరే, తప్పదు కాబట్టి సోమరిగా యింటి పట్టున కూర్చుండి పోయాను. కాని నాకు మనశ్శాంతి లేదు. వారం రోజుల నుంచీ యీ వానర సేన వచ్చిపడింది. దానితో మరీ చీకాకు పడిపోతున్నాను.

'వానరసేన' లోపల హడావిడి చేస్తున్నది. వాళ్ళు మొత్తం ఆరుగురు. అందరికన్నా పెద్దవాడు రాజు. మా పెద్దమ్మాయి కొడుకు. ఫిఫ్తుఫారం పరీక్షల వ్రాసి వాడు సెలవుల్లో యిక్కడికి వచ్చాడు. జుట్టు మొహం మీద పడుతూవుండగా ఎప్పుడూ గంభీరంగా ఏదో ఆలోచిస్తూ వుంటాడు. మొదట్లో ఏ వేదాంతిగానో తయారవు తాడని అనుకున్నాను కాని వాడు నా అంచనా లన్నీ తలక్రిందులు చేసి 'మెకానిక్' గా తయారైనాడు. ఎప్పుడూ ఎలక్ట్రిక్ బల్బులు తీసి మళ్ళీ పెట్టడం, ఫ్యూజులు పోతే వెయ్యడం, వైరుతో ఏవేవో పనులు చేస్తూ వుండటం, ఫ్యానులూ, రేడియోలూ, విప్పి మళ్ళీ బిగిస్తూ వుండటం యిటువంటి పనులలో వాడు ఆరితేరిన వాడు. మును పెప్పుడో ఒకసారి సెలవులకు వచ్చి వాడు యిక్కడే వుండగా ఒక రోజు రాత్రి అందరూ

భోజనాలముందు కూర్చున్న వెంటనే ఫ్యూజు పోయింది కాబోలు లైట్లు టప్పున ఆరి పోయాయి. ఇల్లంతా అంధకారం అలుము కున్నది. అప్పుడు వాడు పెద్దగా "ఎవరూ కదలకండి. ఒక్క క్షణంలో అంతా సరి చేస్తాను." అంటూ తన పెట్టె దగ్గరికి వెళ్లి టార్చి తీసుకుని పనిముట్లు తీసు కొని వెళ్లి క్షణంలో లైట్లు వెలిగించాడు. అప్పుడు నా కొడుకూ, కోడలూ, నా మూడో కూతురూ, మా ఆవిడా వాణ్ణి తెగమెచ్చు కుని ఒకటే మురిసి పోవడం... దాంతో వీడు గొప్ప వినయం నటిస్తూ "మీరు నన్నంతగా పొగడకండి. నేను నా ధర్మం నెర వేర్చానంతే" అన్న ధోరణిలో మాట్లాడటమూ నాకు బొత్తిగా నచ్చలేదు. తేలికగా చప్ప రించి "ఈ పనులకు బాగానే పనికొచ్చే ట్టున్నావు. ఇంకేం ? చదువు మానేసి స్క్రూ డ్రైవరూ, రెంచీలూ పట్టుకుని యిళ్లవెంట తిరగడం మంచిది. మీ అమ్మకూ నాన్నకూ ఈ చదువు పేరుతో డబ్బుదండగ ఎందుకు ?" అన్నాను. అలా అని వాడి మొహం వంక చూసి గతుక్కు మన్నాను. వాడు ఆ మాటలు విని కూడా పరమహంస లాగా చిరునవ్వు నవ్వుతూ కూర్చున్నాడు. పైగా మా ఆవిడ మనుమడిని వెనక వేసు కుని వస్తూ "చాల్లెండి.... ఏంమాటలండీ మరీనూ ? ఇవాళ అన్నాలవేళా చీకట్లో చిందులాట తప్పించాడు బంగారు తండ్రి... వాడికి పనిముట్లు పట్టుకుని యింటింటికీ తిరగవలసిన ఖర్మ పట్ట లేదు.... వాడు ఏ కలెక్టరో అయి తీరుతాడు. చదువులో మాత్రం వాడు వెనుక బడ్డాడను కుంటు న్నారేమో! అల్లుడు నాతో చెప్పాడు... వీడే క్లాసులో అన్నింటా ఫస్టుట...పైగా ఇలా లైట్లు పోతే ప్రతిసారీ ఎవరోవచ్చి బాగు చేసి పొయ్యేవరకూ గతిలేదు... ఒక్కోసారి పూటల తరబడి లైట్లు లేక బాధ పడ లేదూ మనం ? మళ్లీ చూడబోతే యింట్లో అందరూ బి. ఏ. లూ ఎం. ఏ.లూ ప్యాసై ఉద్యోగాలు చేస్తున్నారు. వెధవది ఫ్యూజు పోతే వేసే దిక్కులేదు...." అంటూ పెద్ద దండకం చదివింది. వాడు ఆమెను పూర్తిగా మాట్లాడనిచ్చి "నువ్వూరుకో అమ్మమ్మా! తాతయ్య ఏదో అన్నాడే అనుకో.... పెద్ద వాడు.... ఆయన అలా దీవిస్తేనే మంచిది" అన్నాడు. దానితో మిగిలిన వాళ్లంతా విరగ బడి నవ్వడం, నాకు మతిపోయినంత పన యింది.

లోపల చరిత్రగతిని మార్చివేసే యుద్ధం వంటిదేదో జరుగుతున్నది. గబ గబా లేచి వెళ్లాను. ఒకరి మీద ఒకరు పడి దొర్లుకుంటూ రొప్పుతూ రోజుతూ పోట్లాడు కుంటున్నారిద్దరు. ఆ యిద్దరికీ ఏడో సంవత్సరం నడుస్తున్నది. ఒకడు మా అబ్బాయి రాజశేఖరం కొడుకు. మరొకడు మా పెద్దమ్మాయి రెండో కొడుకు. నేను ఇద్దరినీ చెరొరెక్కా పుచ్చుకుని విడదీసి "వెధవల్లారా! ఎందుకలా కొట్టుకు ఛస్తు న్నారు ?..." అని అడిగాను. వారిలో ఒకడు నవ్వుతూ "ఊరికే తాతయ్యా! వాడు కుస్తీపడదాం రమ్మన్నాడు..సరేనన్నాను. అంతే" అన్నాడు. నాకు ఒళ్లు మండి పోయింది. ఉక్రోషం కొద్దీ చెరొకటి అంటించి "పొండి గాడిదల్లారా?" అంటూ మళ్లీ హాల్లోకి వచ్చి కూలబడ్డాను. ఆ ఫోటో చేతిలోకి తీసుకున్నాను. అందులో మా కుటుంబం అంతావుంది. పిల్లలు మినహా మొత్తం ఏడుగురు. మా పెద్దబ్బాయి పెళ్లినాటి

ఫోటో అది. వాడి పేరు రాజశేఖరం. ఎమ్. ఇ. ప్యాసై ఇక్కడే పని చేస్తున్నా డిప్పుడు. వాడి భార్య హైస్కూల్లో టీచరు. ఆమె పేరు రమ. ఆమె అంటే నాకు చాలా అభిమానం. ఆ ప్రక్కనే వున్నది మా పెద్ద మ్మాయి సుజాత. ఆమె భర్తతో సహా భిలాయ్‌లో వుంటున్నది. అప్పుడప్పుడు తప్ప తరచుగా యిక్కడికి రాదు. ఆమె ప్రక్కనే రెండు జడలు గుండెల మీదకి వేసుకుని వున్నది వనజ. మా రెండో కూతురు. ఆమె భర్త బెంగుళూరులో కాలేజీ లెక్చరరు. ఆమె దగ్గరి నుంచి నాలుగు నెలల క్రిందట ఉత్తరం రాగానే మా ఆవిడ ఒకటే సంబర పడిపోతూ వెళ్లిందక్కడికి. 'కాన్పుకు పుట్టింటికి పంపవయ్యా అంటే, అల్లుడు 'ఇదేం మొదటి కాన్పు కనుకనా ? ససేమిరా వీల్లేద'న్నాడుట. అందుకని ఆమె నామూనాన నన్నొదిలేసి తను అక్కడే ఉండి పోయింది. పైగా అభిమానం అంతా ఒలకబోస్తూ మూడు రోజులకో ఉత్తరం రాసి పడేస్తుంది. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమని నాకూ నన్ను జాగ్రత్తగా చూసుకోమని మిగిలిన వాళ్లకూ...హితబోధలు చేస్తుంది. మా మూడో అమ్మాయి ఫోటోలో మూతి చిత్రంగా పెట్టింది. బహుశా ఎవరినన్నా వెక్కిరిస్తున్న దేమో! ఆమె కింకా పెళ్లికాలేదు. 'పెళ్లి' సంగతి ఎత్తినప్పుడల్లా అందర్నీ దులిపేస్తూ వుంటుంది. ఆ ప్రసక్తి తెచ్చామో ఖర్మ కాలిందన్నమాటే. ఒక పెద్ద తుఫాను... ఉప్పెన...వొచ్చిపడినట్లే. హక్కులు, స్వాతంత్ర్యం, కాళ్లమీద నిలబడటం, ఈ పదాలు వందలూ వేలుగా ఆమె నోట్లో నుంచి నిజంగా ఉప్పెనలాగేవచ్చి మనలను ముంచెత్తి వేస్తాయి. కాని, దాని తెలివి తేటలు నన్ను ఎల్లప్పుడూ ముగ్ధుణ్ణి చేస్తూ వుంటాయి. అది ఈ యేడుకే ఎం. ఏ. ప్యాసై స్థానిక స్త్రీలకళాశాలలో లెక్చరరుగా వుంటున్నది. పైగ అడపాదడపా వ్యాసాలూ, కధలూ వ్రాసి కొంత పేరుతెచ్చుకున్నది కూడా.

నేను ఫోటో ప్రక్కనేవుంచి నిట్టూర్చాను. ఏమీ తోచడంలేదు. ఇప్పుడేకాదు. ఉద్యోగ విరమణ చేసిన ఆ క్షణంనుంచీ నాకు ఏమీ తోచడంలేదు. కాకపోతే మా ఆవిడ ఉండగా కొంత మనశ్శాంతి ఉండేది. ఆమె ఆదరణలో అన్నీ మరిచిపోయి విశ్రాంతి తీసుకునేవాణ్ణి. పెద్ద నిద్రగన్నేరు నీడలా ఆమె నన్ను సేద దీర్చి మనసుకు విశ్రాంతీ, ఆహ్లాదమూ కలిగించేది. పైగా యీ వానరసేన లేకపోతే యిల్లంతా నిశ్శబ్దంగా ఉండేది. ఆటూయిటూ హడావిడిగా ఎగురుతూ పిచ్చుకలుచేసే సవ్వడి తప్ప మరే శబ్దమూ వినిపించేదికాదు. హాయిగా దినపత్రిక చేతిలోకి తీసుకుని ప్రత్యక్షరమూ చదివి ఆనందిస్తూ ఉండేవాణ్ణి. అందువల్ల అనేక దేశాలు తిరిగినట్టూ, అనేక విషయాలు చూసినట్టూ అనుభూతి కలిగేది. ఈ వానర సేనవచ్చి పడినప్పటినుంచీ అదీ వీలుపడటం లేదు. పేపరు చేతిలోకి తీసుకునేసరికి ఏదో రొద, గొడవ ప్రారంభం.....దానితో చదువు ముందుకు సాగదు.

ఉదయం తొమ్మిది గంటలకే యింట్లో వంటా వార్పూ అయిపోతుంది. తొమ్మిదిన్నర కల్లా మా మూడో అమ్మాయి పుస్తకాలు తీసుకుని చెప్పులు చప్పుడు చేసుకుంటూ కాలేజీకి వెళ్లిపోతుంది. తొమ్మిది ముప్పావు అయ్యేసరికి రాజశేఖరం టై సర్దుకుంటూ, బూట్లు చప్పుడు చేసుకుంటూ వెళ్లి స్కూటర్ స్టార్టుచేసి హారన్ మ్రోగిస్తాడు. లోపలి

గదిలోనుంచి "వొస్తున్నాను సార్! కొంచెం గుర్రాన్ని కట్టేయండి......" అని సమాధానం చెప్పి మా కోడలు బయలుదేరివచ్చి "స్కూలుకు వెళ్తున్నాను మామయ్యా!" అని నా అనుమతి కోసమే అన్నట్టు ఒక్క క్షణం నిలబడుతుంది. నేను నవ్వుతూ తల వూపుతాను. అప్పుడామె భర్తతోపాటు స్కూటర్‌మీద స్కూలుకు వెళ్లిపోతుంది. పరాయి యింట పుట్టిన పిల్లఅయినా కోడలు అంటే నా కందుకే అభిమానం......ఆమెకు తప్ప ఎవరికీ యింట్లో 'ముసలి ముండావాడు పడివున్నాడు; కనీసం చెప్పి వెడదా'మనే జ్ఞానం బొత్తిగాలేదు.

అలా పది కొట్టేసరికల్లా అందరూ ఎవరిపాటికి వారు బయలుదేరి వెళ్లిపోతారా? నేనొక్కణ్ణే యింట్లోమిగిలిపోతాను. చేసేందుకా పని ఏమీ ఉండదు. నిద్రపోదామంటే ఎంత ప్రయత్నించినా కళ్లు మూతలుపడవు. నా భార్య గుర్తుకువస్తుంది. చిరునవ్వులుచిందే ఆ ముఖం......వయస్సుమళ్లినా తగ్గని శరీర లావణ్యమూ......నా పట్ల నెరపిన ప్రేమాభిమానాలూ గుర్తువచ్చి ఆమె లేని బాధను మరింత ఎక్కువ చేస్తాయి. అప్పుడు నాహృదయంలోని బాధనంతటినీ కాయితంమీద వ్రాసి ఆమెకు ఉత్తరం పోస్టు చేద్దామనిపిస్తుంది. నాలుగురోజుల క్రిందట వ్రాసిన ఉత్తరంలో "నువ్వు లేకపోవడంవల్ల నేను పడుతున్న బాధ ఎలా చెప్పను? ఇక్కడ ఎవరూ, నన్నూ నా ఉనికినీ గుర్తించడమేలేదు. కేవలం కాపలాకుక్కలాగా యింట్లోపడివుంటున్నాను. ఇంకా నువ్వు రావెందుచేత? అమ్మాయి ప్రసవించి ఇన్నాళ్లయినా నువ్వురాని కారణం ఏమిటి? నువ్వు కూడా యీ రిటైరయిన ముసలివాణ్ణిమరచి పోతున్నట్టున్నావు" అని వ్రాశాను. దానికి సమాధానంలేదు. నిజమేమరి......ఎవరికిమాత్రం నా మీద గౌరవం ఎందుకుంటుంది? అందరూ సంపాదనపరులైనారు. ఆడా, మగా అందరూ ఎవరిపాటికి వారు ఉద్యోగాలుచేసి స్వతంత్రంగా డబ్బు సంపాదిస్తున్నారు. మావాడికేమో అయిదు వందలుపైమాటే జీతం...... కోడలికేమో రెండువందలకు తక్కువఉండదు. మా మూడో అమ్మాయికి సరేసరి మూడు వందల చిల్లర......ఎవరి బ్యాంక్ అక్కౌంట్లు వారికున్నాయి. నా ముష్టి పెన్షన్ డబ్బు ఎవరికి కావాలి? ఇంటి ఖర్చులలో కూడా నయాపైసా అయినా నా డబ్బు పడేందుకు వీల్లేదు. ఈ ప్రపంచంలో మనిషిమీద గౌరవాభిమానాలు డబ్బునుబట్టే కొంతవరకూ పుట్టుకుని వొస్తూవుంటాయి. నేను ప్రతినెలా పెన్షన్ తీసుకుని వచ్చే దోవలోనే బ్యాంకులో నాపేర జమకట్టి యింటికి వచ్చేస్తాను. ఎవరికైనా డబ్బు కావలసివస్తుందేమో, నా ఆరువేల రూపాయల బ్యాలెన్స్‌లోనుంచి డ్రా చేసి 'షైన్' అవుదామని నాకు మహా కోరికగావుంది. కాని ఆ అవకాశంరానిదే ఏం చేయను? మొన్నటికి మొన్న ఏం జరిగిందనుకున్నారు? మా అమ్మాయితో బుద్ధి పొరపాటున గడ్డితిని ఇలా అన్నాను "నీకు ఒక నెక్లెసు చేయిద్దామనుకుంటున్నానే అమ్మడూ, నా డబ్బుతో." నా మాటలు విని అది చిత్రంగా చూసి "ఏమిటీ? నెక్లెసా? నాకా? ఇప్పుడా? గోల్డు కంట్రోల్ ఉందని తెలీదూ? బంగారం కొని పెట్టుకోవడం అంటే దేశద్రోహమని అర్థం. నీ కా ఆలోచన వుంటే యింతటితో కట్టిపెట్టు......"అన్నది. దానితో నా నోట మాట రాలేదు.

ఒకనాడు పెన్షన్ డబ్బు బ్యాంకులో జమకడుతూ ఉండగా ఒక ఆలోచన వచ్చింది. విత్‌డ్రాల్ ఫారం తీసుకుని పూర్తిచేసి సంతకం చేసి గుమాస్తాచేతి కిచ్చాను. అతడు నన్ను బాగా

ఎరిగినవాడు. ఒక్కసారిగా తలఎత్తి చూసి, "మూడు వేల రూపాయలా?" అని అడిగాడు. నేను గొప్పగా నవ్వుతూ, "అవునయ్యా! కావలసి వచ్చింది. ఇంట్లో కొన్ని అవసరాలు అనుకో కుండా వొచ్చిపడ్డాయి." అన్నాను. అతడు టోకెన్ యిచ్చాడు. చాలా ఏళ్లతర్వాత మొట్ట మొదటి సారిగా డబ్బు తీసుకోవడంకోసం క్యాష్ క్యాబిన్‌ముందు టోకెన్ చేతిలో ఉంచుకుని గర్వంతో నిలబడ్డాను. తర్వాత అంత డబ్బూ తీసుకుని లాల్చీ జేబులో ఉంచుకుని ఎక్కౌంటు బుక్‌తో యింటికి వచ్చి నిట్టూర్చి కుర్చీలో కూర్చున్నాను. అప్పుడు మావాడు ఎక్కడికో వెళ్లబోతున్నాడల్లేవుంది, ముందు హాల్లోకి వచ్చాడు. నా పిలుపు విని "ఏమిటి నాన్నా?" అంటూ నా దగ్గరికి వచ్చాడు. నేను నిర్ల క్ష్యం నటిస్తూ, "అదుగో! ఆ బ్యాంకు పుస్త కంలో నిలవ ఎంత వుందో చూసి చెప్పు, ఒక సారి......" అన్నాను. వాడు పుస్తకం చేతి లోకి తీసుకుని "మూడువేల చిల్లరవుంది...... ఇవాళ మూడువేలు విత్‌డ్రా చేసినట్లున్నది యిక్కడ......" అన్నాడు. వాడు, "అంత డబ్బు ఎందుకు తీసుకున్నారు? ఏ అవసరం వచ్చింది?" అని అడుగుతాడేమో అని ఎదురు చూశాను. కాని, అదేం చిత్రమో, వాడు 'ఎందుకు?' అని అడగనే లేదు. పైగా పుస్తకం అక్కడ పడేసి పోబోయాడు. నాకు ఉన్నట్టుండి చిరాకు పుట్టుకు వచ్చింది. కోపంతో "అవును... మూడు వేలూ తీసుకున్నాను. వూరికే బజారున పోయేవాళ్లను పిలిచి పంచి పెడదామని అను కుంటున్నాను." అని అరిచాను. నా కేకలు విని చిత్రంగా చూసి భార్యను కేకవేసి పిలిచి "రమా! నాన్నగారికి ముందు కాఫీ యివ్వు...ఎందుకో చిరాగ్గా వున్నారు" అని చెప్పి వెళ్లిపోయాడు. అంతే, మర్నాడే ఆ మూడువేలూ తీసుకుపోయి మళ్లీ బ్యాంకులో జమకట్టి వచ్చాను. ఆ గుమాస్తా నవ్వి అదోలా చూడగా, 'ఆడబ్బుతో అవసరం లేకపోయింది.' అన్నాను. అతడు "అవునుసార్! ఈ డబ్బుతో ఏం పని మీకు? మీ అబ్బాయి ప్రయోజకుడూ, మంచి వాడూనూ. హాయిగా పెద్దతనంలో వాళ్లు మిమ్మల్ని సుఖపెడుతున్నారు.మావాడూవున్నాడు. బి. యస్సీ మూడుసార్లు తప్పికూర్చున్నాడు. ఇక పరీక్షకు కూడా వెళ్లనంటున్నాడు. వెధవ స్నేహాలూ, తిరుగుళ్లూ......ఇంకేంబాగు పడతాడు...." అంటూ తన సొద చెప్పుకు పోయాడు.

*　　*　　*

అయ్యా! ఈ వానరసేన లోపల ఏదో కొంప ముంచింది మళ్లీ......పరుగెత్తుకుంటూ లోపలికి వెళ్లి శిలా ప్రతిమలా నిలబడిపోయాను. అక్కడ ఒక ప్రక్క రాజు చాలా దీక్షతో గ్రామ ఫోను బాగు చేస్తున్నాడు. ఏ భాగాని కాభాగం విడదీసి నేలమీద పరిచిపెట్టాడు. వాడి తమ్ముళ్లు యిద్దరు మరోప్రక్క కూర్చుని , ఖరీదైన పుస్తకాలలో బొమ్మలుచింపి ముక్కలుచేస్తు న్నారు. మా రెండో అమ్మాయి సంతానం అయి దేళ్ల పిల్లవాడూ, ఏడేళ్ల పిల్లదీ, కలిసి సబ్బు సగం అరగదీసి నీళ్లలో కలిపి ఏవో పుల్లలతో బుడగలు వూదుతూ గదినంతటినీ వాటితో నింపే ప్రయత్నం చేస్తున్నారు. ఇందాక ఫోటో అద్దం పగలగొట్టిన క్రురవెధవ లోపలినుంచి టూత్‌పేస్టు ట్యూబ్ తెచ్చి అంతా పిసికి నేల అంతా ఖరాబుచేసి 'యింకేమి మిగిలివుందా?' అని చూస్తున్నాడు.

చెప్పొద్దూ, నాకు అరికాలిమంట నెత్తి కెక్కింది. కోపం పట్టలేక ఒక్కొక్కళ్లనూ లేవదీసి వీధిలోకి దింపి వచ్చాను. చివరకు రాజు చెయ్యి పట్టుకుని లేవదీసి "నువ్వు కూడా

పద, వెధవా!" అన్నాను. వాడు నివ్వెరపోయి చూస్తూ, "ఎక్కడికి తాతయ్యా?"అని అడుగ తూనే వున్నాడు. నే నదేమీ వినిపించుకో కుండా వాణ్ణిచేతులలోపనిముట్లతోసహా బర బరా యీడ్చుకుపోతూ "పెద్దవాడివై వుండి వాళ్లు అంత రచ్చచేస్తూ వుంటే చూస్తూ కూర్చున్నందుకు యిదేశిక్ష నీకు....."అంటూవీధి లోకి తీసుకుపోయాను. ఆ తర్వాత వీధి తలుపు గడియవేసి పెద్దగా"ఫోండి వెధవల్లారా!ఎట్లైనా ఊరేగండి....." అని అరిచాను. వొంటిమీద చొక్కా అయినా లేకుండా కేవలం లాగూలతో ఏడుపు ముఖాలతో నిలబడ్డ యిద్దరు కుఱ్ఱ వెధవలను చూసిన నాకు జాలి కలగలేదు. ముందు హాల్లో కుర్చీలో కూర్చున్న నాకు రాజు వాళ్లందర్నీ సముదాయించి వెంట నడి పించుకుపోవడం కనిపించింది. కాని, ఆకాస్సేపూ నా మనసు రాయి చేసుకున్నాను. అలాగే కొంచెం సేపు కళ్లు మూసుకుని పడుకున్నాను. లోపల ఏమీ సవ్వడిలేదు. ఒక ఒంటరి పిచ్చుక ఏమిటో గొణుగుతున్నది. ప్రక్కయింట్లో రేడియోలో ఏదో పాట వినిపిస్తున్నది.

దాదాపు పది నిముషాల తర్వాత మనసులో ప్రారంభమైన ఆరాటం క్రమంగా అధికం అయింది. వొంటిమీద చొక్కా కూడా లేని ఆ యిద్దరు కుఱ్ఱ కుంకలూ, ఆ చిన్నపిల్లా దాని మెడలో గొలుసూ గుర్తుకు రాగానే ఒక విధమైన భయం కలిగింది. సెలవులకు ఆట విడుపుగా ప్రతిసంవత్సరం యీ వూరికి రావడం, యిక్కడే సెలవులన్నీ గడిపి తిరిగి స్కూళ్లు తెరిచేవేళకు వెళ్లడం చాలా యేళ్లుగా జరుగు తున్నది. నా చిరాకుకొద్దీ అలా చేశానేగాని, పసి వాళ్లు కోపం తెచ్చుకుని తమ తల్లిదండ్రులతో జరిగింది జరిగినట్లు చెప్పివేసిన పక్షంలో యింకేమయినా వుందా? అల్లుళ్లకూ, కూతుళ్లకూ కోపం ముంచుకురావచ్చు. అప్పుడ వారు "మేము పిల్లలను సెలవులుకదా అనిస్థలం మార్పుకోసం....అదీ ముసలామె ప్రాధేయపడితే పంపించాముగాని మాకు బరువైకాదు. ఇక్కడ వారికి తిండికీ బట్టకూ లేకనూ కాదు. ఇలా చేశారు కాబట్టి ఇక ఎప్పుడూ పిల్లలను పంపిం చము......మేమూ . రాము......" అని మంకు పట్టు పట్టవచ్చు. అబ్బో! ఆలోచించే కొద్దీ యీ వ్యవహారం ముదిరి చాలా దూరం పోయేట్టుంది.

నేను వెంటనే లేచి యింటి తలుపుకు తాళంవేసి చెప్పులు తొడుక్కుని వరండా మెట్లు దిగి ఆవరణ గేటు తలుపు తీసుకుని రోడ్డుమీదికి వచ్చాను. బయట ఎండ మహా తీవ్రంగా వుంది. సూర్యుడు క్రూరుడైన నియంత వలె సమస్త లోకాన్నీ తన కోటి కోటి కిరణా లతో వేధిస్తున్నాడు. వెచ్చనిగాలి వేగంగా వీస్తు న్నది. పిల్లల జాడ కనుచూపు మేరలో కనిపించ లేదు. ఈ వెధవలెటుపోయారో ఏమో! నాలో ఆదుర్దా ఎక్కువయింది. ఈరాజు గొప్ప ఆరిందాలాగా వాళ్లను ఎటు తోలుకుపోయాడో ఏమో! వాడొక పొగరుబోతు.....

వాళ్లు సాధారణంగా అప్పుడప్పుడు ప్రక్కయిళ్ల పిల్లలతో కలిసి ఆడుకుంటూ వుండటం నాకు తెలుసు. కాని యింత ఎండ వేళ ఆ యిళ్ల తలుపులన్నీ మూసి బలవంతంగా పిల్లలను బంధించివేసి పడుకోబెట్టివుంటారు తల్లులు. ఆ యిళ్లలో ఎక్కడా పిల్లలు ఆవర ణలలో తిరుగుతున్న అలికిడి లేదు. వీధి చివరి దాకా వెళ్లి నేను మళ్లీ వెనుదిరిగి వచ్చాను. మనసులో ఆందోళన మరింత ఎక్కువై పోయింది. గుండెలు దడదడ లాడాయి.

కాని ప్రహరీ తలుపు తీసుకుని లోపల ప్రవేశించిచూద్దునుగదా! వాళ్లు వరసగా సైజుల

వారీగా ప్రహరీగోడ నీడలో కూలబడి వున్నారు. ఫోటో అద్దం పగలగొట్టిన చిన్నవాడు—వీడి పేరు ఎప్పుడూ గుర్తువుండదు నాకు—నోట్లో వ్రేలు వేసుకుని చీకుతూ కూర్చుని వున్నాడు. ఆ ప్రక్కన మరొకడు—వొంటిన చొక్కాలేనివాడు—నా వంక కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తున్నాడు. వాడి పక్కనేవున్న చిన్న పిల నన్ను చూడనట్టు నటిసున్నది. మరొకడు చేతిలో బొమ్మతోనే బైటికివచ్చాడు కాబోలు బొమ్మను అటూ యిటూ తిప్పి చూస్తున్నాడు. రాజుమాత్రం ధైర్యంగా "ఎక్కడికి వెళ్ళావు తాతయ్యా!" అని అడిగాడు.

నేను కొంచెం కోపంగా "మీ కోసమే. ఎండలో ఎక్కడికి వెళ్ళారో అని భయపడ్డాను. అయినా మీరు లోపలి కెలా వచ్చారు?" అని అడిగాను. రాజు నవ్వుతూ "నువ్వు తలుపు దగ్గరికిలాగి వెళ్ళావు. మే మీ గోడపక్కనే అవతలవైపు దాక్కుని వున్నామింతసేపూ......" అన్నాడు.

నా మనసు తేలిక పడింది. టూత్‌పేస్టు పిసికి పాడుచేసినవాడివంక చూస్తూ చేతులు చాపాను. వాడు మొహం చింకి చేటంత చేసుకుని ఒక్క ఉదుటున వొచ్చి నా చేతులలో వాలాడు. దానితో అందరిలో హుషారు బయలుదేరింది. బిలబిలలాడుతూ నా వెనకనే వరండాలోకి వచ్చారు. నేను తాళంతీసి అందర్నీ లోపలికి పంపించాను. రాజు వెళ్ళి వెళ్ళడంతోనే గ్రామఫోను విడిభాగాలముందు కూర్చుని పని ప్రారంభించాడు. "దీన్ని మరో అరగంటలో 'ఫిట్' చెయ్యాలి" అంటూ.

నేను వెళ్ళి మామూలుగా కుర్చీలో కూలబడి పత్రిక చేతిలోకి తీసుకున్నాను. తర్వాత చాలాసేపు అలా చదువుతూ కూర్చుండిపోయాను. లోపల ఆ వానరమూక ఎంత అల్లరి చేస్తున్నప్పటికి పట్టించుకోనేలేదు.

అంతలో ఎండ తగ్గింది. చల్లనిగాలి మళ్ళింది. లోపల రాజు గ్రామఫోను మళ్ళీ బిగించినట్టున్నాడు. 'ఒన్‌మిలో ప్రీతమ్' అని పాట వినిపిస్తున్నది. "ఈ కుర్రవెధవకు యింత ఓపిక వుండటం గొప్ప విశేషమే..... అనిపించింది. అవునుమరి.....వూరికే తిని బలాదూరు తిరిగి చెడిపోకుండా ఏదో వ్యాపకం..... పిల్లల విషయంలో అది మంచిదే......

తలుపు తీసిన చప్పుడు విని తల ఎత్తి చూశాను. మా పూడో అమ్మాయి. కాలేజీలో పరీక్షల డ్యూటీ అయింది కాబోలు, వచ్చేసింది.

"ఏం నాన్నా! ఇవాళ ఉత్తరాలేమన్నా వచ్చాయా?" అని అడిగింది జోళ్ల చప్పుడు చేసుకుంటూ లోపలికి నడిచివెడుతూ.

నాకు వొళ్ళుమండింది. కోపంతో తల అడ్డంగా వూపాను. నాకు తెలుసు. వీళ్ళు నన్ను కేవలం యింటి కావలి కుక్కలాగా చూస్తున్నారు. మా అమ్మాయి లోపల ఆశ్చర్యంతో "హారి పిడుగుల్లారా! యిల్లంతా ఓకొలిక్కి తెచ్చినట్టున్నారే......" అంటున్నది. తర్వాత కొద్ది క్షణాల్లో మళ్ళీ హాల్లోకి వచ్చి కూర్చుని "అమ్మ దగ్గరినుంచీ ఉత్తరంలేదు. ఎప్పుడొస్తుందో ఏమో!" అన్నది పెద్దగా.

నేను కోపంతో "ఆమెగారిప్పట్లో ఎలా వొస్తుందీ? అక్కడివాళ్ళే ఆమెకు ముఖ్యం..." అన్నాను. మా అమ్మాయి ఎందుకో నవ్వింది. ఒక్క క్షణం ఆగి మళ్ళీ "ఈ కోతులు ఇల్లంతా ఎలా అడివిలా తయారు చేశారో చూశావా" అన్నది.

నేను వెంటనే చిన్న అబద్ధం ఆడేశాను. "నాకేం తెలుసు? పొద్దుననగా ఒక స్నేహితుడి యింటికి వెళ్ళి నేనూ యిప్పుడే వొస్తున్నాను. ఇంతసేపూ చదరంగంతోనే సరిపోయింది....... వాళ్ళు యిప్పటిదాకా కదలనీయందే....."

కాని లోపలినుంచి పరుగెత్తుకువచ్చిన ఏడేళ్ళ క్రుర్రవెధవ నా పరువు తీశాడు. "కాదు పిన్నీ! తాతయ్య అబద్ధం చెబుతున్నాడు. ఆయన పొద్దుణ్ణించీ ఎక్కడికి కదల్లేదు." అని చెప్పేశాడు.

నేను ముఖం కందగడ్డలా చేసుకుని కూర్చున్నాను. మా అమ్మాయి ఆ విషయం వొదిలేసి నవ్వి లేచి నిలబడి, "ఇక యిల్లంతా బాగు చేసుకోవొద్దూ......పొద్దు గూకుతున్నది." అంటూ లోపలికి వెళ్ళిపోయింది. నేను గభాలున వెళ్ళి నా పరువు తీసిన ఆ కుర్రగాడిద చెవులు రెండూ పట్టుకుని పిండేశాను. వాడు కొంప మునిగినట్టు ఏడవటం సాగించాడు.

మరికొద్ది సేపట్లోనే స్కూటర్ యింటి ముందు ఆగింది. ముందు కోడలు దిగివచ్చి నన్ను నవ్వుతూ పలకరించి లోపలికి వెళ్ళింది. తర్వాత మావాడు తాళం చెవుల గుత్తి గిరగిరా తిప్పుకుంటూ లోపలికి వచ్చాడు. వాడికేం? రాజా. ఇప్పుడు హాయిగా స్నానం చేస్తాడు. చక్కగా చలువబట్టలు కట్టుకుని స్కూటర్ మీద క్లబ్బుకు పోతాడు. అక్కడ ఏవేవో పేపర్లూ పుస్తకాలూ చూసి ఏడున్నర, ఎనిమిది గంటల కల్లా మళ్ళీ తిరిగి వచ్చేస్తాడు. అప్పుడు భోంచేసి హాయిగా నిద్రపోతాడు. మా అమ్మాయి తన గదిలో ఏదో చదువుకుంటూ పదిగంటల వరకూ మేలుకునే వుంటుంది. తర్వాత దాని గదిలోనూ లైటు వుండదు. ఇక నా ఒక్కడికే

నిద్రపట్టదు. ఒకవేళ నిద్రపట్టినా అంతలోనే మెలకువ వచ్చేస్తుంది.

లోపల పిల్లమూక అంతా మావయ్య చుట్టూ చేరి ఆనాడు జరిగినదంతా నివేదిక సమర్పించారు. ఆ నివేదిక నిండా నా దుర్మార్గమైన నడవడీ, నా క్రౌర్యమూ తప్ప మంచి ఏమీ లేదు. 'తాతయ్య నన్ను కొట్టాడు'' అని ఒకడూ, ''తాతయ్య మమ్మల్ని కొట్టి యీడ్చుకు వెళ్లి ఎండలో వీధిలోకి తోసేసి తలుపేసు కున్నాడు..'' అని ఒకడూ చెబుతున్నారు. మావాడు వింటూ ''ఊఁ'' కొడుతున్నాడు.

వాడు కొద్దినిముషాల్లో యిః వచ్చాడు. వాడు యింకా స్నానానికి సిద్ధం కాక పోవడం చూసి 'ఇవాళ క్లబ్బుకు వెళ్లవా ఏమిటి?'' అని అడిగాను.

వాడు కూర్చుంటూ ''లేదు నాన్నా! ఇవాళ స్టేషనుకు వెళ్లాలి. ఒక స్నేహితుడు వొస్తున్నాడు. మధ్యాహ్నం టెలిగ్రాం వచ్చింది'' అని చెప్పాడు.

మళ్లీ ఒక్కక్షణం ఆగి ''పిల్లలు బాగా అల్లరి చేశారా ఏమిటి? వాళ్లను కొట్టి ఎండ లోకి తోసేశావుట..'' అని అడిగాడు.

నాకు కోపం ముంచుకుని వచ్చింది. ''అవును..వాళ్లేమీ చెయ్యలేదు. అంతా బంగారు తండ్రుల్లాగా కూర్చున్నారు. నేనే దుర్మార్గుణ్ణి.....కొట్టి ఎండలోకి తోసేశాను. సరేనా?..'' అని అరిచాను.

మావాడు కొంచెం ఆశ్చర్యపోయి ''అదేమిటి నాన్నా! అంత కోపమెందుకు?'' అన్నాడు.

నేనింకా రెచ్చిపోయాను. ''అవున్రా.... నేను రిటైరయిన ముసలాణ్ణి. ఎవరికీ పనికి రాని వాణ్ణి. అందరూ ప్రయోజకులు కదూ. ఇక నాజోలీ శొంఠీ ప్రమేయమూ ఎవరి క్కావాలి.. ఇంటికి కావలికాచే కుక్కలాగా వొదిలిపెట్టి పోతారు. నేను యింటికి కావలి కాస్తూ పడుండాలి..'' అని అరిచాను.

మావాడు ఏమీ మాట్లాడకుండా పోయాడు. అసలు వాడి చిన్నతనంలో నేను వాడికి నేర్పిన మొదటిపాఠం యిదే. ''కోపంగా ఉన్నవారితో మాటాడకు. వెంటనే తప్పుకో... వారి కోపం చల్లారిన తర్వాతనే నువ్వు మాట్లాడు..'' అని. వాడు దాన్ని బాగా అల వాటు చేసుకున్నాడు.

వాడా విధంగా నా ముందు నుంచీ వెళ్లి పోవడంతో నాకు గొప్ప చిరాకూ, బాధా కలిగాయి. చేతిలో వున్న పేపరు క్రింద విసిరికొట్టి ''ఇక యీ యింట్లో అన్నం కూడా ముట్టను ఏను...ఇంత అవమానం జరిగాక నాకేనా అభిమానం లేనిది..'' అంటూ వెళ్లి ప్రక్క గదిలో కూర్చున్నాన. నా వెనకనే ఎవరో ఒకరు, లేక ఇంటిల్లపాదీ వచ్చి బతిమిలాడి తీసుకుపోతారనే భరోసాతో అడుగుల చప్పుడు కోసం చెవులు రిక్కించుకుని వింటూ వాలుకుర్చీలో కళ్లు మూసుకుని కూర్చున్నాను.

కాని నాకు ఆశాభంగమైంది. ఎంత సేపటికీ ఆ అడుగుల చప్పుడు వినబడలేదు సరిగదా, వాకిట్లో స్కూటరు కదిలి వెళ్లి పోయిన చప్పుడూ, లోపల పనులు చేసుకుంటూ వొదినా మరదళ్లు మాట్లాడుకుంటున్న మాటలూ, రాజు వరసగా పెడుతున్న గ్రామఫోను రికార్డులూ వినబడుతున్నాయి. పిల్లలందరిచేతా వరసగా స్నానాలు చేయించి సముదాయిస్తున్నది మా కోడలు. వుండివుండి ఆమె మెత్తని కంఠస్వరం వినిపిస్తున్నది.

అంతలోనే నాకు నిద్రపట్టింది.

* * *

నాకు మెలకువ వచ్చేసరికి గదిలో వెలుతురేలేదు. చీకట్లో వొంటరిగా కూర్చుండి

పోవలసి వచ్చినందుకు దుఃఖం పొంగివచ్చింది. నా భార్యేవుంటే ఇలా నిరాదరణపొందే దుర్గతి పట్టేది కాదుగదా అనిపించింది.

కాని లోపలి గదిలో నాకు తెలియని వ్యవహారం ఏదో జరుగుతున్నది. వినీవినగానే, హాయినిచ్చే ఆ కంఠస్వరం ఉండి ఉండి విని పిస్తున్నది. నా శరీరం హఠాత్తుగా పులకరించి నట్లయింది. నెమ్మదిగా లేచి కిటికీలో నుంచి చూశాను.

హాల్లో పెద్దసభ జరుగుతున్నది. అందరి మధ్యా నా భార్య కూర్చుని వున్నది. పిల్లకుంక అందరూ బెల్లం మీదికి ఈగలు ముసిరినట్టు ఆమె మీదికి ఎగబడుతున్నారు. ఆమె అందరినీ పేరు పేరునా పలకరిస్తూ 'మాబాబే' అనీ, 'మా అమ్మే' అనీ సంబరపడిపోతున్నది. మావాడూ, కోడలూ, మా అమ్మాయీ, రాజూ అందరూ పెద్దగా మాట్లాడుతున్నారు.

నేను మళ్లీ వెళ్లి ఆ చీకటి గదిలోనే ఆ కుర్చీలో అలాగే కూలబడి కళ్లు మూసు కున్నాను. మనసు తేలిక పడినట్టు అనిపిం చిందేగాని పట్టుదల, రోషం మాత్రం తగ్గ లేదు. అందుకే, రాజు వచ్చి "తాతయ్యా! అన్నా నికి రమ్మంటున్నారు.." అని పిలిస్తే "నేను రానని చెప్పు ఫో.." అని కసిరికొట్టి పంపిం చేశాను. ఆ తర్వాత మరొక కుర్రవెధవ వచ్చి "అబ్బో! అంతా చీకటి...తాతయ్యా! అం తిందాం రా.." అన్నాడు గుమ్మంలోనే నిలబడి. "పోరా గాడిదా. మీరందరూ తినండి..నాకేమీ అక్కర్లేదు.." అన్నాను. వాడు వెళ్లిపోయాడు. ఆ తర్వాత మా కోడలు వచ్చి "ఇలా చీకట్లో కూర్చున్నారేం మామయ్యా?" అంటూ లైటు వేసి "రండి. భోంచేద్దురుగాని.." అని పిలి చింది. "నేను రాను... నాకక్కర్లేదు... కడుపు నిండుగా వుంది.." అన్నాను. ఆమె ఒక్కక్షణం అలాగే నిలబడి తర్వాత వెళ్లిపోయింది.

కొద్ది క్షణాల తర్వాత కొత్త చీరె సవ్వడీ..మల్లెల వాసనా నన్ను ఒక్కసారిగా ఉక్కిరిబిక్కిరి చేశాయి. చల్లని గాలితెర వీచినట్లయింది. మరుక్షణంలో నా నుదుట చల్లని గాజుల చేయిపడింది. ఒక్కసారిగా ఒళ్లు వెల్లా పులకరించి పోయాను. కళ్లు తెరిచి చూశాను.

నెలల తరబడి చాకిరీ వల్లనూ, ప్రయా ణపు బడలిక వల్లనూ, కొంచెం నీరసంగా కనిపి స్తున్నదామె. ముఖంలో అమృతప్రాయమైన చిరునవ్వు మాత్రం చెక్కుచెదరకుండా అలాగే వుంది. ఒక చేత్తో నుదుట పడుతున్న వెంట్రు కలను పైకి తోసుకుంటూ "లేవండి బాబా! భోజనాలు కానిచ్చేదాం.." అన్నది.

నేను "నాకేమీ అక్కర్లేదు.." అందా మనుకున్నాను. కాని ఆమె నాకు మరికాస్త దగ్గరగా వచ్చి నా భుజం పట్టుకుని లేవదీసి "రండి..మీరు రాకపోతే కోడలు కూడా అన్నం మానేస్తుందిట..పరాయి అమ్మ కన్నబిడ్డ..దాన్ని బాధ పెట్టడం ఎందుకు..?" అన్నది.

నాకు కళ్లలో నీళ్లు తిరిగాయి. ఆమె చేయి పట్టుకుని నడుస్తూ "నువ్వు వొస్తు న్నట్టు నాకు రాయక పోయావా? స్టేషను దగ్గరికి వొచ్చేవాణ్ణిగా.." అన్నాను.

ఆమె నవ్వుతూ "నాకేం తెలును? అల్లుడు టెలిగ్రాం యిచ్చానని చెబితే యింటికే యిచ్చాడనుకున్నాను. ఆయన కాస్తా బావమరిదికి టెలిగ్రాం యిచ్చి వచ్చాడని నాకేం తెలుసు...." అన్నది.

నేను కాళ్లు కడుక్కుని వంట యింట్లోకి అడుగుపెట్టగానే అంతా నిశ్శబ్దంగా

వుంది. పిల్లలందరూ అప్పుడే అన్నాలు తిని హాల్లోకి వెళ్లిపోయినట్టున్నారు. మావాడు ఒక వైపున గోడ కానుకుని కూర్చుని వున్నాడు. మా అమ్మాయీ, కోడలూ, చెరోవైపూ కూర్చుని వున్నారు.

నేను వెళ్లీ వెళ్లగానే కంచం ముందు కూర్చుని మా కోడలి వంక తిరిగి "నువ్వు అన్నం మానేయడ మెందుకూ పిచ్చిపిలా ? మంచిదానివే.. అందరూ కానివ్వండింక.." అన్నాను.

తర్వాత మావాడి వంక తిరిగి "ఎవరో స్నేహితుడొస్తున్నాడని అబద్ధం చెప్పి వెళ్లక పోతే నాకు నిజం చెప్పకపోయావురా?" అన్నాను. వాడు నవ్వి వూరుకున్నాడే గాని ఏమీ మాట్లాడ లేదు.

నేను భోజనం ముగించి కబురు ముగించి హాల్లోకి వచ్చేసరికి సరిగ్గా తొమ్మిది కొట్టింది. పిల్లలందరూ అప్పటికే పరుపుమీద పడుకుని నిద్రపోతున్నారు. వాళ్ల దగ్గర కొద్దిక్షణాలు కూర్చున్నాను. పిచ్చి వెధవలు. ప్రొద్దుటి నుంచీ ఎంత అల రిచేశారు!

మా కోడలు వచ్చి "మామయ్యా ! ఇటు వరండాలో మీకు మామూలుగా వేసే చోటనే పక్కవేశాను. వెళ్లి పడుకోండి...." అన్నది.

నేను మా ఆవిడ వైపు చూశాను. ఆమె ఎవరూ చూడకుండా "వస్తాను.. వెళ్ల మ"ని నా వంక తిరిగి సైగ చేసింది. నేను హాయిగా గాలిలో తేలిపోతున్నట్టు అడుగులు వేస్తూ వరండాలోకి వెళ్లాను. నా మంచం పక్కనే చాప ఒకటి వేరే పరిచి వుంది.

నేను పక్కమీద వాలిపోయాను. చల్లని సముద్రపు గాలి తెరలు తెరలుగా వీస్తున్నది. ఎక్కడో చెట్టు గుబురులో దాగివుండి కోయిల ఒకటి కూస్తున్నది. నక్షత్రాలు నల్లని ఆకాశంలో మినుకు మినుకుమని వజ్రపుముక్కల వలె మెరుస్తున్నాయి. రాత్రి వేళల విహరించే ఏదో పేరు తెలియని పక్షి 'రివ్వు'న ఎగిరి పోతూ 'క్రీక్' మని అరుస్తున్నది.

నా ప్రక్కనే అడుగుల సవ్వడి.., ఆ క్రొత్త చీరె జరజర. ఆ సిగలోని మల్లెల సుగంధం.., ఆ చల్లని ఆప్యాయత కురిపించే చూపులు.., ఎండవేళ విశ్రాంతి నిచ్చి సేదదీర్చే చల్లని గన్నేరు నీడవంటి మంచి మనసు... నిద్రాదేవత కమ్మగా నవ్వుతూ మమ్ములను తన వొడిలోకి తీసుకున్నది. ఆ అమృత పరి ష్వంగంలో అలాగే కమ్మగా నిద్రపట్టింది.



# కథకుడు, కవి, బాలగంగాధర తిలక్

శ్రీ బుచ్చిబాబు

బాలగంగాధర తిలక్‌ని రెండుమార్లే చూశాను. మొదటిమారు దూరాన్నుంచి చూడడమే. మంచి వర్చస్సు, కళైన మొహం, రూపసి. మనకి ఇష్టమైన రచయితని ఎదురుపడి చూశాక 'ఇల్లా వున్నాడేమిటి, ఈయన్ని చూడకపోతేనే బాగుండునే!' అని అనిపించొచ్చు కొందరి విషయంలో. కాని ఈయన్ని చూసినప్పుడు అల్లా అనిపించదు. చూశాక ఈయన పట్ల ఇష్టం ఏర్పడుతుంది. ఇంక రెండోమారు ఇంటికొచ్చి, ఇరవై నిమిషాలు గడిపాడు బాలగంగాధరతిలక్. పది నిమిషాలు మాట్లాడాడు. చాలా తక్కువ సేపు ఎరుగున్న వారిని విడిచి వెళ్లడం ఎంత కష్టమో, ఇప్పుడు తెలిసొస్తోంది నాకు. ఆ ఇరవై నిమిషాల్లో ఆయన సన్నిహితుడయ్యాడు. దైనందిన జీవితంతో సంబంధం లేని వొక బాంధవ్యం ఏర్పడింది ఆయనతో. దాని స్వరూపం ఇట్లాంటిదని నిర్వచించలేను. సమాజంలో ముఖ్యమైన వ్యక్తుల ఉనికిని మనం వారిని ఎరగం కావున, గమనించకపోవచ్చు. కాని ఆ వ్యక్తులు ఇంక లేరు అని తెలుసుకున్నప్పుడు, ఏదో వొక లోటు ఏర్పడినట్లు భావిస్తాం. బాలగంగాధరతిలక్ విషయంలో అంతే జరిగింది.

మనస్సు వెనక్కి పోనిచ్చిచూస్తే ఆయనలో ప్రత్యేకత ఏమిటో ఇప్పుడిప్పుడు కనబడసాగింది. స్వేచ్ఛ, బద్ధం కావడం అన్నది, విరుద్ధమైనా వొక స్వేచ్ఛా బద్ధమైన కౌతూహలం, వొక తృష్ణ, వారి సంభాషణలో ప్రత్యేకతగా తోస్తూ వుంది. మనస్సులో, పొరలు, తలుపులు, దాపరికాలు, కంతలోంచి చూడడాలు, లేకపోవడమే మానసిక స్వేచ్ఛ తెచ్చుకున్న వారిలో విశేషం అనుకుంటా. అంతమాత్రంచేత వారిలో ఉద్యమాల పైన, సంస్థల పైన దెబ్బలు తియ్యడం లేదనుకోకూడదు. అవి అప్రయత్నంగా సంభాషణలో దొర్లుతాయి. కత్తినూరే చప్పుడు వినబడుతుంది. పొదిలోంచి అంబు తియ్యడం చూస్తాం. కాని వీటి వెనక స్వలాభాపేక్ష, అహంప్రకర్ష, లేవనుకున్నాను. తటస్థంగా వుండి, పరోక్షంగా తీర్పుచేసి, ఆ తీర్పు ఈ లోకం విచారణాలయం చిట్టాలో కెక్కదన్న ధైర్యంతో, నవ్వుకుంటూ, నడుచుకుంటూ దూరంగా వెళ్లిపోయి కూర్చుని, ఇంకా నవ్వుకునే వ్యక్తి తీర్పు—ఈయన సంభాషణలోనూ రచనలోనూ కనబడుతుంది.

అట్లాంటి మానసిక స్వేచ్ఛ అందరికీ పడదు. నిషేధాలు లేకుండా జీవితాన్ని సమగ్రంగా సంపూర్ణంగా చూసి, అనుభవించి తద్వారా తెలుసుకున్న దాన్ని వ్రాతలో రూపొందించడానికి నిజాయితీ అవసరం. తాను తెలుసుకుని, నమ్మినదాన్ని గురించి వ్రాయాలన్న తృష్ణ, మానసికస్వేచ్ఛ, నిజాయితీ గలవారికే వీలవుతాయి. బాలగంగాధరతిలక్‌లో యీ రకం శీలం వుంది. ఇందుకు కారణం, కొంతవరకూ ఆయన పరిస్థితులే. ఉద్యోగం చేసే అవసరం ఆయనకి కలగలేదు. ఏదో కొంత ఆస్తి వుంది. దానితో రోజుల్ని గడుపుకోవచ్చు. ఆస్తి వుండికూడా, ఎక్కడో పనిచేసి, లేక ఏ వ్యాపారమో చేసుకుని ఆస్తిని పెంచి, వ్యవహార రీత్యా అభివృద్ధి చెందాలనుకుంటారు ఎందరో. బాలగంగాధర తిలక్‌కి ఈ రకం కాంక్ష లేనట్లుంది. దీని వల్లనే ఈ ఉద్యమానికీ, తత్వానికీ లొంగక, మానసిక స్వేచ్ఛని గిరుల నడుమ బిగించక, తటస్థుడుగా వుండి, జీవితాన్ని అవలోకించగలగడం, ఎందరికో సాధ్యపడదు. బాలగంగాధరతిలక్ ఇది సాధించాడు. ఆయన రచనలో వొక కొత్తదనం, చురుకుతనం, స్పష్టత అందువల్లనే గోచరమౌతాయనుకుంటాను. పరిపక్వత,

నిండుదనం, పెరిగిన వ్యక్తికి సాధ్యపడే హుందాతనం— ఇవి ఈయన రచనలో వుంటాయి.

ఒక సిద్ధాంతాన్ని, ఆదర్శాన్ని ప్రచారం చెయ్యాలన్న ఉబలాటంలేక, తటస్థంగా వుండి—సమాజం పోకడని గురించి పట్టించుకోకుండా, దూరంగా వుండి తమాషా చూద్దామనుకున్న రచయిత రచన చప్పగా, పేలవంగా తయారై మాటల గారిడీగా అంత మొందొచ్చు. బాలగంగాధరతిలక్ రచనలో కనబడేది యీ మాదిరి దృక్పథంకాదు. ఆయన వొక వ్యక్తిత్వం అలవరుచుకున్న రచయిత! సమాజంలో మార్పులు కావాలంటాడు; కొన్ని తగవంటాడు. తాను హర్షించని వాటిని నరకడానికి కత్తి నూరతాడు. గిట్టని వారిని భూస్థాపితం చెయ్యడానికి సంసిద్ధుడే. కాని ఈ విసురుళ్ళు, తెగనరకడాలు, దెబ్బలు, కసుర్లు తనకి స్వయంగా సంభవించిన వాటి నుండి, కసితో పుట్టుకొచ్చినవి కావు.

తోటివాడి వ్యవస్థ తనదిగా భావించి, ఉద్రేకంతో కదలడం వీరిలో ప్రత్యేకత. అందువల్లనే పాత—కొత్తలు, సంప్రదాయం, ఆధునికతత్వం ప్రాక్ పాశ్చాత్య విలువల సమ్మేళనం, ప్రాచీనతత్వం, విజ్ఞాన శాస్త్రం ప్రచారంలోకితెచ్చిన వొక తార్కిక దృష్టి— ఇవన్నీ కలిసి వుంటాయి వీరి రచనలో—ముఖ్యంగా వీరి గద్యకవితలో. నేను వీరి రచనలన్నీ చదవలేదు. మనం రాస్తున్న ధోరణిలో వ్రాసే తోటి రచయితల రచనలు చదవడానికి కుతూహలపడతాం. పోకడ, వస్తువు, విధానం, అనుభవం—వొకే స్థాయిలో నడిచినప్పుడు, ఆ రచయితల పట్ల, సానుభూతి, అభిమానం ఏర్పడడం సహజం. నే చదివిన కొద్ది రచనలూ, నన్ను ఆకర్షించాయి. ఏ పత్రికలోనైనా వీరి గద్యకావ్యం కనబడితే అది ముందు చదువుతాను. మరొకసారి, ముందుముందు చదివే అవసరం రావొచ్చునని, దాన్ని పదిలంగా వుంచుతాను. ఈ లక్షణాలు కనబడే కొన్నింటిని ఉదహరిస్తాను.

'వానలో నీతో'—అన్నదాంట్లో యీ వర్ణన చూడండి.

'అరటితోట నడుంచుట్టి కాలువ ఏటవాలుగా మలుపు తిరిగింది.' తెలుగునాట కాలవగట్టు, అట్లానే వుంటుంది. పల్లెప్రాంతంలోని అందం అంతా వుంది ఆ వర్ణనలో.

ఆపాదం కింద పాదం :

'నారికేళ వనాంతాన ప్లాటినమ్ సంకేతంలా మెరుపు మెరిసింది.!

'ప్లాటినమ్'—అన్నదాంట్లో అంతరార్థం ధాతికశాస్త్రం తెలిసిన వారికి—చటుక్కున స్ఫురిస్తుంది. ప్లాటినమ్, విలువైన లోహం. బరువైంది, మరొకదంతో సులువుగా అతగదు. నారికేళవనాంతాన మెరుస్తుంది మరి.

చివరి పద్యం, మొదటి పాదం చూడండి.

'వానలో కానలో నాకు అవిరామ ప్రాచీనత స్ఫురిస్తుంది.' బాగానే వుంది.—వానలో, కానలో మనందరికీ కూడా ప్రాచీనత స్ఫురిస్తుంది—కవులకు తప్పకుండా. ఏకవికైనా స్ఫురించవొచ్చు. ఈ పద్యం ముగింపులో:

"బాబిలోనియన్, ఈజిప్టు నాగరికతా స్తూపాల నీడలలో ప్రాణప్రియా! మన మిరువురం మధువు సేవించినట్లు గుర్తుకొస్తుంది."

కొందరిని పూర్వస్మృతులు కలవరపెడతాయి. చారిత్రక దృక్పథం—ఆ జిజ్ఞాస నుండి జనించే ప్రాచీనతత్వం పట్ల రహస్యమైన వాంఛ—ఎందరి కవులలోనో కనిపించినట్లు, వీరి కవితలో కూడా కనిపిస్తుంది. వీరి స్మృతులు, బాబిలన్, ఈజిప్టు నాగరికతలకి సంబంధించినవి. బిలుపేనియన్ ప్రాచీన సంస్కృతికీ ఆర్యుల సంస్కృతికీ పోలికలున్నాయంటున్నారు నేటిపరిశోధకులు. ఆర్యులు దక్షిణ రష్యా నుండి వొచ్చారని మరికొందరంటున్నారు. దక్షిణ రష్యా ఈజిప్టు, బాబిలన్‌లకు దగ్గరలో వున్నదే. అందుకనే వీరికి, అవి జ్ఞప్తికొస్తాయి. ఆ నాగరికతలు వర్థిల్లి, పతనం చెంది స్తూపాలను మిగిల్చి అంతరించాయి. ఆ స్తూపాల నీడలో ఈ కవి ప్రేయసితో కలిసి మధువు త్రాగినట్లు గుర్తుకొస్తోందిట. బాబిలన్, సుమేర్, ఆర్యుల ప్రాచీన నాగరికతల చరిత్ర చదివినవారికి యీ పద్యంలో అంతరార్థం, దాగిన దృశ్యం, చక్కగా తెలిసొచ్చినట్లు, వాటిని గురించి తెలియనివారికి తెలిసిరాదేమో.

'ప్రవహ్లిక' అన్నది మరొక చిత్రమైన ఖండకావ్యం. ఆధునిక విజ్ఞానశాస్త్రంతో ముఖ్యంగా—

ఖగోళశాస్త్రంతో పరిచయం వున్నవారికి యీ ఖండ కావ్యం రుచిస్తుంది.

"నక్షత్రాల మధ్య ఆకాశం వంటి
నల్లనికళ్లదానా ఓ ఆడదానా—"

అని సంబోధన. ఓ 'ఆడదానా' అనడంలోనే వొక అందం వుంది—మనల్ని ఆకాశంలోకి లాక్కెడుతుంది ఆడది. ఆమె ఎట్లాంటిది? నల్లని కళ్లు గలది. ఎంత నలుపు? నక్షత్రాల మధ్య ఆకాశం అంతటి నలుపు. అవును, నక్షత్రాల మధ్య—ఆకాశం అంతా నలుపే—మనకగుపడే రంగు భూగోళాన్ని చుట్టి వుండే వాయుమండలం నుండి జనించినదే. ఇంకా ఎట్లాంటి సౌందర్యం? 'సృష్టి ముందటి చీకట్లోంచి ఏరుకున్న సౌందర్యాన్ని నీ కళ్లల్లో నింపుకున్నావు.' భూగోళం నాలుగువేల మిలియన్ల సంవత్సరాలుగా వర్ధిల్లుతూంది. ప్రాణి కోటి మొన్నమొన్ననే ప్రారంభమైంది. ప్రాణి సృష్టింప బడని ఆదికాలంలో భూగోళంలోని ప్రకృతి ఎంతటి సుందరమైందో! అదే స్వచ్ఛమైన, ఆది సౌందర్యం.

అతనెవరు? సృష్టి చివర లయంలోని శూన్యం అతను. వేడి పోగొట్టుకుని, ముందుముందు (అంటె కొన్ని కోట్ల కోట్ల సంవత్సరాల పిదప) సూర్యుడు కొవ్వొత్తి లాగై, చప్పబడి, దూరమైపోయినప్పుడు ప్రాణికోటి నశిస్తుంది—శూన్యం మిగుల్తుంది—అని జేమ్స్‌జీన్స్ మొదలైన ఖగోళశాస్త్రజ్ఞులు కొన్నేళ్ల క్రితం చెప్తూవచ్చారు. బాలగంగాధరతిలక్ ఆ సిద్ధాంతాలు చదివి వుండాలి. ఇప్పుడు మళ్లా అట్లాంటి ప్రమాదంలేదనీ, నిరంతరం వేడి, వెలుగుని వుంచుకో గల కీలకం సూర్యగోళంలో ఇమిడి వుందనీ అంటు న్నారు ఈ నాటి శాస్త్రజ్ఞులు. అయినా కూడా, ఎప్పుడో వొకప్పుడు భూగోళం తునియలై, ప్రాణి నశిస్తుందన్న సిద్ధాంతాన్ని మానవుడు ఊహిస్తూనే వుంటాడు. పుట్టడం ఎట్లాంటి వింతో, నశింపు కావడం కూడా అట్లాంటి వింతే—ఈ వింత కావ్య వస్తువు.-ఈ 'ప్రవహ్లిక' అనే గద్యకావ్యంలో మరికొన్ని అందమైన, ఉపమానాలున్నాయి, అసామాన్యమైనవి. న్యూనతే వాటి సౌందర్యం. 'ఎర్రని ఆందోళన' అన్నది అట్లాంటిది. 'నీ భుజాలు వొంపు దగ్గర చెదరి విరిగిన సముద్రపు కెరటాన్ని నేను.' చివరి పద్యంలో 'దట్టమైన అడవులలోని నిగూఢ రహస్యాలు దాచు కున్న కన్నులు కలదానా:' ముగింపు ఇట్లా వుంది:

'నాకు తల్లివి, నెచ్చెలివి, చెలివి
నన్ను కౌగలించుకున్న పెద్దపులివి.'

చెలి, నెచ్చెలి,—తల్లి—ప్రేమని,ఆప్యాయతని, ఆదరణని, కారుణ్యాన్ని చూపుతాయి. కాని అతనికి ఇవి చాలవు. మరేదో కూడా కావాలి. అది కామం. ఎర్రటి ఆందోళన—పెద్దపులి. ఆదిప్రళయం, శూన్యం, పెద్దపులి—వీటిలో ఇమిడిన కామం, శక్తి, ప్రియుడుగా అతనికి కావాలి. ఆ ప్రళయ నృత్యం ముగిసాక, చెలి, నెచ్చెలి, తల్లి—ఆ రూపం దాల్చాలి ప్రేయసి! ఆధునిక విజ్ఞానశాస్త్రంలోని ప్రధాన సూత్రాలతో పరిచయం, ఆదునికతత్వాన్ని, ప్రాచీన సంస్కృతీ సంప్రదాయంతో సమన్వయపరచ గలగడం, సమాజం పోకడని అంతరంగ జగత్తులో పాదిగి, ఊహాబలంతో సౌందర్యాన్ని సృష్టించడం, ఈ లక్షణాలుంటాయి బాలగంగాధరతిలక్ కవితలో. ఇట్లాంటి సంస్కృతి, అభిరుచి, విద్యాసంప్రదాయం, ఉన్న పాఠకులకు ఈ కవిత రుచిస్తుంది.

ఆయన చాలా కథలు కూడా వ్రాశారు. ఇవన్నీ గ్రంథరూపంగా వెలువడ్డాయో లేదో నే నెరగను. నాలుగైదు కథలు మాత్రం చదివాను. ఈయన మంచి కథకుడే అనుకున్నాను. ఒకకథ, మంచికథ ఐవుండి కూడా, అది సాహిత్యం అని పించక పోవచ్చు. బాలగంగాధరతిలక్ కథలు, సాహిత్యం అనిపించు కుంటాయి. నాకు నచ్చినది వీరి 'దొంగ' అనే కథానిక. ఆ కథ చెప్తాను. గోపాలం చదువు లేనివాడు; సారాపుచ్చు కుంటాడు. కన్నాలు వెయ్యడం ఇతని వృత్తి. ఒక ఇంట్లో కన్నం వెయ్యడానికి నిశ్చయించు కున్నాడు. ఆ ఇంట్లో వారి అలవాట్లు, రాకపోకలు, రెండువారాలు పరిశీ లించాడు. ఆ ఇంట్లో భర్త, భార్య, పిల్లవాడూ వున్నారు. భర్త క్లబ్బులో జూదమాడి రాత్రి పొద్దుపొయ్యాక, ఏ ఒంటి గంటకో కాని ఇంటికి రాడు. ఇల్లాలు, ఒకర్తి పిల్లవాడితో, వుంటుంది. ఆమె నగలు దొంగలించాలి. ఇట్టే చేసెయ్యవచ్చు. వయనం బాగా తెలుసుకున్నాక ఒకరాత్రి, ఆ దంపతుల ఇంటి పెరట్లోకి ప్రవేశించాడు గోపాలం.

నెమ్మదిగా నడిచి వంటగది దగ్గరకు వచ్చాడు. కిటికీ పూచల్ని ఒకసారి లాగిచూశాడు. ఇంతలో లోపల్నుంచి మాటలు వినిపించాయి. అతని పథకం దెబ్బతిన్నట్లనిపించింది. నిదానంగా, లోపలి మాటలు వింటున్నాడు. లోపల బిగ్గరగా మాట్లాడు కుంటున్నారు. ఇంటావిడ గొంతులో ఏదోభయం, బాధా వున్నాయి. అతని కుతూహలం హెచ్చి, పూచల్ని కదిపి వూడదీసి, వంటింట్లోకి ప్రవేశించి, పక్క గదిలో మాటలు వింటున్నాడు. మెళ్లో గొలుసు ఇమ్మని భర్త, ఇయ్యనని భార్యా— అదీ సంభాషణ. జూదమాడి సర్వమూ పాడుచెయ్యొ వద్దనీ, పిల్లవాడిని పెంచి పెద్దని చేసే భారం వహించి, యీ పోకిళ్లు మానివెయ్యమని, భర్తని ్రబతిమలాడుతోంది. తక్షణం, గొలుసుకావాలని భర్త, — తీవ్రంగా సాగులోంది సంభాషణ. ఆమె గొలుసు ఇవ్వడానికి నిరాకరించింది. "ఈ గొలు సొక్కటే మనకి ఆధారం..... మీకు మంచీ, చెడ్డా, భార్యా కొడుకూ అన్న విచక్షణ పోయింది." అంటుంది భార్య. ఆమెని మొగుడు కొడుతున్నాడు.

"కొట్టండి, చంపండి, గొలుసు మాత్రం యివ్వను" అంటుంది భార్య. ఇద్దరూ పెనుగు లాడుతున్న ధ్వని వినపడింది గోపాలానికి.

"పీక పిసికి తీసుకెడతాను గొలుసు, ఇల్లా పడెయ్యి." అని భర్త.

'ఎందుకివ్వాలి మీకు, జూదంలో తగలెయ్యొ డానికా ? పిల్లవాడికి దగ్గు మందైనా తీసుకు రాలేదు...కట్టుకున్న పెళ్లాం చచ్చిందో, బతికిందో చూడరు. ఇంక వీధులమ్మట ముష్టెత్తుకు బతకాలి నేను." అన్న భార్య మాటలకి సమాధానంగా

"ఈ వేలెడు వెధవకోసం, నాకివ్వవన్న మాట. ఆగు. వీడిని చంపేస్తాను..." అని భర్త ఆమె వేపుకి వెళ్లి, పిల్లవాడిని పట్టుకోబోతాడు. పిల్లవాడిని ఎత్తుకుని దూరంగా వెడుతుంది తల్లి. ఆక్షణంలో గోపాలం గదితలుపులు తన్ని, వూడతీసి లోనికొచ్చాడు. భార్య తన మెడలో గొలుసు భర్తకి ఇస్తోంది. ఆ గొలుసుని లాక్కున్నాడు గోపాలం. భర్తని ఇల్లా చివాట్లు పెట్టాడు:

"ఆడకూతుర్ని కొడతావా? ఆ గొలుసు కాజెయ్యాలని చూస్తావా ? దొంగయెదవా..... ఏది ఆ గొలుసు యిల్లా ఇయ్యి. లేవావంటె చంపేస్తాను.

.....తాగుడూ జూదమూనట్రా నీకు. సదువు కున్నోడివి. పెళ్లాం నగలే ఎత్తుకు పోతావట్రా దొంగనాయాల

భర్త చేతిలోంచి గొలుసులాక్కుని, భార్య కిస్తాడు దొంగతనాని కొచ్చిన గోపాలం. వెళ్లిపోతూ భర్తని హెచ్చరిస్తాడు:

"నువ్వు ఇంక ఎప్పుడేనా గొలుసు తీసు కున్నట్టు కానీ ఆవిడ ఒంటి మీద దెబ్బపడి నట్లుగాని తెలిసిందా, నీ ప్రాణం తీసేత్తాను." అనివెళ్లబోతూండగా

"ఎవరు బాబూ నువ్వు....?" అని అడుగుతుంది ఇల్లాలు.

తెల్లబోయి 'నన్ను గోపాలం అంటారు లెండి. అంతె." అని, తలెత్తకుండా పెరట్లోకి చీకట్లోకి నడిచి వెళ్లి పొయ్యాడు, గోపాలం.

ఇదీకథ. కేవలం కథగా చూస్తే, ఇది చాలా మంచి కథ. తాగుడూ, జూదమూ ఎప్పుడూ అవినీతిగా పరిగణింప బడతాయి. కనుక ఈ కథలో వస్తువు మరో పాతిక, వలభై, యాభై ఏండ్లు గడిచాక కూడా పాత బడదు. కాలంతో దీనివిలువ తగ్గదు. శాశ్వతమైన సాహితీ ప్రయోజనాన్ని సాధించిన మంచి కథ ఇది. యదార్థ జీవితంలో ఇట్లాంటి సంఘటనలు, పరివర్తన, లేకపోలేదు. ఈ మధ్యనే ఢిల్లీలో ఇద్దరు పెద్ద ఉద్యోగులు, ఒక వేశ్య (నర్తకి) గృహంలో కేకపెట్టి అల్లరి చేసి పోలీసులకు పట్టుబడ్డారుట. అల్లరికి కారణం ఆ ఉద్యోగులు అక్కడ తాగుడు మొదలెట్టడం. వేశ్య వారిని తాగవద్దందిట. దురలవాటు విడిచి పెట్టమందిట. వారు గంద్రగోళంచేసి, ఘర్షణ పడి, పోలీసులకు దొరికిపొయ్యారు. పడుపువృత్తి సాగిస్తున్న ఆ వేశ్య, వారిని తాగుడు మాన మంటోంది. దొంగతనాని కొచ్చిన గోపాలం, జూదం మానమనీ, దొంగతనం మానమనీ భర్తని హెచ్చరిస్తున్నాడు.

ఒకటి యదార్థ సంఘటన, రెండోది కథ. మానవ ప్రకృతితో, అంతరంగ జగత్తుతో పొత్తు కుదుర్చుకున్న కథకుడు చెప్పిన కథ యీ 'దొంగ' అన్న కథానిక. అందుకునే సాహిత్యం అనిపించుకుంటుంది. రచనలో అందచందాలున్నాయి. వృథావర్ణనలు, వ్యాఖ్యానాలు, లేవు. వెన్నెట్లో గోపాలం దొంగతనానికి వెడుతున్న యీ వర్ణన చూడండి.

'వీధులూ, యిళ్ళూ ఆ మసక వెన్నెట్లో ఒంటరిగా గోపాలంకోసం యెదురు చూస్తోన్నట్టు వున్నాయి.'' ఆ సమయాన్ని, ఆ దృశ్యాన్ని ఇట్టే వూహించగలం — 'ఒంటరిగా యెదురు చూస్తున్న' ఇళ్ళని. ఇంక, కన్నం వెయ్యాలనుకున్న ఇంటికి చేరుకుంటాడు. ఆ ఇల్లు ఎల్లావుంది ? ఒక్క వాక్యంలో గొప్పగా వర్ణించాడు కథకుడు.

''ఆ ఇల్లు మసక వెన్నెల్లో ముడుచుకున్న తాబేలులా వుంది.''

రచయితది మంచి చూపు. బలమైన వూహ.

'ముడుచుకున్న తాబేలు' గొప్ప .ఉపమానం

భర్త గొలుసు లాక్కున్న తర్వాత, గోపాలం వారిని ఎదుర్కొంటాడు.

''ఆమె సన్నగా ఎర్రగా నాజూకుగావుంది. జుట్టంతా రేగిపోయింది. చెక్కిళ్ళు కన్నీళ్లతో తడిసి పోయి వున్నాయి. పాతికేళ్లయినా వుండవు. కళ్లల్లో భయాశ్చర్యాలు పెనవేసుకున్నాయి. చంకలో పిల్లవాడు ఏడుస్తున్నాడు.''

ఆ మనిషి, ఆ పరిస్థితి, అర్థం చేసుకునేందుకు యీ వర్ణన చాలు. ఆమె, గోపాలానికి అల్లా అగుపడింది. మనం ఆమెని అతన్ని కళ్లతోనే చూస్తాం. కథ ముగింపులోని అందాన్ని అవగాహన చేసుకోడానికి యీ వర్ణన చాలా ముఖ్యం. దీన్ని దాటేసి చివరలో ఏమవుతుందో నని, ఆఖరివాక్యాలు చదివి తృప్తిపడితే, ఆఖరి వాక్యాలలోని ప్రత్యేక సౌందర్యం మనం గమనించలేక పోవచ్చు. ఆ చివరి వాక్యా లేమిటి?

''ఎవరు బాబూ, నువ్వు ?'' అని అడుగు తుంది, గొలుసుని, పిల్లవాడిని సురక్షితంగా వుంచుకున్న తల్లి.

''నేనా—నేనా.....'' తెల్లబోయాడు గోపాలం.

''నన్ను గోపాలం అంటారులెండి. అంతే.'' అంటూ గోపాలం తలెత్తకుండా వడివడిగా పెరట్లోకి చీకట్లోకి నడిచి వెళ్లిపొయ్యాడు.—

అదీ ముగింపు.

ఆమె భర్తని నానా తిట్లూ తిట్టిన గోపాలం— 'అంటారు లెండి.' — అని ఆమెని మర్యాదగా సంబోధించడం, 'తలెత్తకుండా'—వెళ్ళి పోడం గమనించ తగ్గవి. ఆమె సన్నగా ఎర్రగా నాజూకుగావుంది. ఆమె చెక్కిళ్ళు కన్నీళ్లలో తడిసిన దృశ్యం చూసిన గోపాలం, 'తలెత్తకుండా' వెళ్లిపోతాడు మరి! ఆ సంఘటన గోపాలంలో తెచ్చిన పరివర్తన, పాఠకుడిలో లెచ్చిన మార్పు— యీ రెంటి సమన్వయం, ఆమెని 'అండీ' అని సంబోధించడంలోనూ, 'తలెత్తకుండా' వెళ్లడం లోనూ వున్నాయి. ఇందలి స్వారస్యం అవగాహన చేసుకోడానికి, ఆమె వర్ణన అవసరమైంది. సగం కథ చదివాక, చివరికి ఏమవుతుందో నాకుతెలిసి పోయినా, చివరిదాకా చదవక తప్పిందికాదు. అందుకే మంచి కథ అన్నాను.

ఇందులో, ఏదోషాలూ, ఇబ్బందులూ లేవని కాదు. శ్రద్ధగా, అదేపనిగా వెదికితే ప్రతికథలోనూ ఏదో ఒక దోషం దొరక్కపోదు. ఈ కథలో గోపాలం మనస్తత్వ వర్ణన తీసుకోండి. ''గోపాలానికి తను చేసే పనిమీద నైతిక సందేహాలు ఏమీలేవు. దొంగ తనం తప్పనీ, పాపమనీ అతను అనుకోలేదు. ఎందరో తమ తమ అవసరాలకి యెన్నో వృత్తులూ, ఉద్యోగాలూ చేసినట్టుగా, అతనూ యిది చేస్తున్నాడే తప్ప, మంచి చెడ్డల సూక్ష్మ విచారణ చేసే పిరికి తనం కాని, అసలటువంటి ఆలోచనలకి అవసరం కాని అతనికి కనిపించలేదు. అందువలన అంతరాత్మని నొక్కివేయడమూ, ఒప్పించడమూ లాంటి బాధలు కలగలేదు. తన పనిలో దొరికి పోతే జైలుకి వెళ్లాలన్న భయమూ, జ్ఞానమూ వున్నాయతనికి.'' ఇదంతా గోపాలం గురించి, కథకుడి అభిప్రాయమూ, వ్యాఖ్యానమూ అనిపించు కుంటుంది — కాని దానివల్ల గోపాలం గురించి మనకేమీ తెలియదు. తెలిసినవి, విరుద్ధంగా, గందరగోళంగా కూడా వున్నాయేమో. అతను

దొంగతనం తప్పని అనుకోడుట — సూక్ష్మ విచారణవల్ల సంక్రమించే పిరికితనం అతనిలో లేవని చదివాం మొదట్లో. తరువాతి వాక్యాలలో 'తన పనిలో జైలుకి వెళ్ళాలన్న భయమూ, జ్ఞానమూ వున్నాయి' అని చదివాం. ఈ భయం, జ్ఞానంవున్న వ్యక్తిలో, నైతిక సందేహాలు లేవనడం సబబు కాదనిపిస్తుంది. ఆత్మ పరీక్షవల్ల జనించే పిరికితనం లేనివ్యక్తికి, జైలుకెళ్ళాల్సి వొస్తుందన్న భయం మటుకు ఎందుకుండాలి ? రచయిత గోపాలం వ్యక్తిత్వాన్ని స్పష్టంగా పరిశీలించ లేక పొయ్యాడు. తన వ్యాఖ్యానమే, అతని మన స్తత్వమన్న భ్రమలో పడి సాగించిన యీ వర్ణన తొలిగిస్తే కథకి ఏలోపమూ రాదనుకుంటా.

గోపాలం సంభాషణలో 'యాస' ప్రవేశ పెట్టడం, బాగానేవుంది కాని, చివరిదాకా, సక్రమంగా కొనసాగ లేదేమో అనిపిస్తుంది. ఈ వాక్యాలు పరిశీలించండి:

"ఆడకూతుర్ని కొడతావా ? ఆ గొలుసు కాజెయ్యాలని చూస్తావా ? దొంగ యెదవా. సిగ్గులేదురా నీకు. బుద్ధిలేదురా. నీది ఆ గొలుసు యిల్లా ఇయ్యి. లేవకు. లేచావంటే సంపేస్తాను."

'గొలుసు కాజెయ్యాలని చూస్తావా' అన్న దాంట్లో 'చ', 'చు' శబ్దాలని వాడ గలిగిన గోపాలం 'లేచావంటె సంపేత్తాను.' లో, 'స' బదులు, 'చ' ఎందుకు వాడలేడు ? అల్లాగే 'బుద్ధిలేదురా'లో వొత్తు స్పష్టంగా పలికిన వ్యక్తి 'దొంగవెధవ' అని ఎందుకనలేడు ? 'దొంగ యెదవ' అని ఎందుకనాలి ? చదువుకోని గోపాలంకి, చదువుకున్న వాడి మనస్తత్వం ఆపాదించడం, చదువులేని వాడి 'యాస' సంభాషణలో, సంస్కారంవున్న వాడి శబ్దాలను, భాషని ప్రవేశ పెట్టడం, — ఇవీ యీ కథలో దోషాలు. ఇవి స్వల్పమైనవి. మచ్చు కోసం, వెదికి పైకి లాగినవి. మొత్తం మీద, నిలబడే, మంచి కథ; — బాలగంగాధర తిలక్ మంచి కథకుడు; కవి; ఇయన మనకి దక్కితే, ఎన్నో మంచి రచనలు చేసేవాడు. కాని ముందు ముందు, ఈయన ఎన్నో మంచి రచనలు చేస్తాడు, అంటూ, చేసిన వాటిని చులకన చెయ్యకుండా, వాటికి కృతజ్ఞత వెలిబుచ్చి, స్వీకరించి, తోటి వారితో పంచుకోడంతో ముగిసాను.



# అందే ఆశలు

శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

ఏ కాననపు ఆకుపచ్చ సౌందర్యాలు
ఈ మోడు కొరక వింత కాంతి తెచ్చేనో—

ఏ తరుణ కలకంఠ గీతానిలాంచలము
ఈ మౌన వేణువుకు ప్రాణ మిచ్చేనో—

ఈ నీల నిశ్శబ్ద గగనంపు బ్రతుకులో
నెలవంకలను తీర్చు వెలుగు రే యేడనో—

ఏ వసంతపు చూపు ఈ తీవపై ప్రాకి
వల్లి వల్లీ పూల పల్లకీ యానో—

తీగ తీగా మధుర రాగాన స్పందింప
ఏ యుషస్సులు మీటు ఈ విశ్వవీణా—



# సెక్యులరిజం - 4

శ్రీ ఎం. సి. సెటల్వాడ్

కొన్నికొన్ని మతాచారములు వున్నవంటే, అవి మత సంబంధమైనవిగా కన్పించుచున్నప్పటికీ, మూఢ నమ్మకము నుండి ప్రాదుర్భావము చెందినవి అయి వుంటాయి. ఇటువంటి ఆచార వ్యవహారములను ఆ మతమునకు బాహ్యములైన విషయములుగా భావించ వచ్చును. వీని సంగతి ఏమి? ఇటువంటి ఆచారములను గురించి సుప్రీం కోర్టువారు ఒకమాట చెప్పివున్నారు. వీని విషయమున జాగ్రత్త అవసరమనియు, వానిని జాగ్రత్తగా పరిశీలింపవలయుననియు, వారు అభిప్రాయపడినారు. ఈ రకమైన ఆచారములు మతములో ప్రధానమైన, అంతరంగికమైన అంశము లగునా, కాదా అని పరిశీలించి తేల్చవలయునని వారి అభిప్రాయము. ఈ పరిశీలనము కోర్టువారి అభిప్రాయములను బట్టి, లేక వైఖరిని బట్టి జరుగ రాదు. ఆ ఆచారములు కలిగిన మత సమాజము యొక్క దృక్కోణము ద్వారా వానిని పరిశీలన చేయ వలసి వున్నది. కోర్టువారు ఇటువంటి విషయములో తమ ఎదుటకువచ్చిన సాక్ష్యమును బట్టి నిర్ధారణ చేయుటయే పద్ధతి.

"మత సంబంధమైన వ్యవహారములు" అని, రాజ్యాంగములో వున్న పదములకు విశేషమైన అర్థము ఉన్నదని సుప్రీంకోర్టు వారు వ్యాఖ్యానించి వున్నారు.

ఒక మతమువారు ఒక వ్యక్తిని వెలివేసినప్పుడు, ఆ వెలివేయటము వలన ఆ వ్యక్తి తన పౌరహక్కులను కోల్పోయిన పక్షములో శాసనము ద్వారా ప్రభుత్వము వారు కల్పించుకుని దానిని సర్దుబాటు చేయరానటువంటి వ్యవహారమా అది? బొంబాయి లెజిస్లేచర్ వారు ఇటువంటి సందర్భమును పురస్కరించుకుని ఒక శాసనము చేసివున్నారు. ఒక వ్యక్తి వెలివేయబడుట వలన ఫలితము పౌరహక్కులను కోల్పోవుట యైనచో ఆ వ్యక్తికి, ఈ వెలి అన్నది వున్ననూ, సమాజము యొక్క ఆస్తిని అందులో సభ్యుడుగా అనుభవించుటకు గల హక్కు ఏ విధముగానూ వితథము కాదని ఈ శాసనముయొక్క సారాంశము. సుప్రీంకోర్టులో మెజారిటీ న్యాయమూర్తులు ఈ శాసనమును రాజ్యాంగ విరుద్ధమని ప్రకటించియున్నారు. రాజ్యాంగమునందు ఏ రకమైన సంరక్షణము ఒనగూర్చబడియున్నదో, ఆ సంరక్షణము ఒక్క మత ధర్మమునకు, లేక మతవిశ్వాసము వరకు మాత్రమే కాక, ఆ మతమును అనుసరించి చేయబడెడి పనులకు కూడా అనువర్తించునని సుప్రీంకోర్టువారు అభిప్రాయపడినారు.[1] ఒకమత వర్గమునకు, ఆ మత వర్గము యొక్క సభ్యులకు ఆ మతమును సంరక్షించు కొను హక్కు వున్నది గనుక వారు ఆ మతమును సంరక్షించుకొనుటకు క్రమశిక్షణ ద్వారమున ప్రయత్నము చేయవచ్చును. ఆ మత ధర్మములను, కట్టుడులను, ఆచారములను అనుసరించునట్లు చేయుటకు "వెలి" మొదలగు క్రియారూపములు కూడా వారు అవలంబించవచ్చును అన్న అభిప్రాయము ఈ సందర్భమున అభివ్యక్తము చేయబడినది.

వెలివేయుట వలన పౌరహక్కులను కోల్పోవు ఫలితమును తొలగించుటయే పద్ధతిగాగల శాసనము, సంఘసంస్కరణ దక్షమైన శాసనమనియు, ఆ కారణముచేత శాసనము మత విశ్వాసములను అనుసరించి అవలంబించబడిన చర్యలను ప్రతిరోధించునట్టిదైనను సమర్థనీయమైనదేయనియు వాదించుట జరిగినది. ఏవం విధమైన అభిప్రాయము సుప్రీంకోర్టులో ఒక న్యాయమూర్తి మనస్సునకు మాత్రమే వచ్చినది. ఆయన ఈ శాసనము అంతరంగ సంబంధమైనను

1. 1962 Supp. (2) S. L. R. 491.

వ్యక్తిగత స్వేచ్ఛా పరిపూర్తి ధ్యేయముగా కలిగినది కనుక, రాజ్యాంగ విహితమేనన్న అభిప్రాయమును వెల్లడించి యుండిరి. మెజారిటీ న్యాయమూర్తులు ఈ అభిప్రాయముతో ఏకీభవించలేదు.

అయితే హిందూ దేవాలయములలోనికి హరిజనుల యొక్క ప్రవేశమును నిరాకరించు పద్ధతిని తొలగించుట యన్నది ప్రయోజనముగా కల్గిన మద్రాసు శాసనము విషయములో సుప్రీంకోర్టు వారు రాజ్యాంగములో ఈ విషయమునకు సంబంధించి ఉన్న అంశమునకు బలమును చేకూర్చిరి. మతధర్మమును ఆచరించుకొను స్వాతంత్ర్యమునకు దీనిని ఒక అపవాదు క్రింద పరిగణించవలయునని అచ్చట తేల్చుటయు జరిగినది.[2]

మత సంబంధమైన ధర్మాదాయములను గురించియు, మత సంబంధమైన సంస్థలను గురించియు శాసనమును చేయు అధికారమును భారత రాజ్యాంగము రాజ్యమునకు లేక ప్రభుత్వమునకు ఇచ్చి యున్నది. అయితే, రాజ్యాంగము అన్నిమతముల వారికిని ఆస్థిని పొందుటకు హక్కును, ఆర్జించుటకు హక్కును, మత సంబంధమైన విషయములలో ఏ మతము వ్యవహారములను ఆ మతము చూచుకొనగల హక్కును ప్రసాదించి యున్నది. అందువలన ప్రభుత్వమువారికి ఈయబడిన ఈ శాసనము చేయు అధికారమును మతమునకు ఇచ్చిన ఈ హక్కును కాదను విధముగా వినియోగము కారాదని వాదించుట ఉన్నది.

అయితే, రాజ్యాంగము ఈ రకమైన ధర్మాదాయముల విషయమున కూడ కొన్ని మాటలు చెప్పి ఉన్నది. శాసన ధర్మమునకు అనుకూలముగా మాత్రమే ఈ మతవర్గముల వారు మత సంబంధమైన ఆస్థులను నిర్వహించవలయునన్నది రాజ్యాంగము నందున్న విషయముయొక్క తాత్పర్యము.

ఈ ధర్మాదాయ మతాదాయములను నిర్వహించు హక్కును పూర్తిగా రహితము చేయకుండా ఉన్నంతవరకు ఈ రకమైన ఆస్థుల నిర్వహణమును క్రమబద్ధము చేయుటకు ప్రభుత్వము శాసనము చేయుటకు సమర్థమేనన్న అభిప్రాయము అంగీకరింపబడినది. ఈ అధికారము ననుసరించి దేవాలయముల నిర్వహణమును క్రమబద్ధము చేయుచు బహుశాసనములు ముఖ్యముగా దక్షిణ దేశములో సముద్భవము చెందినవి. కొంతకాలము క్రిందట హిందూ మతాదాయముల పరిశీలన సంఘమువారు కూడ తమ నివేదికలో ఈ మతాదాయ ధర్మాదాయములను మరియు క్రమబద్ధము చేయవలయు అవశ్యకతను గూర్చి సిఫార్సును చేసి ఉన్నారు. ఎచ్చట ప్రభుత్వము కల్పించుకొని దేవాలయముల నిర్వహణమును క్రమబద్ధము చేయుటకు శాసనములు చేసి ఉన్నదో, అచ్చట పూర్తిగా మతమునకు సంబంధించిన వ్యవహారములయందు కూడ ప్రమేయము పెట్టుకున్న సందర్భములు కన్పించుచున్నవి. అయితే, హిందూ సమాజమునకు తన మతసంస్థలను గూర్చి చూచునటువంటి అధికార వ్యవస్థానమేదియు లేదు. అందువలన ప్రభుత్వము కల్పించుకుని హిందూమత సంస్థల నిర్వాహణమును క్రమబద్ధము చేయుటకు శాసనములు చేయవలసిన పరిస్థితి అవశ్యకమైపోయినది.

ప్రభుత్వము యొక్క నిధుల సాహాయ్యముతోనే నడుపబడుచున్న ఏ విద్యాసంస్థయందును మత బోధనము పనికిరాదని రాజ్యాంగము శాసించుచున్నది. మరియు ప్రభుత్వముచేత గుర్తింపబడినట్టియు లేక ప్రభుత్వము యొక్క సహాయమును పొందు చున్నట్టియు విద్యాసంస్థయందు చదువుకొనుచున్న ఏ వ్యక్తిగాని, ఆ విద్యాసంస్థయందు మతబోధనమును పొందవలసిన అవసరము గాని, ఆ విద్యాసంస్థయందు జరుగు ప్రార్థనాదికములకు హాజరు కావలయునను నియమము కాని ఏమియు ఉండరాదని రాజ్యాంగము చెప్పుచున్నది. అయితే ఆ వ్యక్తి తనకు ఇష్టమైనచో ఆ బోధనమును పొందవచ్చును. ప్రార్థనాదికములకు హాజరు కావచ్చును. అనగా, ఆ వ్యక్తియొక్క అనుమతి లేకుండా ఆ విద్యాసంస్థయందు అతనికి మతబోధనము చేయుటగాని, ప్రార్థనాదికములకు హాజరు కమ్మనుట గాని తగదని తాత్పర్యము.[3] రాజ్యాంగములోని ఈ అంశముల వలన ఒక్క విషయము స్పష్టమగుచున్నది. ప్రభుత్వము వారి సహాయమును పొందుచూ నడుచుచున్న విద్యాసంస్థలలోనేమి, కొంతవరకు ప్రభుత్వ సహాయ్య

2. 1958 S C. R. 89.

3. 28వ అధికరణము (1) మరియు 28 (3)

ముతో నిర్వహింపబడుచున్న విద్యాసంస్థలలోనేమి మతబోధనము అంగీకార్యమని ఈ అంశము వలన విశదమగు చున్నది. ఇచ్చట కూడా మతమును, రాజ్యమును ఒకదాని నుండి ఒకదానిని పూర్తిగా పృథక్కరించిన రాజ్యములకును భారతదేశమునకును గల తారతమ్యము విద్యమానమగు చున్నది. భారత రాజ్యాంగమునందు గర్భితమై ఉన్న అభిప్రాయము రాజ్యమును మతమును ఒకదాని నుండి ఒకదానిని పూర్తిగా పృథక్కరణము చేయుట కాదనియు, సర్వమతములను సమబుద్ధితో చూచుచు, వివిధ మతవర్గముల యొక్కయు, లౌకిక క్రియాకలాపములను వారి సంస్థలను శాసనములచేత క్రమబద్ధము చేయు అధికారమును రాజ్యము కలిగియుండుటయు ననియు గట్టిగా చెప్పుటకు వలనుపడుచున్నది.

దేశములో అల్పసంఖ్యాక వర్గములనేకమున్నవి. ఈ వర్గములతో సరిగా మతవర్గముల్కు చెందిన అల్పసంఖ్యాకులకు కూడ వారి ఇష్టమునకు అనుకూలముగ విద్యాసంస్థలను నెలకొల్పుకొని, నిర్వహించుకొను నధికారమును రాజ్యాంగము ఇచ్చి వున్నది.[4] ఏ అల్పసంఖ్యాక మతవర్గమైనను తన సంస్కృతిని గురించి అవిరళ కృషిని జరుపుకొనవచ్చును. ఇందు నిమిత్తమే గాక, తన మతవిశ్వాసముల నిరంత వ్యాప్తికి కూడ విద్యాసంస్థలను నెలకొల్పుకొని కృషి సలుపుకొనవచ్చును. మతవర్గముల వారికిని, వ్యక్తులకును మత సంబంధముగా సర్వస్వాతంత్ర్యములు వున్నవని యున్న అంశములకు ఇది ఆనుషంగికమైనటువంటిది. పైగా ఆయా అల్పసంఖ్యాక మతవర్గముల నిర్వహణములో వున్నవనిన కారణమును ప్రదర్శించి, ఆరకమైన విద్యాసంస్థలకు సహాయమును సమకూర్చు విషయమున ప్రభుత్వము విచక్షణ చేయరాదని కూడ రాజ్యాంగము విధించుచున్నది. ఇతర విద్యాసంస్థలకు వలెనే యీ రకమైన విద్యాసంస్థలకును ప్రభుత్వము సహాయమును సమకూర్చవలసి యున్నది. అయితే ఇచ్చట ఒక్కటే ప్రధానమైన విషయము. ఈ సహాయమును చేయుటలో విచక్షణను ఎంతమాత్రము చూపించరాదు.

మత సంబంధమైన అల్పసంఖ్యాక వర్గముల సౌకర్యార్థము రాజ్యాంగమునందు పొందుపరచబడివున్న యీ యీ అంశములను గురించి కొంతవివాదము నడిచి యున్నది. ఇండియన్ యూనియన్‌లో ఏ రాష్ట్రమైనను ఇందుకు సంబంధముగా నొక శాసనమును చేయవలయునన్నచో దేనిని మత సంబంధమైన అల్పసంఖ్యాకవర్గముగా గ్రహింపవలసి యున్నది యన్న ప్రశ్న వచ్చినది. ఈ వివాదముతో సంబంధముకల రాష్ట్రము కేరళరాష్ట్రము. ఆ రాష్ట్రమునందు కొన్ని పాఠశాలలు క్రైస్తవ మతము వారిచేత నిర్వహింపబడుచున్నవి. ఆ పాఠశాలలకు సంబంధించి ఆ రాష్ట్రమున నా శాసనము చేయబడినది. మత సంబంధమైన అల్పసంఖ్యాక వర్గములకు సంబంధించి రాజ్యాంగమునందు ఏ విధమైన అనుశాసనము, ఉన్నదో, దానిని యీ క్రైస్తవమత వర్గమునందు చెల్లకుండ చేయవలయునని ఆ రాష్ట్రము, ఆ శాసనము ద్వారమున ప్రయత్నము చేసినది. రాజ్యాంగమునందు మత సంబంధమైన అల్పసంఖ్యాక వర్గము సంగతి యున్నమాట నిజమే అయినను, ఆ అల్పసంఖ్యాకత్వమన్నది రాష్ట్రము అంతకు సంబంధించి గాక, ఆ విద్యాసంస్థలు యే ప్రత్యేక ప్రాంతమునందు పనిచేయుచున్నవో అచ్చట ఆ మతవర్గము వారు అల్పసంఖ్యాకులై వుండవలయునన్న వాదమును ఆ రాష్ట్రము ప్రకటించియున్నది. సుప్రీంకోర్టు వారు యీ రకమైన వాదమును తిరస్కరించుటయే గాక, ఈ చేయబడిన శాసనము ఎంత ప్రాంతమున అమలు జరుగునో ఆ ప్రాంతమునందలి జనాభాను బట్టి ఆ శాసనము ఒక ప్రత్యేక అల్పసంఖ్యాకవర్గమునకు బాధకమగుచున్నదా, లేదాయన్న విషయమును తేల్చవలసి యున్నదని విశదము చేసియున్నారు.[5]

మరియు మత సంబంధమైన అల్పసంఖ వర్గములకు, విద్యాసంస్థలను నడుపుకొను మున యే రకమైన హక్కు ప్రసాదించబడియున్నదో, ఆ హక్కును ప్రభుత్వము పరోక్షమార్గమున, అనగా, ఆ విద్యాసంస్థలకు పరిగణనమును ప్రసాదింపక పోవుటయను పద్ధతి మూలమున విఘాతమును కల్గించరాదు. ఈ సంస్థల యందు విద్యాప్రమాణములు ఉన్నతమైన స్థాయి యందు నిర్వహింపబడవలయుటకు ఆ విద్యాసంస్థలను ప్రభుత్వము క్రమ

4. అధికరణము 30 (1)

5. 1959 ఎస్. సి. ఆర్. 995; 1.47—1050.

బద్ధము చేయవచ్చును. ఆ అధికారము ప్రభుత్వమున కున్నది. అయితే ఇట్లా క్రమబద్ధము చేయుటయన్న పేరుతో విద్యాసంస్థలను నిర్వహించుకొనుటకు మత సంబంధమైన అల్పసంఖ్యాక వర్గములకు ప్రసాదింప బడియున్న హక్కునకు ప్రభుత్వము ఏ విధముగాను బాధకముగా ప్రవర్తింపరాదు. విద్యాసంస్థలను ఏర్పాటు చేసుకొనగల్గుటకు ఈ రకమైన మతవర్గములకు గల హక్కులో, ఆ సంస్థల మూలమున, ఆ సమాజము యొక్క అవసరముల కనుసేవ్యములు కావలయునన్న యర్థము ఇమిడి యున్నది. ఒకానొక సంస్థను ప్రభుత్వము పరగణన చేయవలయునన్న ప్రాతిపదికమైన హక్కు అన్నది లేకపోవచ్చును. కాని ఆ మత సంబంధమైన అల్పసంఖ్యాక వర్గము తనకు ఇట్టి సంస్థలను నడుపుకొనుటకు గల హక్కును వదులుకొన్న సందర్భము అన్నది తటస్థ పడినయప్పుడు తప్ప, మరి యెప్పుడును ప్రభుత్వము శాసనము చేత ఆ హక్కును తిరస్కరింపజాలదు. తిరస్కరించుట యనగా, రాజ్యాంగము చేత వారికి ప్రసాదింపబడియున్న ఆ హక్కును వారికి లేకుండ చేయుటయే అగును గాని వేరకాదు.[6]

అల్పసంఖ్యాక మతవర్గముచే నిర్వహింపబడుచున్న విద్యాసంస్థకు గ్రాంటులు ఇచ్చునప్పుడు ప్రభుత్వము షరతులు ఏమన్నా పెట్టినట్లయితే, అవి ఆ సంస్థ సమర్థముగా నడుపబడుటకు సంబంధించినవి మాత్రమే అయివుండవలెను; ఆ సంస్థను క్రమబద్ధముచేయుటకు ఇంతకుమించిన ఇతర మార్గములేదు. ఇచ్చుటకూడనా అల్పసంఖ్యాకులకు చెందిన సంస్థయొక్క లక్షణములో యేవిధమైన మార్పుగాని జరుగరాదు. ఆ సంస్థయొక్క ఆ లక్షణమును కాపాడుచునే పై విధముగా యమును ప్రభుత్వము సమకూర్చవలసియున్నది.[7]

ఈ విధముగా న్యాయస్థానములు ఈ హక్కులకు అతివిస్తారమైన అర్థమును సమకూర్చుచు రాజ్యాంగమును వ్యాఖ్యానించి యున్నవి. మత సంబంధమైన అల్పసంఖ్యాక వర్గముచేత స్థాపించబడి, నిర్వహింపబడుచున్న సంస్థలపై, అవి యొక ప్రత్యేక మత సంబంధమైన అల్పసంఖ్యాక వర్గమునకు చెందిన సంస్థలు అన్న లక్షణము చెరిగిపోవు విధమున ఇచ్చట వ్యవహరించుటకు లేదు. నిజమైన సెక్యులరు రాజ్యమునకును, మనకును ఇచ్చట సంబంధమే లేదు. భారతదేశములో ప్రభుత్వము ప్రత్యేక మతవర్గముల వారు పాఠశాలలను నడుపుకొనుటకు అనుమతించవలయును. మరియు, నితర విద్యాసంస్థల కిచ్చుచున్న విధమున ఈ మత సంబంధ అల్పసంఖ్యాకవర్గములవారి పాఠశాలలకును సహాయమును మంజూరు చేయవలయును.

దేశములో బహువిధములైన శాసనములున్నవి. ఇప్పుడు ఆ శాసనములను సెక్యులర్ రాజ్య దృక్కోణము నుండి పరిశీలనము చేయుటయు కూడ లెస్స. భారతదేశమునందు బ్రిటిష్‌వారు ప్రవేశించుటకు పూర్వము, ఈ దేశమున అనేకములైన శాసన ధర్మములు చెల్లుచూ వచ్చినవి. అవి తరచు పరస్పర విరుద్ధములు. ఇవి యన్నియు కొంత హిందూధర్మము మీదను, కొంత ఇస్లామిక ధర్మము మీదను ఆధార పడి యుండుట జరుగుచూ వచ్చినది. ఏవం విధమైన బహువిధ శాసనధర్మముల స్థానమున ఏకాకారమైన శాసన ధర్మములను, సివిలు వ్యవహారములందును, క్రిమినలు వ్యవహారములందును ప్రవేశ పెట్టవలయునని బ్రిటిషు వారు సంకల్పించిరి. వీనిలో ఇండియన్ పీనల్ కోడ్ బహుశా మొదటిదై యుండవచ్చును. 1861 లో ఇది ప్రఖ్యాపనము చెందినది. వంద సంవత్సరములపాటు దేశమునందు క్రిమినలు వ్యవహారములలో శిక్షాస్మృతిగా నిది ఎక్కువ సవరణలకు లోనుకాకుండ నమలు జరిగినది. సివిలు వ్యవహారములను గురించియు, క్రిమినల్ వ్యవహారములకు సంబంధించియు బ్రిటిషువారి కాలమున ననేక శాసనములు చేయబడినవి. అదే విధముగ కాంట్రాక్టునకు సంబంధించిన శాసనములుకూడ చేయబడి, అమలు జరుపబడినవి. ఇవి అన్నియు ఏకాకారము కలవి, దేశమునందంతటను ఏకవిధముగా నమలు జరిగినవి. ఇచ్చట ప్రాంత విభేదమని, సమాజము నందలి వర్గముల విభేదమని ఎంచబడినదిలేదు. అన్నిప్రాంతముల యందును ఇవి చెల్లుబడి అయినవి. ప్రజలందరి పట్లను వర్తింప చేయబడినవి. బ్రిటిష్ వారి హయామునకు ముందున్న యిట్టి శాసనముల యందు తుల్యధర్మమనునది లేకయుండెను. వేరువేరు వర్గములయందున నవి వేరువేరు విధముగ చెల్లుచు నుండినవి. ఒక కులమునందు, లేక మతమునందు ఒకరు ఉన్నత స్థానీయులగుచో వారియందీ ధర్మ

6. 1959 S. C. R. 498.
7. A. I. R. 1963 S. C. 540.

శా(స్త్రములు అంతగా పాటింపబడినదిలేదు. అట్టి వారిని (ప్రత్యేకముగా చూచుట యన్న పద్ధతి చెల్లు బడి యగుచు వచ్చినది. అందువల్ల దేశము సందంత టను ఏక విధముగ, తుల్య(ప్రాబల్యముతో శాసన ధర్మ ముల నవలు పరచు పద్ధతి భారతదేశమున (బిటిషు వారిలోనే పుట్టినదని చెప్పవచ్చును. ఇందుకు మనము వారి కెంతయో ఋణపడియున్నాము. వారు లమలు పరచిన, లేక (క్రోడీకరణము చేసిన ధర్మశా(స్త్రముల యందు సెక్యులరిజము సమానత్వము అనునవి (ప్రస్ఫుటమై గోచరించుచూ వచ్చినవి.

అయితే (బిటిష్ పరిపాలకులు భారత సమా జమునందలి ఆయా విభాగముల వారి వైయక్తిక ధర్మములను పెద్దగా ముట్టుకొనలేదు. మతము విష యమున వారు తటస్థ వైఖరి నవలంబించుచూ వచ్చిరి. వైయక్తిక ధర్మానుశాసనములను వారు తాకక యుండుట కిదియే కారణమైనది. చట్ట నిర్మాణ సభ లేర్పడిన తొలి రోజులలో (బిటిషువారు వారసత్వవ్యవహారములకు సంబంధించియొక శాసనమును మా(తము చేసి యుండిరి. అయినను వైయక్తికధర్మాను శాసనము (ప్రకారము నడుచుకొనవలయునను ఇచ్ఛ కలవారియందీ శాసన మాచరింపబడలేదు. 1950 సంవత్సరమున సర్వస్వాతం(త్ర్యములతో భారత రాజ్య మవతరించు వేళకు దేశమున బహువిధములైన వైయ క్తిక ధర్మాను శాసనములు చెల్లుబడియగుచు నుండుట పొడగట్టుటకు ఆకర మేర్పడి యుండినది. వివాహ మును గురించి, విడాకులను గురించి, మరియు నితర మైన యనేక విషయములను గురించి సంఘము నందలి వేరు వేరు విభాగముల వారికి వేరువేరు శాసనము లుండుచూ వచ్చినవి.

ఇట్టి పరిస్థితిని గమనించియే భారత రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగములో 44 వ అధికరణములో ఇటువంటి విషయమునుగురించి స్పష్టమైన (ప్రసక్తిని తెచ్చియున్నారు. భారతదేశము అంతటా అందరి పట్లను సమముగావర్తించువిధముగా ఏకవిధమైన సివిల్ కోడును (ప్రఖ్యాపనము చేయవలసి యున్నదనుచూ రాజ్యవిధానమునే నిర్దేశించి హిందువులకు సంబంధించినంతవరకు ఈ ఆదేశము కొంతవరకు పాటింపబడుటకూడజరిగినది.

(బిటిషువారి కాలములో, ముఖ్యముగా వారి యేలుబడియొక్క చివరిరోజులలో చట్టనిర్మాణ సభలలో భారతీయులకు అధికముగా స్థానము లభించుచు వచ్చినది. మత సంబంధములు, సమాజ సంబంధములు అయిన విషయములలో (బిటిషువారు తటస్థమైన పద్ధతి నవలంబించుచు వచ్చినను హిందు వుల యొక్క వైయక్తిక ధర్మానుశాసనములను సంస్కరించుచు ఆ రోజులలోనే కొన్నికొన్ని శాసనము చేయబడుచూ వచ్చినవి. ముస్లిము ధర్మానుశాసనము లందు చెప్పుకొనదగిన మార్పులేమియు జరుగలేదు. నూతన భారత రాజ్యాంగమునందుకూడ హిందూ ధర్మాను శాసనముననే సంస్కరణము సంకల్పించబడినది. వివాహము, విడాకులు, దత్తస్వీకారము, వారసత్వము మొదలైన యంశములను పురస్కరించుకొని శాసన ములు చేయబడినవి. ఈ శాసనములు కఠినముగా లేవు. మార్దవ లక్షణము కలవిగా మా(త్రమే యున్నవి, హిందువులకు సంబంధించిన ధర్మానుశాసనములందు కాలమునకు తగని అంశములున్నవి. శా(స్త్రసంబంధ మైన విషయములుకూడా మార్చబడవలసినవి యున్నవి. అట్టి వానిని యీ శాసనములు సంస్క రించినవి. మరియు హిందూ సమాజమును శాసించు ధర్మములు ఏకవిధముగా నున్నవికావు. బహు విషయ ములకు సంబంధించి బహువిధ నిబంధనములున్నవి. ఆ నిబంధనములు ఒక్కతీరుగా నుండుట యన్నది కూడ లేదు. వేరు వేరు (ప్రాంతములకు వేరువేరు శా(స్త్రములు అనువర్తింప చేయబడుచు నుండుట వలనను, వేరువేరు (ప్రాంతముం యందు వేరువేరు ఆచారములు చెల్లుబడి యగుచుండుట వలనను నిట్టి భేదములు పుట్టుచు వచ్చినవి. ఇప్పుడు ఈ ధర్మ సంస్కరణము యీ భేదమును తొలగించు నిమిత్త మును, హిందూ సమాజమందంతటను ఏకవిధమైన ధర్మము చెల్లుబాటు అగునట్లు చూచుటకును ఉద్దేశింపబడినది. ఈ ఉద్యమము మందముగ, సంకోచ ఆకుంచితముగ నున్నను, ఏకవిధమైన "సివిల్ కోడు" నిర్మాణమునకు సంబంధించి పెట్టుకొని యున్న ఆదర్శమును సాధించుటకుగాను చేయబడుచున్న (ప్రయత్నముగా మనము భావించవచ్చును. ముఖ్యముగా హిందూ సమాజమునకు సంబంధించి నంతవరకును నిదియట్లు చేయబడుచున్నది.

ఈ (ప్రకరణమునందు 1954 స్పెషలు మారేజి చట్టమును గురించి పేర్కొనుట యవ సరము. ఈ చట్టమును అనుసరించు తలంపుగలవారు తమ మతమును వదులుకొన నవసరములేకనే, దేశము

న్గం దేమతమునకు చెందిన వారైనను, లేక ఏ సమాజ విభాగమునకు చెందిన వారైనను వివాహము చేసుకొనవచ్చును. తమ తమ ధర్మశాస్త్రముల ననుసరించి వివాహములు చేసికొని యున్నవారు కూడ ఈ చట్టము క్రింద తమ యీ వివాహములను నమోదు చేయించుకొని, ఈ శాసనము ప్రసాదించుచున్న సౌకర్యముల ననుభవింపవచ్చును. మరియు నీ శాసనము విడాకులకు సంబంధించి విరళమగు నిబంధనములను మాత్రమే శాసించుచున్నవి. సమిష్టి కుటుంబమునందుండి వివాహమాడిన వ్యక్తి విభక్తమగుటకును, ఆస్తిపై యతని వారసత్వమునకును సంబంధించి కూడ ఈ చట్టము ప్రశస్తముగా నున్నది. ఈ చట్టము ననుసరించుచో, నా యీ విషయముల యందు వైయక్తిక ధర్మానుశాసనమును గాని వారసత్వ విషయమున హిందూ ధర్మశాస్త్రము విధించు విధి నిషేధములనుగాని పాటించవలయుననిలేదు.అవి యిచ్చటపరిహరింపబడినవి.

ఈ చట్టమును వివాహాదికమునకు సంబంధించినంతవరకు "ఏకవిధమైన సివిల్ కోడు"గా నభివర్ణింపవచ్చును. మరియు రాజ్యాంగమునందుద్దిష్టమైన ఏకాంగీణ పౌర ధర్మానుశాసన విధి సాధ్యమునకు ఇది ప్రథమ సోపానమనికూడ యనవచ్చును. దేశములో నే మతమునకు సంబంధించిన వారైనను ఈ చట్టము ననుసరించినచో వారి యందీ యేకవిధమైన వివాహ చట్టమే యనువర్తితమగుచు, వారు వారు వారి మతములను - వదులు కొనవలసిన యవసరము లేకుండ నన్నియును జరుగును. హిందువుగాని, లేక మహమ్మదీయుడుగాని, యీ చట్టము ననుసరించి వివాహము చేసికొనినప్పుడు, వారియందు వారి వారి వైయక్తిక ధర్మానుశాసనముల యందలి కొన్ని ముఖ్య ధర్మములు చెల్లుబడి కాకపోయిననూ, వారు మాత్రము హిందువులుగాని, మహమ్మదీయులు కాని కాకుండ మాత్రము పోరు.

ఈ చట్టమునకు, మరియు నితరమైన హిందూ ధర్మానుశాసన సంస్కరణములకును ప్రతిఘటనము లేక పని జరుగలేదు. హిందువులును, ఇతరులును నీ సంస్కరణోద్యోగమును ప్రతిఘటించి యుండిరి. రాజ్యము సెక్యులరు రాజ్యమైనప్పుడు, మత సంబంధమైన ధర్మానుశాసనములను మార్చు టెట్లని ప్రశ్నించిరి. హిందువులయందు కొందరు

మేధావులు హిందూసమాజ సంస్కరణము హిందూ సమాజమునందు నుండియే యావిర్భవించవలయునని వాదించి యుండిరి. అప్పుడా సంస్కరణ మాలస్యమగును. అయిన నీ సరిగాని, మత సంబంధమైన స్వాతంత్ర్యము నిచ్చుట బలిపెట్టుట జరుగరాదని వారు పట్టుబట్టి యుండిరి. దేశమునందలి సర్వేజనుల యందును ఏకవిధమైన సివిలు కోడును అనువర్తింపజేయుటయన్నదే యిచ్చట యుద్దిష్టమైనచో, అప్పుడు ప్రభుత్వము ముస్లిము ధర్మానుశాసనమునుకూడ సంస్కరించుట కొరకేల పూనిక వహించుటలేదు? అనియు వారు ప్రశ్నించియుండిరి. వీనిని బట్టి తెలియు విషయమేమనగా, దేశములో ప్రజలందరి యందును ఏకవిధమైన సివిలుకోడు అనువర్తించునట్లు చేయవలయునన్న ప్రయత్నము సఫలమగుటకిన్ని కష్టములున్నవి. ఈ ఆశయ సాఫల్యము కొరకే గాక, తదితరమైన యిట్టి బహు ఆశయముల పరిపూర్తి కొరకు కూడ, ప్రభుత్వముచేత సరియైన పద్ధతిలో నిర్వహింపబడు విద్యావిధాన మవసరమగుచున్నది.

సెక్యులరిజము యొక్క సమస్యలు అనేకము. దీనికిపూర్తిగా వ్యతిరిక్తమైనది, వికటించునది మతైకవాదము. ఇచ్చట మతైక వాదమను మాటను విపులమైన అర్థమున గ్రహింపవలసి యున్నది. భారత దేశమునందలి ప్రజలలో కులాభిమానము, మతాభిమానము శతాబ్దములుగా నుండి వారి మనస్సులలో పాతుకొనిపోయి యున్నవి. స్వరాజ్యము వచ్చిన అనంతరము అవి తగ్గినదిలేదు. కొన్ని సందర్భములలో పెచ్చరిల్లినవి. ప్రజల మనస్సులకు సెక్యులరిష్టు భావము లబ్బునట్లు చేయుట కిప్పుడివి ఎంతయు అడ్డువచ్చు చున్నవి. సెక్యులర్ పద్ధతిగల విద్యావిధానము వలన మతదురభిమానమును, కులతత్వమును దమింప వచ్చునన్నది నిర్వివాదమైన విషయము. సెక్యులర్ ధర్మ పద్ధతి ప్రాణముగా గల విద్యా పద్ధతిని పెట్టుకొని, అందు ప్రభుత్వము ప్రజలు ఒక్కటిగా పని చేయుట తటస్థపడినప్పు డిట్టి దురభిమానాయాసములను తేలికగా నుపశమింప జేయువచ్చును. ఇట్టి విద్యను పెట్టుకొని, మరియు తదనుషంగములైన ఇతరమైన కార్యములను నిర్వహించుచు పోయినచో అప్పుడు పౌరజనుని మనస్సు విశాలమై, అతని దృష్టి దేశము సమస్తమునందును, జాతి సమస్తమునందును అధికాధికముగ మలగునట్లు చేయుటకు వీళ్ళు లేర్పడును. (ఆకాశవాణి సౌజన్యముతో)



కలగూరగంప:

# సిరియూరు తామ్రశాసనమందలి సిరియూరు-తామరాడ అవునా?

"భారతి" మాసపత్రిక 42 సం. 11 సం. 23—37 పు. లో రెండవ అమ్మరాజ విజయాదిత్యుని సిరియూరు (కడలి) తామ్రశాసనము ప్రకటించుచు 30 వ పేజీలో దాని స్థల నిర్ణయము చేయునపుడు దాని సరిహద్దు గ్రామముల వివరింపుచు "పశ్చిమ గోదావరిజిల్లాయందలి పాగుణార విషయమందలి విప్పఱ్ఱు (ఇలపఱ్ఱు) దేవ, మోరంబఱ్ఱు (ములపఱ్ఱు,) నొడలి (వడలి) మధ్యస్థమైన "ఏ రామన్నపాలెమో" లేక కాలగర్భలీనమైన ఏ మఱియొక గ్రామమో యనినిర్ధరింప నగును కలుగుచున్నది. అంతేగాని వేఱొక తావునగాదు" అని వ్రాసియుంటిని.

అందుపై "భారతి" 43 సం. 3 సం.—67—71 పే.లోని "సిరియూరు తామ్రశాసనము దాన స్థల నిర్ణయము" అను వ్యాసమున శ్రీ తురగా కృష్ణమూర్తిగారు 67 పేజీలో "ఏ రామన్నపాలెమో లేక కాలగర్భలీనమైన ఏ మఱియొక గ్రామమో అని అనిశ్చయముగ వదలివైచి జిజ్ఞాసువులకు కొంత పని కల్పించినారు" అనియు, 68 పే. 1 కా. లో "ఇట్టి నిర్ణయమునకు వచ్చుటలో వారు కొన్ని సంగతులను విస్మరించి, భ్రమ ప్రమాదవశమునబడి, అపసిద్ధాంతీకరణదోషమునకు పాల్పడినారు" అని వ్రాసినారు. 2 వ కాలములో "ఈ గుర్తింపునకు మూలకారణము వారు తొలుదొల్తనే సిరియూరు గ్రామము రామన్నపాలెము అయియుండవలెనను నిర్ణయమునకు వచ్చిన తరువాత సరిహద్దు గ్రామములను గుర్తింప దొరకొని తమకు వీలుగా నుండులాగున ప్రాచీన గ్రామ నామములను తమ యూహల ప్రకారము నేటి గ్రామ నామములకు అనుసంధింపజూచుటయేగాని అన్యముగాదు....." అనియును వ్రాసియున్నారు.

వారు నా వ్యాసమును సంపూర్ణముగా పరిశీలించినందులకు చాల కృతజ్ఞుడను. అయితే ఒక్క విషయము మాత్రము విచారణీయము. "దాన స్థల నిర్ణయ విషయమై రామన్నపాలెము" అను విషయ నిర్ణయమునకువచ్చి, ఆ తరువాత సరిహద్దు గ్రామముల గుర్తింప దొరకొనుటయు....వీలుగానుండు లాగున సరిహద్దు గ్రామ నామముల ననుసంధింపజూచుటయు అనునది మాత్రము వారు భ్రమపడుటయేగాని యదార్థముకాదు. అట్లెన్నటికిని జరుగలేదు. అందువల్ల సత్యము మఱుగుపడి అపఖ్యాతికి మూల కారణమగును. అందువల్లనే "ఏ రామన్నపాలెమో, లేక కాలగర్భ లీనమైన మరియొక గ్రామమో" అని యుదాహరించితిని. సందిగ్ధ విషయములను సందిగ్ధముగానే వెలువరింపవలెను. అందుపై విజ్ఞులు పరిశీలించి భ్రమ నివారణ గావించి యదార్థ విషయముల వెల్వరింతురు: ఎంతటివారలకైనను సంపూర్ణ విజ్ఞాన మొక్కరిసొత్తు కాదుగదా? అంతేగాక ప్రాచీన గ్రామ నామ (వేయేండ్లపై గడిచిన) నిర్ధారణ బహుకష్టతరసాధ్యము. అట్టితరి నేను ప్రస్తుతము గానరాని "సిరియూరు—రామన్నపాలెమే" అని యూరక ఎచ్చట నిర్ధారణగావించి యుంటిని?.....అట్లయినచో 67 పే.లో "అనిశ్చయముగ వదలి జిజ్ఞాసువులకు కొంత పని గల్పించినారు" అని యెట్లు వ్రాయగల్గినారు? దానినిబట్టియే ఇదమిద్ధమగు నిర్ధారణ గావింప నగును గానక వెనుక ముందాడినట్లు నిర్ధారణ యగుచున్నది.

ఇక యీ శాసన పరిస్థితుల నవలోకింపుడు. అక్షరశ్రేణి చాలవరకు శిథిలమయ్యెను. కొన్ని కొన్ని ముఖ్యమైన తావులందు గుర్తింపరాకుండెను. ఈ శాసన దానస్థలమైన "సిరియూరు" ఏ హారమొ? ఏ విష

యమొ? ఏ నాడో? తెల్పు అక్షరశ్రేణి పూర్తిగా నదృశ్యమయ్యెను. అందుచే చాల కలవడి తుదకు పరిసర (సరిహద్దు) గ్రామములనే నాధారము చేసికొనుట తప్పని సరి. అయితే ఆ సరిహద్దుల మధ్య నీ "సిరియూరు" కాని, తత్తుల్యమైన నామముతోనుండిన గ్రామముగాని యెన్నడును కని విని యెరుంగరాని దయ్యెను. సుప్రసిద్ధనామమైన నేటి సిరిపూరు లేక సిరియూరుగాని, అమలాపురము తాలూకాయందలి సిరిపల్లిగాని, కాకినాడ తాలూకాయందలి సిరిపురముగాని, పెద్దాపురము తాలూకాయందలి సిరిపురముగాని ఏదియు నీ సరిహద్దు గ్రామములకు సంబంధము కానరాదు. అప్పుడింక చారిత్రకాంశముల దొరకొనుటే శరణ్యము. అందు ఈ రెండవ అమ్మరాజ విజయాదిత్యుడు విద్యాభ్యాసకాలమునందే పట్టము గట్టబడుట, విజయ పరంపరలు మొదలగు పరిస్థితులు గమనింప తండ్రి తాతలనాటి రాజకీయ పరిస్థితులు, శత్రు సముదాయము, నవలోకించి సమన్వయము గావించుకొనుటయు తప్పనిసరి యయ్యెను.

ఈ రెండవ అమ్మరాజ విజయాదిత్యుడు సింహాసనాధిష్ఠుడైన బాలుడయ్యును, దాయాశేషుడైన యుద్ధమల్లుని తదనుయాయులను సంహరించినవాడయ్యును, ఆ యుద్ధమల్లుని సంతతివారిచేతను, ప్రతిపక్ష రాజ్యాధినేతలచేతను, రాజద్రోహులు, అవకాశవాదులు మొదలగువారిచేతను భంగపడి ప్రవాసగతిని స్థలాంతరమున తలదాచుకొను నవస్థకు పాల్పడెనుగదా!

ఇన్నిన్ని విధముల శాసనాక్షరముల నేరికొనుట, గుర్తించుట, సమన్వయించుకొనుట, చారిత్రకాంశముల జత గూర్చుకొనుట, కానవచ్చిన ననామధేయ గ్రామములు పరిపడకుండుట మొదలగునవన్నియు జేరి భయ సంభ్రమాశ్చర్యముల ముప్పిరిగా గొనుచుండ నీ మహాసముద్రమును అల్పజ్ఞుడనగు నే నెట్లు తరింతు నను తపన తహ తహ లాడించెను. ఇంతలో భగవత్కృపచే నొక నూతనాంశము చేయూతయై తరింప తరణి యయ్యెను. క్రీ. శ. 955 సం. పట్టాభిషేకమందిన దాయాది విజేత (సంహరణ కర్త)యైన యీ రెండవ అమ్మరాజ విజయాదిత్యుడు దాయశేషముచే పరాభూతుడై ప్రవాసగతి తలదాచుకొనెగదా! అ సమయమందు విజయమందిన రెండవ యుద్ధమల్లుని కుమారులు బాదప, తాడపు లధిపతులైరి. అందు జ్యేష్ఠుడగు బాదపరాజు రాజమహేంద్రవరమున వేంగీదేశమునకు పట్టాభిషిక్తుడయ్యెను. కాని యాతనిని శత్రుశేష భయ మావహించెను. తనవలెనే ఆ అమ్మరాజును తన ప్రత్యర్థుల గూడకట్టుకొని యెపుడు తనపై దాడి వెడలి సంహరించునో యనుభీతి జనించెను. అందుకొక యుపాయమును పన్నెను. గోదావరి యుత్తర తీరమును దానుండుటచే దక్షిణ దిశను కాపేర్పఱచుకొనుట మంచిది కావున తన తమ్ముడైన రెండవ తాళపుని యువరాజునుచేసి గోదావరి దక్షిణ తీరమందలి వసిష్ఠా తీరమున పాగుణార విషయమందలి సిరియూరున రాజప్రతినిధిగా నిలిపెను. అట్లు రెండు సంవత్సరములు గడిచిన పిమ్మట బాదపరాజు మరణింప నీ రెండవ తాళపరాజు (మూడవ సంవత్సరమున) సిరియూరును వదలి రాజమహేంద్రవరమునకు బోయి పట్టాభిషిక్తుడై వేంగీ దేశాధిపతియయ్యెను. ఇంతలో పరాజితుడై ప్రవాసగతినున్న రెండవ అమ్మరాజు కొలుకొని ప్రతిపక్షుల గూడ కట్టుకొని అనేక వాహినీ సమేతుడై దాడి వెడలి, యుద్ధమున రెండవ తాళపుని సంహరించి తన రాజ్యము తా నాక్రమించుకొనెను. ఈ విషయమునుబట్టి వసిష్ఠా తీరమందలి పాగుణార విషయములో శాసనానుసారముగ దేవ, మోనంబట్లు, నొడలి, విప్పఱ్ఱు మధ్యస్థమందుగల సిరియూరు ఈ తణుకు తాలూకాలోనిదే యని ధృవపడినది. అపుడు శక్త్యుత్సాహ పూరితుడనై సీమా నిర్ణయము సేయ దొరకొంటిని.

సీమా పరిభాగమున దేవ (నరసాపురముతాలూకా) సుప్రసిద్ధమే! "నొడలి" అని యుండుటచే తొలుదొల్త వడలి, కడలి, పొదలి యను పదముల కొంతవరకు చర్చింప తుదకు "వడలి" నిశ్చయమైనది. ఇక మిగిలినది విప్పఱ్ఱు మోరంబట్టి గ్రామములు. తాడేపల్లిగూడెమువద్ద విప్పఱ్ఱు పడమటి విప్పఱ్ఱు; తణుకు తాలూకా దేవ, వడలి గ్రామములకు సంబంధములేదు. అయితే ఈ దేవ, వడలి గ్రామములకు సంబంధించి సిద్ధాంతము, పెనుగొండ ఆచంట మధ్య విప్పఱ్ఱు గానరాలేదు. అయితే సిద్ధాంతము (ఆచంట మధ్యను) దేవ మధ్యను ఇలపఱ్ఱు, ఆ తరువాత 'ములపఱ్ఱు' అను పురాతన గ్రామములు రెండును యుండుట నెరుగుదును. అందు దొరకిన శిలా విగ్రహములు 3, 4 సిద్ధాంత గ్రామమున 'కేదార ఘట్ట' మందొక అశ్వత్థ వృక్షరాజము నాశయించి

భ్రదపరుపబడియున్నవి. కావున ఆనాటి విప్పట్లు నేడు ఇలపట్లుగను, ఆ మోరంబత్తి నేడు ముంపట్లుగను దేశ కాలానుగుణ్యముగ మారియుండియుండవచ్చునను భ్రమ కలిగినది. అయితే ఆ రెండు గ్రామములకు మధ్యను గాని లేక ఆ రెండు గ్రామములకు సంబంధించిన మధ్య మూలగాని మఱియే గ్రామమైనకాక శిథిలమైన గ్రామ చిహ్నములు గాని యుండెనో లేదో దెలియజాలను. అయినను బ్రయత్నించి మిత్రులి కుత్తరములవ్రాసియు నిరుత్తరుడ నగుటచే నిరాశా పూరితుడనైతిని. అందువలన శాసనములోని సిరియూరు, దేవ, వడలి గ్రామములమధ్యస్థమయు,ఇలపట్లు ములపట్లు గ్రామ ములమధ్యస్థ మగునోకాదో నిర్ణయింపజాలని "రామన్న పాలెమును" సందేహాస్పదముగ నాధారముగ జేసికొని నిజ గ్రామమును పరిశీలింపనెంచియు గృతార్థుడనుకాలేక పోవుటచేతనే "ఏ రామన్నపాలెమో లేక కాలగర్భలీనమైన మఱియొకగ్రామమో అయియున్నది గాని వేఱొకటావున గాదు" అని అనిశ్చయముగవదలితిని. ఇన్నివిధముల స్థల నిర్ణయమునకు సక్రమముగా కృషి సల్పితినేగాని కేవలము ప్రొద్దుపుచ్చుటకై హేళాకోళగతిని తాత్కాలికముగ మదికి పొడమిన ఏదోయొకగ్రామమైన రామన్నపాలెమే శాసనోదాహృతమైన సిరియూరుగా నిర్ణయించి ప్రాచీన గ్రామముల నామముల స్వేచ్ఛానువృత్తిగ అన్యగ్రామ ముల కనుబంధించి సత్యమును మఱుగుపరచి అప సిద్ధాంతీకరణమునకుపాల్గొంటిననిమాత్రము భ్రమింప వలదని నా కోరిక. ఏ విషయము చర్చించినను గ్రంథా ధారములుగాని చారిత్రికాధారములుగాని కావలెను. లేనిచో యవి నిలువక మృగ తృష్ణా స్వరూపములని నిరూపింప బడి వెలువరింపబడుట సత్యము.

## వాదనా వైరుధ్యము

శాసనదానస్థల సీమా నిర్ణయ విభాగము నందు విప్పత్తి, మోరంబత్తి గ్రామముల గుర్తించి అనుసంధించుటలో వారు 68 పే. లో "పక్షాంతర వాదముచే "విప్పత్తి" గ్రామము నేటి తణుకు తాలూకాలోని "ఇలపట్లు" గ్రామముగా గుర్తించిరి. అట్లనే "మోరంబత్తి" గ్రామమును "ములపట్లు" గ్రామముగా గుర్తించిరి. ఈగుర్తించుటలో వారు పొరబడిరనియే చెప్పవలసి వచ్చినందులకు క్షంతవ్యు డను" అని చెప్పుచు తిరిగి 69 వ పే. లో విప్పత్తి గ్రామమును ఇలపట్లు గ్రామముగానో లేక ములపట్లు గానో అంగీకరించి మోరంబత్తి గ్రామమును అన్వేషించినచో నీ సమస్యా పరిష్కార మార్గమొనగూడు చున్నది" అని వ్రాసినారు. అనగా నాచే నిర్ణయింప బడిన విధానమునవే విప్పట్లు=ఇలపట్లు లేక ముల పట్లుగా నంగీకరించే యున్నారు. "ప్రాచీన శాసనము లలో నేటి మునపట్లుగ్రామము మోసంబట్లు ,మునం బట్లు,మోరంబట్లులుగాఆయాకాలములవాడుకలోనుండి చాళుక్యుల కాలములో మోరంబత్తిగా నిలచి యుండ వలెను. అందువల్ల మోరంబత్తి యన మునపట్లు గ్రామమని నిర్ణయించుటకు మనము వెనుకాడ వలసిన యవసరము లేదని తెలుచున్నది".అనియు యుదాహరించిరి. అనగా వీరుదాహరించిన "మోరం బత్తి" గ్రామమును నేను ప్రస్తుత మున్న "ముల పట్లు" గ్రామముగాను, వారు మొనంబత్తిలేక మునపట్లు గ్రామముగాను నిర్ణయించినారము. అయితే నేనిప్పటికిని "మునబట్లు" గ్రామము "ములపట్లు" గ్రామము యొక్కటే యని నమ్మియున్నాను కాని వారి ప్రకటన ననుసరించి ఆ "మొనపట్లు" "ములపట్లు" గ్రామములు వేర్వేరుగా (ఒకదాని కొకటి భిన్నమై) యున్నటుల, "తామరవాడకు" పడమటి సరిహద్దుగా నున్నట్లు గోచరించుచున్నది. కావున అట్టిది వేరొక గ్రామమున్న వారి మునపట్లు గ్రామము ఉనికి విషయములపై పరిశీలింపవలసి యున్నది. అట్లు కానిచో (లేనిచో) విప్పత్తి, మోనంబత్తి గ్రామములు నాచే నిర్ణయమైన ఇలపట్లు, ములపట్లుగానే నిర్ధారణ యగుచున్నది. కావున వారి వాదన 68 పే. 69 పే. విషయ నిర్ధారణ ఒకదాని కొకటి పరస్పర విరుద్ధములై స్వవచన విఘాతమొనర్చునవిగా యున్నవి. అంతతో సరిహద్దు గ్రామ వాదోపవాదోపములు సమసి పోగలవు.

ఇక మిగిలినది దానస్థలమైన "సిరియూరు" గ్రామనిర్ణయము మాత్రమే! ఈ సందర్భములో వారు శతావధానులు, గీర్వాణాంధ్ర భాషా పండితులు వడలి గ్రామ వాస్తవ్యులునైన శ్రీ మంచం బుచ్చి లింగప్ప శాస్త్రిగారి నుండి వారు సంపాదించిన (అసంపూర్ణ) తామ్రశాసన ఫలకముల నుండి 14 పంక్తులను ఉదాహరించి యున్నారు. సరియే. అయితే అందుకు తోడుగా వారు "త్రాం తముపై ప్రభుత్వము నెరపుచున్న నాటిప్రభువు"

అనివార్యమే యుదాహరించి యున్నారు గాని అది యే నాడో, హేరమో, విషయమో, వంశము, ప్రభువు, కాలమును తెలుపు శాసన భాగమును వెలువరింపక గోప్యము గావించిరి. అట్లు గావించుట సయుక్తము గాదేమో? ఏమన — "నేటికొక దశాబ్దము క్రిందటనే ప్రచురణార్థము నాకొసంగిరి...... గ్రామ ద్వయం ప్రాదిశ మగ్రహారం" అని 69, 70 పే. లో ప్రచురించిరి. ఆశాసనమును ప్రచురణార్థము తీసి కొనుటయు హస్తినాపుర మ్యూజియమునందు భద్ర పరుపబడియుండ ప్రభుత్వాధికారులనుండి ఆ ప్రతి బింబమును పొందియుండుటయు దశాబ్దములు గడచినను దాతలు గురువులు అయిన మహాత్ముల ఆశయమేమాత్రము పూర్తిగావింప బూనుకొన కుండుట, వెలువరింపకుండుట ఇంకను గుప్తముగా నుంచుటయేనా కర్తవ్యము? ఇది (ఈశాసనము) ఇపుడొకరి సొత్తు గాదుగదా! దేశమునకు సంబంధించిన విషయము. నేడు పరాయి ప్రభుత్వమును పారద్రోలి జాతీయ ప్రజాప్రభుత్వము నెలకొని బలముకొన్న రోజులు. అట్టి ప్రజా ప్రభుత్వమున ప్రజలకు దేశమునకు సంబంధించిన చారిత్రక ప్రమాణ పత్రములకగ్రశేణిని నిల్చిన ప్రాచీన శాసనముల దశాబ్దముల తరబడి వెలువరింపక గుప్తపరచుటయన యదార్థమైన దేశ చారిత్రక పరిశోధకులకు తీరని యవరోధముల కల్పించిన దోషమునకు పాల్పడవలసి వచ్చునేమో?.......పోనిండు, ఇప్పటికైనను ఆకొరతను తీర్చుటకై వారు ఆ తామ్ర శాసనమును ప్రతిబింబములతో సహా వెలువరించి చరిత్ర పరిశోధకులకు ఒక నూతన సోపానము లభింప జేతురుగాక యని నాకోరిక. అందుకు అవాంతరము లున్నచో తమకు అజ్ఞాతమిత్రుడను శ్రీ మంచం బుచ్చిలింగప్ప శాస్త్రిగారి శిష్య సమానుడను నగు నాయందు సోదర భావముంచి ఆ భారము నాపై మోపిన నాయోపినంతవరకు నెరవేర్చి గురుపాదసేవా భాగ్యమున పాల్గొన్న భాగ్యవంతుడ కాగలను.

ప్ర స్తు తాం శ ము

ఆ శాసనమందు "ఒడలి గ్రామమును అన్యగ్రామ మండలి తొంబది భాగములలో దైవతాంశములైన అయిదు భాగములుగాక మిగిలిన భాగములను "చెలువూరు" అను పేరితోను వారికే యిచ్చెను" అని యున్నది. అనగా అంతవరకును 'ఒడలి' గ్రామమునకు వేరుగానున్న అన్యగ్రామభాగమును ఒడలితో జేర్చి ఒకే (విధమైన) చతుర్దిగంత్రప్రవిభక్త సీమావిభాగముగా నేర్పరచుట మూలమున అంతవరకు ఒడలికిని అన్య గ్రామముగానుండి "చెలువూరు" అనుపేరితో ఒడలిన చేరిన గ్రామమునకును అంతకు ముందున్న (సరిహద్దు పుంతలు) సీమా విభాగము రూపుమాసినదన్న విషయము గమనార్హము. అందుచేతనే వా రుదాహరించి నటుల ఒడలికిని, రామన్నపాలెమునకు మధ్య సరిహద్దు పుంత లేకుండుటయు, రామన్నపాలెము ఒడలి గ్రామమునకు శివారు గ్రామముగుటయు గమనింప వారుదహరించిన ఆ చెలువూరు గ్రామమే దేశకాల పాత్రానుసరణముగ నేడు రామన్నపాలెముగా మారి యుండెనేమో యను సందేహమున కాకరమగు చున్నది. అయితే ఆ గ్రామపు పూర్వపు పేరు ఆ శాసనమం దుదహరింపబడక బోవుట వల్లను, సరి హద్దు గ్రామముల దెలుపు భాగమందుండక బోవుట వల్లను ఆ చెలువూరు అనబడు గ్రామము అంతకు ముందు సిరియూరో వేఱొక యూరో నిర్ణయింప నను వు కాదు.

తామరాడ విషయము

వారుదాహరించినటుల సిరి, చెలువు, తామర అను మూడు సమానార్థములుగా గోచరించుటలేదు. సిరి, తామర శబ్దములు రెండును శ్రీ, తామరస శబ్దతద్భవములైనను మొదటిదానికి లక్ష్మిఅనియు, రెండవదానికి (తామర) పద్మమనియు అర్థములు కావున లక్ష్మి (తామర) పద్మనివాసిని యను మాట యధార్థమైనను కేవలము తామరయన లక్ష్మి కానేరదు. అట్లు పూర్వ కవి ప్రయోగములును కానరావు. ఇక 'చెలువు' అనగా శోభ, కాంతి, సౌందర్యము, అందము అను అర్థము నిచ్చునేగాని "లక్ష్మి" అను అర్థముకానరాదు. అట్టి ప్రయోగములును కానరావు. కావున సిరి, చెలువు, తామర శబ్ద పరస్పర ఏకైక భావము కానరానందున ఆ శబ్దముల అర్థ సమన్వయ మసంబద్ధముగా నున్నట్లే ఆ శబ్దములచే సాధింపబడిన గ్రామ సమైక్యమును అసంబద్ధమై గానవచ్చు చున్నది.

వా రుదాహరించిన ఆ (అసంపూర్ణ) తామ్ర శాసనభాగము 14 వ శతాబ్దమునాటిదని యుదాహరించియున్నారుకదా! ఆ శాసనాధారముననే కదా వారా చెలువూరే నేటి "తామరాడ" అని నిర్ధారణగావించి యున్నారు. అయితే ఆ శతాబ్దముననే కోర్కొండ, పావునార, కోన, కురవాట, చెంగరవిషయాధిపతియైన ముమ్మిడి నాయకుని (శ్రీరంగశాసనమందు) కోటాలపట్టు శాసనమునకు సరిహద్దులుగా మోనంబట్టు, దేవ, వంగిపూడి, చెఱకువాడ, విల్లూరు, తామరవాటిక, పెనుకొండ, మాఱుటేఱు గ్రామములు పేర్కొనబడినవి. అనగా వా రేకాలమున "గ్రామద్వయ అగ్రహార" తామ్రశాసనముగా నుదాహరించి యున్నారో అదే కాలమునందు వారి వాదనా విషయమగు "సిరియూరు" "చెలువూరు", "తామరాడ" సమైక్య ప్రదేశమగు గ్రామమునకు భిన్నముగా చెలువూరు గ్రామమునకు చేరక వేరుగా తామరాడ గ్రామము "తామరవాటిక" అను పేరుతో సుప్రసిద్ధమై శాసనబద్ధమై ప్రత్యక్ష పీఠ మలంకరించినది. దానిని కాదనవెట్లు శక్యమగును? కావున దీని సారాంశము రెండవ అమ్మరాజ విజయాదిత్యుని తామ్రశాసనమందలి "సిరియూరు" అను గ్రామమును, గ్రామ ద్వయాగ్రహార శాసనమందలి "చెలువూరు"అను గ్రామమును 'కోటాలపట్టు' శాసనమందలి "తానురవాటిక" అగ్రహారమును పరిశీలింప ఆ మూడు గ్రామములును ఏ నాటికిని వేర్వేరు గ్రామములుగానే యున్నవికాని ఎన్నివిధముల యోచించినను ఆ మూడు పేర్లును ఒకే గ్రామమైన తామరాడకే చెల్లుబడినయైనట్లు ఎంతమాత్రము సావకావకాశము గాన్పించుటలేదు. అట్టి భ్రమకు బోవుట మృగ తృష్ణయే కాగలదు.

దీని పర్యవసానము శాసనోక్త "సిరియూరు" ప్రస్తుతమున్న రామన్నపాలెముగాని, తామరాడ గాని గానేరక వేఱుగా నుండి కాలగర్భమున లీనమైపోయినదని ధృవపడుచున్నది. ఇక నావాదను ముగించుటయే మంచిది.

71 పే. లో "వసిష్ఠ గోదావరీ తీరప్రాంతమందున్న యొకయూరు అగ్రహారముగా నీయబడిన శాసనము, ఆ గ్రామమును దాటి నదుల నుత్తరించుకొని క్రోసుల దూరము ప్రయాణించి యెక్కడనో యొకచోట లభ్యమైనదన్న ఆ దానములు పొందిన వారి సంతతియో, బంధువులో సన్నిహితులైన వారెవరో యొకరివలన స్థానచలనము నొందియుండ వలెననుట నిర్వివాదాంశము" అని వ్రాసియున్నారు. దానికంత వింతలేదు. విష్ణుకుండిన మాధవవర్మ యొక్క తూర్పుగోదావరి జిల్లాలోని వగు పొలమూరు (పులింబూరు), వెలంపాలెం (వెలుంబలి) తామ్రశాసనములు ఎచ్చటనో యున్న ఈపూరు గ్రామమున దొరకుట చేతనే గదా వాటిని ఈపూరు ప్లేటులని పిలుచు చున్నారు. ఇట్లెన్నియో గాన్పించును. కావున శిలా శాసనములు స్థానభ్రష్టత్వమంది స్థలాంతరమేగిన అబ్బురమగును గాని తామ్రశాసనములు స్థలాంతరముల గానవచ్చుటొక వింతగాదు. ఇది సర్వసామాన్య విషయమే. అంతేగాదు. రాజ్యమేలిన రాజులు తమ తమ ప్రదేశముల స్థిరనివాసులైరి కాని "విద్వాన్ సర్వత్ర పూజ్యతే" అను అర్యోక్తి ననుసరించి విద్వాంసులు తమ ప్రజ్ఞాపుణ్యములచే సర్వత్ర బూజింపబడి స్థలాంతర వాసులగుట విశేషాంశమై బొడగట్టుచుండును. ఈ దాన ప్రతిగృహీత తండ్రి శ్రీ చక్రపాణియు, గృహీత దారియభట్టు కూడ అఖండ విద్యావైదుషీ ప్రభావము గలవారైనటులే శాసనమందే 27—40 పంక్తుల వరకును గోచరించుచున్నది. అట్టి శ్రేష్ఠమైన కర్మాచార పరాయణులుగను, సర్వశాస్త్ర నిష్ణాతులై ధర్మకార్య నిరూపణ కర్తలుగను, రాచకీయ ధురంధరులుగను ప్రసిద్ధి నందిన వీరి సంతతియు నట్లే వృద్ధినొంది యుండనోపును. ఆ కాలమున సంఘమునందు తావులేని కాపాలిక శైవులు నదీ సముద్ర తీరస్థులై యుండిరి. ఇందుకా కడలి ప్రాంతము భైరవుని కోనయై యున్నది. కోన దేశాధీశులైన హైహయాది వంశములవారు శైవదీక్షా పరాయణులుగా దోచెడి. నాటి షణ్మత పీఠములకు వెలియైన ఆ కాపాలిక మతమును ఖండించుటకై యీ దానప్రతిగ్రహ పండితవంశ మాయా రాజాహ్వానములపై వెడలి యచ్చట స్థలనివాస మేర్పఱిచికొని యుండవచ్చును. అట్టితఱి వారి స్వంత సొత్తగు నీ శాసనము వారితోనేగి యుండి ఆ వంశము వా రే పత్తిస్థితికి లోనైనను నిది మాత్రము భూగర్భమున సురక్షిత స్థానమేర్పరచుకొని యుండి నేటికి పండితద్వయ వంశప్రకాండులచే వెల్వడి చరిత్ర

పరిశోధక వర్గమునకొక జ్ఞానప్రదీప యయ్యెనని పేర్కొనదగియున్నది.

ఈ శాసనము వెలువరించుటకు మూల కారకులైన చెరుకుమిల్లి వారు, ప్రస్తుతము తామ రాడ అగ్రహారమై యుండుట, అందలి అగ్రహారీకులు చెరుకుమిల్లి వారై యుండుటయు, వారిప్పటికిని వేదవేదాంగవేత్తలై మొగలితుర్రు సంస్థానాధిపతుల బహూకరణస్వీకర్తలై యుండుటచేతను, ఆ చెరుకు మిల్లివారే ఈయూరు దాన ప్రతిగ్రహీతలై యుండి తామరాడను (సిరియూరు) వదలి కాలక్రమేణ అన్యగ్రామవాసులై పోయిరనియు, వారి విద్యతో బాటు యీనాములు గూడ పరాశ్రయాసక్తములై చేరె ననియు తద్గ్రామవాసులు చెప్పుచుండగ విన తటస్థించినదని వారు వ్రాసియున్నారు. అయితే యిందొక విషయము గమనింపవలసి యున్నది. ఈ శాసనమందే దానప్రతిగృహీతల వంశవర్ణన ములో 27-40 పంక్తుల మధ్యస్థమైన 31 వ పంక్తి యందు ఈ దాన ప్రతిగృహీత వంశమువారు (రిగ్వేదీ) ఋగ్వేదులని యుదాహరింపబడియున్నది. అయితే అగ్రహారీకులైన చెరకుమిల్లి వారుగాని, దానశాసన ప్రదాతలై కాశీభట్టువారుగాని ఋగ్వేదులు గాక యజుర్వేదులై యున్నారు. కావున ఈ యుభయ పండితవంశములలో నే యొకరును ఈ "సిరియూరు" దాన ప్రతిగృహీతలు కారని నిర్ధారణ యగుచున్నది. అయితే యీ దానప్రతిగృహీత వంశము వారికిని యీ పండితద్వయ వంశములకును సన్నిహిత బాంధవ్య మేకాలమందైన యుండిన యుండవచ్చును. వారి మూలమున యీ దానప్రతిగృహీత వంశము వా రచ్చ టకుబోయి యచ్చట స్థిరనివాస మేర్పరచుకొని యున్నను యుండవచ్చును. అందు కాక్షేపణ యెంత మాత్రము ఉండజాలదు.

— మునునూరి సాంబశివరామమూర్తి.

## దేశటి వంశము--
## కొండవీటి రాజ్యం

పదునాలుగవ శతాబ్ది ప్రారంభమున, అనగా క్రీ. శ. 1323 సంవత్సరమున ఓరుగల్లు రాజ్యంగా విలసిల్లిన తెలుగుసీమకాకతీయులపై ఢిల్లీ సుల్తానులు అగు తురుష్కులు చేసిన దండయాత్రలతో విచ్ఛిన్నము గాబడిన హేతువు వల్ల అద్దంకి రాజధానిగా పంటశాఖీయులు ప్రముఖ సైన్య నాయకులుగా ఆంధ్రావనిలో పేర్గాంచియున్న రెడ్డినాయకు లేకమై దేసటిప్రోలయవేమారెడ్డి నాయకుడుగా కోస్తా ఆంధ్రమును సమైక్య పరచి నెల్లూరు మొదలు సింహాచలముదాటిన గంజాంజిల్లా సరిహద్దుగా స్వతంత్ర రెడ్డి రజ్యము స్థాపించిరి. ఈ రెడ్డినాయకులు ఒక్కసారిగా ఓరుగల్లు విచ్ఛిన్నతతో పాలకులు అయినవారు కాదు. వీరు రాష్ట్రకూట సంతతికి జెందినవారు. వీరి పూర్వులు వేంగి చాళుక్యులను జయించి ఆంధ్రావనిలో రాజ్యపాలన చేసింది కూడా వరువరాని సందర్భముగా నుగ్గడించెదను.

ఎందుచేతనో డాక్టరు హల్ట్సుదొర వంటి చరిత్ర కారులు యీ దేసటివంశ పంటశాఖీయులను వీరికిగల 'పల్లవాదిత్య, పల్లవ త్రినేత్ర' మొదలగు బిరుదులుగాంచి పల్లవులుగా భ్రమపడిరి. అందువల్ల వీరిని పల్లవులుకాదని 'పంటశాఖరెడ్లు పాలక తెగ లోనివారని చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు ఆంధ్రుల చరిత్ర మూడవభాగమున వివరించిరి. ఈ చరిత్రకు ఆ సాక్ష్యము అపూర్వమై యున్నది.

మరియొక సందర్భమున డాక్టరు హల్ట్సు దొరవారి అభిప్రాయం (Annual Report on Epigraphy 19.6 Para 577)చూస్తే; చోడులుఅగు క్షత్రియ శాఖగాకూడా భ్రమపడిరి. ఈ సందర్భమున రెడ్డి శాఖీయులతో చోడులకు ఆకాలంలో జరిగిన సంబంధ బంధుత్వములను గురించి డాక్టరు హల్ట్సుదొరగారు చోడులుగా భావించుట చారిత్రకులు ఎవ్వరైనా సమర్థించినను అందుకుఆక్షేపణ చేయదలచలేదు. కాని పంట శాఖీయులుఅగు దేసటి వంశము వారు పల్లవులు మాత్రం కాదు అని ఖండితముగా తెలుపుచున్నాను. పల్లవులలో చేర్చుటకు వీలుకాదంటే చోడులగు క్షత్రియులతో చేర్చుట సమర్థనీయమెట్లు? అన్నచో యీ క్రింద వివరించిన శాసనములు ఒక రుజువుగా వివరించెదను.

కోరుమిల్లి శాసనమున :

శచీవశ్రస్య శివేవ శంభోః
పద్మేవ సా పద్మవిలోచనస్య

వేమాంబికా చోళకులేందు భీమ
భూపాత్మజా భూ న్మహిళా స్వజాయా॥

వేమాంబిక అనే ఆమె చోళకులాన్వయుడు భీమభూపాలుని కుమార్తెగా నిర్ధారణము చేసిరి.

మరియు రాజమండ్రి రాజ్యాధినేతయు దేసటి వంశీయుడును, పంటకులాబ్ధి చంద్రుడునుఅగు,అల్లాడ దొడ్డారెడ్డికి అంకితము గావించిన శివలీలా విలాస గ్రంథమున కవిఅగు నిశ్శంకుని కొమ్మనామాత్యుడు వ్రాసిన పద్యమును వివరించుచున్నాను:

మ. భరితశ్రీనిధి యమ్మహీరమణుఁ డొప్పన్
జోళ భక్తిక్షితీశ్వర సూనుండగు
భీమలింగమనుజేశ్రేష్ఠు సత్పుత్రి
భాస్వర కారుణ్యదశాజనావన విధానంధాత్రి
వేమాంబికన్ వరియించెన్
బలిభక్తి గౌరవ దృఢవ్యాపార నిత్యాంబికన్.

ఇదే సమర్థనీయముగా కాశీఖండమున వేమాంబిక అనవేమనృపాలుని మనుమరాలని ధ్రువీకరించుట జరిగినది.

మ. అనవేమ క్షితిపాలు పౌత్రియగు
వేమాంబా మహాదేవికిన్,
ఘనుడయ్యల్లాడ భూమిపాలునకు
సంగ్రామ స్థలీ గాండివుల్
తనయు ల్వేమవిభుండు వీర
వసుధాధ్యక్షుండు దొడ్డప్రభుండును
నన్నయ్యయు
బాహు విక్రమ కళాటోప్రతాపోద్ధతుల్.

(పౌత్రి అంటే, దౌహిత్రిగా గ్రహించేది)

ఈ దేసటి వంశ పంటశాఖాన్వయులు—చోడులతోనేగాక, హంపి విజయనగర రాయల వంశీయులతోకూడా వివాహబాంధవ్యములు కల్గినట్లుగా Elliot అనే దొర ప్రోగుచేసి సమకూర్చిన Annual Report of Epigraphy 1906 Page 63 వివరణ వృత్తాంతమున ఏమున్నదనగా—

రెండవ హరిహరరాయలవారి కుమార్తెను కాటయవేముని పుత్రునికి 'కాటప్రభు'వు అన్నవారికి వివాహం చేసిరని వున్నది. ప్రబంధములు—శాసనముల రుజువుండ్వారా దేసటిపంటశాఖీయరెడ్డి జాతికి చోడ—రాయల వంశాల క్షత్రియులతో వివాహము పొత్తు జరిగినదని యింకా పెదకోమటి వేముని భార్య ధరణికోట ప్రభువు గన్నక్షితీశ్వరుని కుమార్తెగా ఆమె రచించిన సంతాన సాగరము గురించిన సందర్భమున వివరించి యున్నారు. (ధరణికోట నేలిన గన్నక్షితీశ్వరుడు రాచబిడ్డ.)

ఈ బంధుత్వములు ఒకవేళ రాజకీయములుగా కొందరు చరిత్రకారులు తలంచిననూ, రెడ్డి నాయకులు పల్లవులు మాత్రము కారని భారతీయ పాలక తెగలలోని ఒకవర్గముగా తలంచుచూ, వీరి ప్రాచీనరాజ్యమైన కొండవీడు రాజ్యము అతివైభవముగా విలసిల్లి వర్ధిల్లినట్లుగా తెలియుచున్నది. ఈ దేసటి పంట శాఖీయ రెడ్డి కులోద్భవుల చరిత్ర యీ 'రెడ్డిజాతి'వి క్షత్రియులుగా కొన్నిచోట్ల చెప్పిననూ, వివాహములు క్షత్రియులతో జరిగిననూ, యజ్ఞోపవీతము త్యజించి రనుసది యదార్థము. అంత మాత్రమున రాజ్యపాలనలోని నైతిక విశిష్టత కుంటుపడలేదు, అని రుజువు నాటికి నేటికి కూడా నిల్చి వున్నది.

—కొవ్వూరి వెంకటరెడ్డి.

## వచన కవిత్వంలో పడగుంభనం

1940 నుండి ప్రారంభమౌతూ వచ్చిన వచన కవిత్వం కొందరు సిద్ధహస్తుల వలన నేటికి ఒక నిర్దుష్టమైన స్థానానికి చేరుకున్నదని చెప్పవచ్చు. సాంప్రదాయ వాదుల ముక్కువిరుపులను సహిస్తూ, స్వేచ్ఛావాదుల స్వాగతాలకు హసిస్తూ లాగైతేనేం వేళ్లు పాతుకొని పోవడానికి ప్రయత్నం చేస్తున్నది. దీన్ని వచన గేయం, వచన పద్యం, వచన గంధి, ముక్తచ్ఛందం, మరియు స్వేచ్ఛాగీతమని అంటున్నారు. విజ్ఞులు తమ కిష్టమైన పేరుతో పిలుచు కొందురు గాక!అసమర్థుల చేతుల్లో కవిత్వం అధోగతిపాలవుతుంది, ఇదివరకు శక్తిమంతుల వలన విలువను సంతరించుకొన్న ప్రక్రియ తరువాతి వారి అశక్యత వలన మునుపున్న గౌరవాన్ని కోల్పోవడానికి అవకాశమున్నది. వచన కవిత్వం విషయంలో ఇప్పడిలాగే జరుగుతున్నది.

"ఛందాంసి ఛాదనాత్" అని యాస్కుడు నిరుక్తంలో చెప్పియున్నాడు.మాకీ ఛందస్సుల తొడుగు అవసరం లేదు, మాది దిగంబర కవిత్వ మన్నారు. బాగానే వుంది. అలంకారంలేక కవిత్వమే లేదని లాక్షిణికులంటే, అలంకారాలు మా కవిత్వాని కక్కర లేదు నిరలంకారమైన నిసర్గ మనోహర కవిత్వం మాది అన్నారు. సరే, మొత్తము మీద ప్రాచీనుల పదాడంబరం, కృత్రిమత్వం నచ్చనిభావమే వచన కవితావిర్భావానికి కారణమని చెప్పియున్నారు. మంచిదే. వచన కవిత్వం చేపట్టడంలోగల ప్రయోజనాలు కూడ చెప్పారు. కవిత్వాన్ని వ్యావహారిక భాష కత్యంత సన్నిహితం చేయడం, పఠిత హృదయంలో భావాన్ని సూటిగా చొప్పించడం (పద్యాల్లాగ పదాల్తో గజిబిజిచేసి కొద్ది భావాన్ని పెద్ద మాటల్లో చెప్పడం కాదన్న మాట) అంతా బాగానే వుంది. వచన కవిత్వ రచనలు అనుకున్న దానికంటె ఎక్కువ మందే వ్రాస్తున్నారు. కాని కొందరు కొన్ని పొరపాట్లు చేస్తున్నారు.

కవిత్వాన్ని వ్యావహారికానికి దగ్గరగా తెస్తున్నా మన్నారు. నిజానికి దీని ఆచరణ చాల తక్కువ. సామాన్య పాఠక జనం సంగతి దేవుడెరుగు. పండితులనే తికమక పెడుతున్నాయి కొన్ని రచనలు. నన్నయాది కవులు వచన కవిత్వం వ్రాసి ఉంటే ఎలా ఉండేదో అలాగే వెలువడుతున్నవి కొన్ని వచన కవిత్వ రచనలు. పాండిత్యాన్ని ప్రదర్శించుకోవాలంటే పద్యాలుండనే ఉన్నవి. వాటిలోనే తమ అసమాన పాండితీ ప్రతిభతో విశృంఖల విహారము చేయవచ్చును. ముముక్షు జనరంజకములైన రచనలను చేసి ప్రశంసాపాత్రులు కావచ్చును. కాని కేవలం పద్యాలలో వ్రాయడమే ప్రాచీనతగా భావించి, ఎటువంటి భావమైనా, భాషైనా సరే పద్యాల్లో ఉండకుంటే చాలు నవ్యత్వం వస్తుందనుకొని స్వప్నావస్థలో రచనలు చేయడం మెచ్చుకోదగిన విషయంకాదు, కేవలం పదాడంబరం కవిత యొక్క సౌందర్యం అధికం చేయకపోగా అధమం చేస్తుంది. కావ్యాత్మ ప్రకాశించేది పదాలతోనే, అందుకే అర్థానుగుణమైన భాష కావాలి. అలతి పదాల్తో గుండెల్లో దూసుకుపోవాలి. ఛందస్సుల తొడుగుల్ని విసర్జించినట్లే గంభీర పదప్రయోగాన్ని కూడ త్యజించాలని నా అభిమతం. ఒక్కొక్కరు ఒక్కొక్క ప్రక్రియలో ప్రతిభను కలిగి ఉంటారు. ఆ ప్రతిభ నవ్యమైన రతిలో వెలుగును చూస్తే గౌరవింపబడుతుంది. కొందరు కలం కదిపితే చాలు పుంఖాను పుంఖంగా దొర్లుతుంటాయి పెద్ద పెద్ద శబ్దాలు. అటువంటివారు తమ భాష కనువైన ప్రక్రియ నెన్నుకోవాలనేదే నేను చెప్పదలచుకున్నది. ముఖ్యంగా వచన కవితల్లో పదాడంబర మధికమైతే అతుకుల బొంతలా తయారై జుగుప్సను కలిగించక మానదు. పద్యాల వాసనలనే ఒత్తుగా పులుముకొని ఛందస్సొకటి లేనంతమాత్రాన అది వచన కవిత్వం కానేరదు. నేటి కొన్ని వచన కవితల్లోని కొన్ని పంక్తులు గమనింతురు గాక.

"పరిమ్లాన పుష్పంలా, మృత పరిపాండుర ముఖంలా, మసృణ చాంద్రవాహిని."

"శీతల చందన పరిమళ సమ్మిశ్రిత వాయు పరీహాసశీలు"

మధుర మధుర గీత వినదిత జలధారా సిక్త స్నిగ్ధ మేఘాలు"

సితాసిత పతితాస్తోక స్తబకాలు.

"తుహిన గిర్యాశ్రమోపాంత మణికందరాస్థిత నవప్రవాసినీ—కలకంఠ ముఖరిత గీతరాగ వ్యర్థత్వం"

'ఖేచర మదయోషా విధుర వివశ నాట్యవేళ"

ఇలా ఎన్నో ఉదహరించ వచ్చును. ఇకనైనా వచన కవితా కర్తలు ఈ విషయాన్ని దృష్టిలో నుంచు కొందురు గాక.

—ఎన్. గోపి.

## లేఖలు :

# ఈనాటి సాహిత్యంలో స్థితిగతులు

ఆర్యా,

జూన్ నెల భారతిలో "ఈనాటి సాహిత్యంలో స్థితిగతులు" అన్న తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారి వ్యాసం చదివిన మీదట, దానిలో కొన్నిభావాలు అసమంజసంగా, పక్షపాతయుతంగా కన్పించినవి.

వ్యాసకర్త ముఖ్యంగా అభ్యుదయ కవిత్వం మీద, తన ఉద్దేశాన్ని బహిర్గతం చేశారు ప్రారంభంలో. "పాశ్చాత్యదేశాల్లో ప్రచారంలో ఉన్న అభ్యుదయ సిద్ధాంతాలు శ్రీ శ్రీ గారి కవిత్వంలో ప్రతిబింబించడంలేదు" అన్నారు. అంటే విమర్శకులకి ఏది అభ్యుదయంగా కనబడుతుందో, అదే భావం కవికి గూడా ఉండాలని వీరి అభిప్రాయం కావచ్చు. సాహిత్యంలో సాధారణంగా జరుగుతున్న చరిత్ర ఏమిటంటే విమర్శకులు వారి ప్రమాణాలతో కవిని కొలవడం. దానివల్ల విమర్శనారంగంలో ఇన్ని అనర్థాలు ఏర్పడుతున్నాయి. వ్యాసకర్త చెప్పినట్లుగనె చూస్తే ప్లేటో నిర్మించిన Republic "శాస్త్రీయాభ్యుదయా"నికి ఉదాహరణగా కనబడుతోంది. పోతే శాస్త్రీయాభ్యుదయ మంటే ఏమిటో వ్యాసకర్త ఎక్కడా చెప్పినట్లు కనబడలేదు. అసలీ "అభ్యుదయం" అనే మాటకి చాలామంది చాల రకాలుగా అర్థాలు తీస్తున్నారు కాబట్టి అభ్యుదయానికర్థం వివాదగ్రస్తంగానే మిగిలిపోయింది. ప్లేటో నిర్మించిన Republic వ్యాసకర్తకి ఆదరణీయమైన అభ్యుదయభావం కావచ్చు. Marx నిర్మించిన వర్గరహిత సమాజం, సమతావాదం శ్రీ శ్రీకి అభ్యుదయంగా కనబడవచ్చు. మార్గం ఏదైనా కవులందరూ కోరేది విశ్వశ్రేయస్సేగదా! చీకటియుగాల్లో, "బలవంతులు దుర్బల జాతిని బానిసలను కావించారు నరహంతలు ధరాధిపతులై చరిత్రమున ప్రసిద్ధి" కెక్కారు. కాలం గడుస్తున్న కొద్దీ మానవుడు చీకటి నుంచి వెలుగులోకి రావడానికి ప్రయత్నిస్తున్నాడు. వ్యక్తి, వ్యక్తిచుట్టూ ఉన్న సాంఘిక వ్యవస్థ, దానికున్న చరిత్రా ఈనాటి మానవుడు సమగ్రంగా అర్థం చేసుకోగలుగుతున్నాడు. రాచరికపు వ్యవస్థలోనించి ప్రజాస్వామికంలోకి అడుగుపెట్టిన మనిషి వ్యక్తిస్వాతంత్ర్యం అంటే ఏమిటో అర్థం చేసుకోగలుగుతున్నాడు. అందుకే "ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తి ఒక జాతిని వేరొక జాతి పీడించే సాంఘిక ధర్మం, ఇంకా ఇకపై సాగదు" అంటున్నాడు ఈనాటి "అభ్యుదయ కవి." విశ్వమానవ జాతినంతటినీ సంబోధిస్తూ 'అవిభక్త కుటుంబీ! ఏక రక్తబంధూ! మానవుడా!" అని విశ్వమానవత్వానికే నివాళులెత్తాడు ఈనాటి అభ్యుదయ కవి. ఇదంతా "అభ్యుదయ కవితా వర్గానికి నాయకుడని చెప్పవచ్చు" అని వ్యాసకర్త అనుకున్న శ్రీ శ్రీ సంగతి.

"శ్రీ శ్రీ అనుయాయులమంటూ అభ్యుదయ రచయితల మంటూ రచనలు చేసేవారి రచనల్లో కూడా, యావత్ ప్రపంచంలోనూ అభ్యుదయ సిద్ధాంతాలుగా అంగీకరించబడిన లక్ష్యాలు కన్పించడంలేదు. ఈ రచనలు పట్టి శాబ్దిక అయోమయంగా ఉన్నవి. మన సాహిత్యంలో "అభ్యుదయ కవిత్వం" నిజమైన స్వరూపం వహించనేలేదని, చెప్పారి" అంటున్నారు వ్యాసకర్త. ఇది కేవలం ఆధార రహితమైన నిందారోపణ. వీళ్ళతో శాబ్దిక అయోమయాలున్నాయి అని ఆరోపించేటప్పుడు అవి ఎలాంటివో కూడా వ్యాసకర్త సోదాహరణంగా నిరూపించవలసింది కాని అట్లా చెయ్యలేదు. కేవలం నింద మోపి ఊరుకున్నారు. ఒకవేళ ఉదాహరణగా ఏ ఒకటో రెండో ఎవరివో చూపించినప్పటికీ తక్కిన కవిత్వం అంతా ఇంతే అనుకోవడం హాస్యాస్పదం కాదా? ఛందోబద్ధ కవిత్వం అంతా కవిత్వమేనా? దాంట్లోమాత్రం ఎన్ని అపకావ్యాలులేవు గనుక. అయితే వీళ్ళంతా వ్యాకరణ సిద్ధాంతాల్నీ, ఛందో నియమాల్నీ గ్రాంథిక భాషనీ

ఉపయోగించుకున్నారు కాబట్టి లోపం లేదనుకుంటే, అది పాక్షికతమె కాగలదు. సాహిత్యం మహాసముద్ర మైతే అందులో రాళ్ళూ, రత్నాలూ రెండు ఉంటాయి. అవి యిదివరకూ ఉన్నాయి. ఇప్పుడు ఉన్నాయి, ఎప్పుడూ ఉంటాయి. ఏది పరిగ్రహించాలో ఏది విసర్జించాలో బుద్ధిజీవులు నిర్ణయించుకోవాలి. ఈ నాటి కవిత్వంలో అభ్యుదయంలేదు అని ఒక మాటంటే సరిపోయిందా?

"నేను చూశాను నిజంగా
మూర్తీభవత్ దైన్యాన్ని, హైన్యాన్ని,
క్షుభితాశ్రు కల్లోల నీరధుల్ని
గచ్ఛచ్ఛవాకార వికారుల్ని
ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి?
ఏ విజ్ఞాన ప్రకర్షకు ప్రకృతి?
ఏ బుద్ధదేవుని జన్మభూమికి గర్వస్మృతి?"

అని ధిక్కరించి అడిగే ఈనాటి అభ్యుదయ కవికి ఈ విమర్శకుని సమాధానం ఏమిటి? ఇలాగే, ఆరుద్ర, దాశరథి, కుందుర్తి, మొదలయిన కవులు శాబ్దికమైన అధికారాన్ని, అనేకమంది సాంప్రదాయిక కవులకన్నా ఎక్కువగా కలిగినవారే! ఈ తరం కవుల్లో గూడా ఇట్టి భావజ్వాల ఉదాత్తంగా వ్యక్తపరచిన వాళ్ళు లేకపోలేదు. ఉదాహరణకి 1964 సెప్టెంబరు భారతిలో "వ్యర్థగీతం" అన్న రచనలోని

"ఈ ప్రపంచకం ఇంతే!
కంటికి అంది నోటికందని భోజనం!
కత్తిరించిన చిత్రం
కొన్ని అంగాలే మిగిలిన శిల్పం
మొండిగోడల అసంపూర్ణ గృహం!"

అన్న పంక్తులు, సమాజ వ్యవస్థాగతమైన అసంపూర్ణతను గూర్చిన ఆవేదనతో, భవిష్యదభ్యుదయాన్ని గూర్చి ఆక్రోశించే కవి హృదయాన్ని కళ్ళముందు పెట్టడం లేదా? ఇట్టి అనేకానేకమైన పంక్తుల్ని చూచి ఆనందించక అక్కడక్కడ కనబడే అల్ప కవిత్వానికై, బాధపడే తత్వాన్ని విమర్శకులు విసర్జించాలి.

ఇది "వ్యుత్పత్తి శూన్యమైన దురదృష్టకాలం" అని మరొక ఆరోపణ. నిజంగా ఈకాలంలో కవిత్వస్థాయి పడిపోయిందా? ఉదాత్త కవిత్వం అసలు రావడంలేదా? లేదా వస్తున్న కవిత్వం పేరుకున్న పంథాలో లేకపోవడంచేత నిర్జీవమైపోయిందా? ఏబది సంవత్సరాల కాలంలో తెలుగు సాహిత్య ప్రపంచంలో ఎంత వెలుగు ప్రసరించిందో ఎన్ని కొత్త మార్గాలు నిర్మింపబడ్డాయో, ఎన్ని విలక్షణమైన సిద్ధాంతాలు సాహిత్య వ్యవస్థతో ప్రతిపాదింపబడ్డాయో, ఈ నవ్యసాహిత్యాన్ని విమర్శించే వాళ్ళు విశాలదృష్టితో చూడ్డం మంచిది. శ్రీ శ్రీ అన్నట్లుగా "ఆధునిక కవిత్వం నియమరహితమైనదనే శుష్కవాదన సహృదయులైన విమర్శకులదికాదు. ఎన్నో విశేష పరిస్థితుల కూడిక వల్ల రూపం పొందుతున్న ఒక రకపు కవిత్వాన్ని, స్ఫటికానికి వలె ఎన్నో ఫలకాలు గల ఒక కొత్త ఉద్యమాన్ని, ఏదో ఒక ఫలకం మాత్రమే చూచి తాము ఉండవలసిన దనుకున్నట్లు ఉండనంత మాత్రంచేత, తమ ప్రామాణ్యాలకు లొంగనంత మాత్రంచేత, విమర్శకు కాదు—నిరసనకే, దూషణకే పూనుకొంటున్న చిత్రమనస్కులు" ఈనాటి సాహిత్య విమర్శకులలో కొందరున్నారు. అందుకనే విమర్శ యొక్క స్థాయి పడిపోయింది.

"ఈ కాలంలో అసంఖ్యాకంగా నవలలు వచ్చినా శ్రీ ఉన్నవ, శ్రీ విశ్వనాథ, శ్రీ అడివి, శ్రీ నోరి- వీరి వంటి స్థాయినందుకునే నవలలు రాలేదనే చెప్పాలి. మనజాతి సమగ్ర స్వరూపాన్ని ప్రతిబింబించే ఉత్తమ స్థాయి నవలలు ఈ మూడోతరం వాళ్ళు వ్రాయలేదు." అని కవిత్వం మీదే కాకుండా నవలల మీద కూడా మరో నింద మోపారు. నిజంగా ఈతరంలో నవలలు ఆంధ్రజాతినెంత ప్రభావితం చేశాయో, నవలల పరిణామాన్ని జాగ్రత్తగా పరిశీలించిన వారికి అవగాహన కాగలదు బుచ్చిబాబు— చివరకు మిగిలేది; సింగరాజు లింగమూర్తి-మనుషులు—మమతలు; కందుకూరి లింగరాజు- మనం మిగిలేం; గోపీచంద్— అసమర్థుని జీవయాత్ర; రాచకొండ విశ్వనాథశాస్త్రి— అల్పజీవి; శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ—పేక మేడలు, బలిపీఠం మొదలైన నవలలు అటు సాహిత్య దృష్ట్యాగాని, ఇటు సమాజ దృష్ట్యాగాని ఉన్నతమైనవని నిస్సందేహంగా చెప్పవచ్చు. (వీరేగాక ఇంకా తెలుగు నవలా సాహిత్యంలో తీవ్రంగా కృషి చేసిన ఉత్తమ రచయితలు చాలామంది ఉన్నారు). ఇవన్నీ ఈ విమర్శకుల దృష్టికి ఎందుకు అనడంలేదు అంటే నాకొక్కటే సమాధానం తోస్తోంది. ఈ నవలలు గ్రాంధికానికి దగ్గరగా ఉన్న వ్యావహారికంతో వ్రాయబడలేదు! విమర్శకులు ఈ కాలపు నవలలో సమకాలీన

కీవన చిత్రీకరణ లోపించిందంటున్నారు. కాని ఈ నవల లన్నిటిలో ప్రధానమైన తత్త్వం, సమకాలీన సమాజ చిత్రీకరణ, సాంఘిక జీవన సంక్షోభం, జీవన పోరాటంలో బలవంతుల దౌర్జన్యాలూ, బలహీనుల పరాజయాలూ—మాత్రమే! ప్రాచీన వైభవ ప్రతిపాదన లేదు కాబట్టి ఉన్నతమైన నవలలు లేవనడం ఎంత పాక్షికమైన విమర్శయో చెప్పలేము. అనుక్షణం మారుతున్న సమాజంలోని భావాలను శక్తిమంతంగా వెలువరించగల రచయితలకు ప్రాధాన్యం గల పాశ్చాత్య నవలల్ని పరిశీలిస్తే యిది ఎంత దుగ్ధా ర్హమైన వాదమో తెలియగలదు!

ఇక కథాప్రపంచంలో కూడా ఈ వ్యాసకర్తకి అంతా చీకటే గాని వెలుగెక్కడా కనిపించలేదు. ఈనాటి కథకుల్లో కొడవటిగంటి కుటుంబరావు అగ్రగణ్యుడు. మధ్యతరగతి జీవన విధానానికి ప్రతినిధి. ఐతే, "ఆయన రచనల్లో హార్మోనియం సంగీతం లాగా కొంత చర్విత చర్వణం కనిపిస్తుంది" అన్నారు వ్యాసకర్త. ఈ వాక్యంలోని ఉపమానం యొక్క ఔచిత్యమెట్టిదో బోధపడటంలేదు. చర్విత చర్వణమైన సంగీత రీతి, ఏ వాద్యంలోనైనా ఉండవచ్చు, ప్రయోగించేవాని అసమర్థతచేత. సమర్థుడైతే హార్మోనియాన్నైనా చర్విత చర్వణం లేకుండా ప్రయోగించ వచ్చు. కాబట్టి హార్మోనియాన్నే పేర్కొనడంలో సామంజస్యంలేదు. అదీగాక, కొడవటిగంటి సమర్థుడైన రచయిత. అతని రచనల్లో చర్విత చర్వణం లేదు. ఒకే భావాన్ని అనేకచోట్ల చెప్పవలసి వచ్చినప్పటికీ (ఈ విషయం ఉత్తమ రచయిత లందరికీ వర్తిస్తుంది. ఒకే భావాన్ని ముఖ్యంగా ప్రతిచోటా ప్రతిపాదించడంలో విశ్వనాథ దీనికి ప్రథమోదాహరణము) దానితో పాఠకుణ్ణి విసిగించే రీతిగా గాక చమత్కారంగా చెప్పగల నేర్పు ఆయన కున్నది.

ఏమైనా, తెలుగుదేశంలో ఒక దురలవాటున్నది. ఎవరికి వారు మేమే అధికారులమని భావిస్తున్నారు. అందువల్లనే, సౌందరనందం కావ్యం కాదన్నారు, గురజాడని అకవి అన్నారు. కన్యాశుల్కాన్ని, మహాప్రస్థానాన్నీ సెకండు స్వస్తవాలతో పోల్చారు. (ఈ విషయం ఉదాహరించడానికి చాలా సిగ్గుపడుతున్నాను. కాని తప్పదు.) — చివరికి ఈనాటి సాహిత్యమంతా అగమ్య గోచరమని తేల్చారు.

" " గురజాడ చెప్పినట్లుగా, స్నేహము, ప్రేమ అనే.....రెండు వెలుగులను నరుని మీద తిప్పికొంటితే, వింత సొగసులు బయలుదేరుతవి. అసూయ అనే అంధకారంలో అంతా ఏకరసమే.

టి. ఎల్. కాంతారావు.

## మారన మహాకవి నివాస స్థలము

ఆర్యా!

'సమగ్రాంధ్ర సాహిత్య' గ్రంథ ద్వితీయసంపుటములో శ్రీ 'ఆరుద్ర'తెలంగాణముసందలి గోదావరీ పరీవాహప్రదేశము మారన మహాకవి నివాసస్థలమై యుండ వచ్చునని భావించినారు. (పుట. 233). అందులకు వారు ఆంధ్రమార్కండేయ పురాణములో భూగోళ ప్రకరణమునందు గల ఈక్రిందిపద్యమును పరోక్ష సాక్ష్యముగా చూపించినారు.

> క॥ సురుచిరమగు సహ్యనగో
> త్తరమున విలసిల్లుచుండు దద్దయు గోదా
> వరి, తత్ప్రదేశము మనో
> హరము పవిత్రము మునీంద్ర! యఖిల ధరిత్రిన్॥ 4 ఆ. 179 ప.

ఈపద్యమును మారన మహాకవి తత్ప్రకరణమున పనికట్టుకొని వ్రాసినాడనియు, పురాణేతిహాసముల ననువదించు మన ప్రాచీన కవులు తమతమ జన్మస్థలములను ఆ కావ్యములలో గుట్టుగా అవ్యక్తముగా, బేర్కొనుట అసహజము కాదనియు, నన్నయ వేంగి దేశమును, తిక్కన పెన్నానదిని మహాభారతమున బేర్కొని నట్లే మారన గోదావరీప్రదేశమును ప్రత్యేకాభినివేశముతో వర్ణించుటవలన నదియే యతని నివాసభూమియై యుండవచ్చునని యు శ్రీ 'ఆరుద్ర' పేర్కొనినారు.

పై పద్యమును మారన పనికట్టుకొని వ్రాసినాడనుటచే నది యమూలక మనియు, మారనచే గల్పింపబడినదనియు శ్రీ ఆరుద్ర భావించుచున్నారని స్పష్టమగుచున్నది. నన్నయ వేంగిని వర్ణించినట్లు— అను ఉపమాన మాభావమును బలపరచుచున్నది. కాని సంస్కృత మార్కండేయ పురాణమున పై పద్యమునకు మూలమైన శ్లోకము ఈక్రింది విధముగా నున్నది.

శ్లో॥ [1]"సహ్యస్య చోత్తరే యేతే యత్రగోదావరీనదీ ।
పృథివ్యా మపి కృత్స్నాయాం సప్రదేశో
మనోరమః॥"

మారన యీ శ్లోకమును తూచ తప్పక అనువదించెనే కాని మరొండుకాదు. నిజముగా గోదావరీ ప్రాంతమే స్వీయ జన్మస్థానమైనచో మార్కండేయ పురాణమున పలుతావులందు వీలుచూచుకొని విపుల రచన మొనర్చిన మారన యిప్పట్టున మఱియొక పద్యమైనను అధికముగా వ్రాసియుండెడి వాఁడే! శ్రీ ఆరుద్ర వ్రాసినట్లు భూగోళ ప్రకరణములో పని కట్టుకొని పద్యము వ్రాసినది మారనకాదు! పని కట్టుకొని శ్లోకము వ్రాసినది సంస్కృత మార్కండేయ పురాణకర్త! మారన యనువాదకుఁడు మాత్రమే!

పై పద్య మనువాదమై యున్నను గోదావరీ ప్రాంతము "పవిత్ర" మైనదని మారన విశేషముగాఁ గిర్తించెను కదా యని అనవచ్చును! గోదావరిని దక్షిణ గంగగా భావించి పూజించు ఆంధ్రుఁ డెవ్వఁడైనను, ఏ ప్రాంతమువాఁడైనను తత్ప్రాంతము మనోహర మనియే కాక పవిత్రమనియుఁ దలంచుటలో నాశ్చర్యములేదు. కావున పై పద్యము నిస్సంశయముగా నన్నయ వేంగీ వర్ణనము వంటి అమూలక వర్ణనము కాదనియు, మారనచేఁ గల్పింపబడిన దనుటకు వీలులేదనియు నామనవి. మారన జన్మభూమి తెలంగాణమునందలి గోదావరీ ప్రాంతమే యని నిశ్చయించుటకు శ్రీఆరుద్ర చూపిన సాక్ష్యమునకుఁదగినంత బలములేదని నాతలంపు! విజ్ఞులు దీనినిఁ బరిశీలింప ప్రార్థన!

—జి. వి. సుబ్రహ్మణ్యం

## పండితారాధ్య చరిత

ఆర్యా!

1966 ఏప్రిల్ నెల భారతిలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు 'పండితారాధ్య చరిత్ర' అను పేరితోనొక వ్యాసమును ప్రకటించిరి. అందు ఆంధ్ర గ్రంథమాలాధిపతులు ప్రచురించిన పండితారాధ్య చరిత్రమునందలి పాఠములను గూర్చి చర్చించుచు, అంతకుముందే ముద్రితములైన ప్రతులలోని కొన్ని యుత్తమ పాఠములను వివరించుట యెంతయు హర్షదాయకము. అందుచే, పండితారాధ్య చరిత్రము సమగ్రపాఠ పరిశీలనమునఁ బునర్ముద్రణము నంద వలసిన యావశ్యకతయున్న విషయము స్పష్టమగుచున్నది.

ఆ వ్యాసమున, 11 వ పుటలో Foot note లో "10. 'స్తుతియించు' — ఇది 'నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు' అను బాలవ్యాకరణ క్రియాపరిచ్ఛేద సూత్రము (65) చేత సాధ్యముకాదు" అని వ్రాసిరి. ఆ సూత్రముచే అయుగాగమము రానిమాట నిక్కమే. కాని, అది 'కీర్తి' అగుటంజేసి ధాతువున కంతమున వచ్చును.

"స్తుతియించు" అనుచోట "గురు విరహితంబు లయి యయాంతంబులయిన యేకస్వర ద్విస్వరంబుల యించుగ్వ్యకంబుల కియుడాగమంబు విభాషనగు." (బా. క్రి. 50) అను సూత్రముచే "ఇంచుక్కు"నక్కు ముందు ఇయుడాగమమువచ్చును. స్తుతి + (ఇయ్ + ఇంచు) = స్తుతియించు అను ప్రక్రియచే సాధింప నగును. అప్పుడు "స్తుతియించు" అనుచోట అయుగాగమ ప్రసక్తియే రాదు. మఱి వారట్లేల వ్రాసిరో యూహింపరాకున్నది. విజ్ఞులు పరిశీలింప ప్రార్థన.

—గిద్దలూరు చెంచు బసవరాజు.

---

1. మార్కం. మహాపురా. వేంకటేశ్వరస్టీము ప్రెస్—బొంబాయి ప్రతి: 54 అధ్యా. 34 వ శ్లో; తరంగిణీప్రెస్ — మద్రాసు ప్రతి. 52 అధ్యా. 34—35 శ్లో.

# గ్రంథ విమర్శలు

## ఎ స్టడీ ఆఫ్ తెలుగు కాంపౌండ్స్*

(రచయిత భాషాప్రవీణ జె. సూర్యనారాయణ ఎం. ఏ. పిహెచ్‌డి. వేంకటేశ్వర యూనివర్సిటీ ప్రచురణ, తిరుపతి.)

ఇది ఒక పరిశోధన వ్యాసము (Thesis). దీనిని రెండుభాగములుగా విభజింపవచ్చును. 1. లక్షణ గ్రంథములలో ఉదాహరింపబడిన సమాసముల వివరణము. 2. తిక్కన భారతమునుండి పర్వమునకు ఒక ఆశ్వాసము చొప్పున ఏర్చికూర్చిన సమాసముల సంకలనము. మోడరన్ లింగ్విస్టిక్స్ పేర చెలామణి అగుచున్న విషయముల జోడింపు ఇందు కలదు. ఇందలి కొన్ని విషయములు పునఃపరిశీలనము నపేక్షించుచున్నవి. కొలదిగా ఉదాహరింతును. (1) తెలుగులో అలుక్సమాసములే ఉండవని చెప్పినారు. (22—25 పు). చేత తోడ వలనలు పదములని చెప్పి నీ చేతి ప్రోపు—మున్నగునవి తత్పురుషములన్నారు! (51 పు). తలఁబ్రాలు—మున్నగువానిని కూడ తత్పురుషములే అన్నారు! (51 పు). తలఁబ్రాలు-లోని 'తలన్' అన్నది గోరంగితె—లోని 'గోరన్' వంటిది అయినది! అసలు తత్పురుషమే తెలుగునకు సరిపడదని వేరొకవంక వ్రాసినారు! (46 పు). తలఁబ్రాలు—మున్నగునవి అలుక్కులని ఆంధ్ర భాషానుశాసనమున కలదట. (ABA—?) నిజమున కివి మధ్యమపదలోపి సమాసములని ప్రామాణికులు. వీరు ప్రామాణిక పరిశోధన గ్రంథములను చదివినవారు కాకుండుటచే ఇట్టి పొరపాటులకు లోనగుట చాలచోట్ల జరిగినది. (2) అథర్వణ కారికావళీ వ్యాఖ్యను వీరు అథర్వణుని రచనగానే భ్రమించుచువచ్చిరి. (20-24 పు). మచ్చకంటి (31 పు) తప్పు. మచ్చెకంటి—సాధువు. (3) ద్వంద్వ సమాసమును వీరు నాలుగు విధములనుట పొరపాటు. (33 పు). సముచ్చయము అన్వాచయము అన్నవి సమాసములు కావు. తెలుగు ద్వంద్వము సముచ్చయార్థమునే తెలుపునన్నారు. సముచ్చయార్థ మెట్లుండునో వీరు గుర్తించినట్లు లేదు. ఈశ్వరం గురుంచ భజస్వ—వంటివి సముచ్చయములు. భిక్షామట గాంచానయ—వంటివి అన్వాచయములు. (4) మంచి చెడు—అను ఉదాహరణ సరికాదు. (33 పు). చెడ్డ—అనవలెను. (5) ద్వంద్వఘటిత శబ్దముల పౌర్వాపర్యము సంస్కృతమున వలె తెలుగునను కన్పట్టునని వీరు గ్రహించినట్లు లేదు. (33 పు). తల్లిదండ్రులు, అన్నదమ్ములు మున్నగువానిలో సంస్కృత నియమము కన్పట్టుచునే ఉన్నది. సో భవద్వరవధూసమాగమః ఇతిరఘౌ—అను చొప్పున (ముగ్ధబోధ) సంస్కృతములోను ఈ నియమములు ప్రాయికములు మాత్రమే. 6) పూర్వులు ఉపమిత రూపకముల విషయమున చేసిన వర్గీకరణ లోపభూయిష్ఠమని వీరు వ్రాసిరి. (37 పు). ఉపమిత రూపకముల సాధక బాధకములను గూర్చి వ్యాకర్తలు చేసిన సిద్ధాంతమును బాగుగా తెలిసికొనని లోపము వీరిదేకాని వారిదికాదుగదా! (7) మేఘశ్యామ అన్నది పురుషవ్యాఘ్ర అన్నదానితోపాటు ఉపమాన సమాసమని వీరు వ్రాసిరి! (36 పు). ఉపమాన సమాసమన ఉపమితము. (అహో 526 పు. నూ. ము) ఇది పొరపాటు. (8) మెఱుఁగుఁబోఁడి—ఉపమాన సమాసమని బాలసరస్వతి అన్నాడట. (36 పు) ఇది ఉపమాన గర్భ బహువ్రీహి అని అహోబలుడు. (524 పు). (9) చంద్రముఖి—అన్నది సంస్కృత వ్యాకర్తల మతమున ఉపమాన పూర్వపద కర్మధారయమన్నారు. (38 పు). సరికాదు. సమాసోత్తర పదము ఉపమేయ వాచిగా ఉండరాదని వ్యాకర్తల సిద్ధాంతము. ఘనశ్యామః—వంటివి ఉపమాన పూర్వపద కర్మధారయములు. (10) వాడి మయూఖములు—మున్నగునవి బాల వ్యాకరణాదులకు సమ్మతము కాదనుట పొరపాటు. (42 పు). (11) వేల్పు పెద్ద—కర్మధారయమన్నారు. పెద్దయైన వేల్పు=వేల్పు పెద్ద—అన్నారు. (49 పు). పెద్దయైన వేల్పు=పెద్ద వేల్పు—అని అగుటయే ధర్మము. వేలుపు + పెద్ద=వేలుపుఁబెద్ద—

* A Study of Telugu Compounds, Author:—Bhasha Praveena J. Suryanarayana M. A; PhD. Publication:—S. V. University, Tirupathi.

సురజ్యేష్ఠుడు—శ. ర. ఇది తత్పురుషము. (12) కనుపవులు—కర్మధారయమన్నారు. (51 పు). ఇదియు తత్పురుషమే. (13) ఉపమాన పూర్వపద కర్మధారయములను సంస్కృత భాషలో ఆశింపరాదు - అన్నారు. (54 పు). ఇవి లక్షణ సమ్మతము కావనవలెను గాని సంస్కృతమున ఆశింపరాదనరాదు. "యో హేమ కుమ్భస్తన నిస్సృతానామ్" అని రఘువంశమున కాళిదాసే ప్రయోగించెను. కరభోరులు—నన్నెచోడుడు వాడెను.(14)శాకపార్థివుడు—లోని శాకమును కూరలని అర్థము చేసిరి. (55 పు). శాకఃశక్తిః అని ముగ్ధ బోధ వ్యాఖ్యాత తెలిపియున్నాడు. శాకః—శక్తిః—ఇతిమేదినీ—శబ్దక. (15) ఢీర+ఆలు. ఇందలి ఢీర శబ్దము అకారాంత సంస్కృత పదమనబడినది (62 పు). పొరపాటు. (16) ద్వంద్వములో గసడదవాదేశము నిత్యమని సూరి అన్నమాట నిజమే. (62 పు). కాని దీనిని చింతామణియే చెప్పెనని గుర్తింపవలెను. (17) ఆంధ్రం షడ్వర్ణ పర్యంతం పదం స్యాత్కర్మధారయే—అను కారిక ప్రక్షిప్తమని వీరు గ్రహింపలేదు. (66 పు). (18) వాలు రమ్ము—ముద్రణ సంస్కారలోపకృతమని వీరు చూచుకొనలేదు. వాలుటమ్ము—అన్నదే ఒప్పు. (72 పు). (19) చిఱు—అను దానికి 'త' వర్ణము చేరెననరాదు. (75 పు). చిఱుత—లోని 'త' వర్ణమునకు వృత్తిలో లోపమువచ్చు ననవలెను. (20) వ్యాకరణ కర్తలు అరసున్ననుండి నిండుసున్నను సాధించిరనుట సరికాదు. (82 పు). నిండుసున్ననుండి అరసున్న సాధించుటయే చింతామణ్యాదులకు సమ్మతము. వ్యాఖ్యాతల పొరపాటుల మూలమున సూరి అరసున్ననుండి నిండుసున్నను సాధించెను. (21) ముగాగమము రాని ప్రయోగములనుచు కీడుతెరవు (తెరువు—ఒప్పు) మొ. వానిని చూపిరి. ఇవి వ్యాకర్తల మతమునకు విరుద్ధములనిరి. (84 పు). నుమ్ము నిత్యముకాదను అధర్వణాశయమును వీరు చూచుకొనలేదు.(22) చలివందిరి. శాంతి 1—136. ఇచ్చటి గసడదవాదేశమొక విశేషమనిరి. (89 పు). పకారమునకు వకారము ముద్రణ స్ఖాలిత్యమని వీరు గ్రహింపలేదు. వావిళ్ల 1955 ప్రతిలో చలిపందిరి—అనియే ఉన్నది. గసడదవాదేశము భారతమున ఎంత నియమబద్ధముగా పాటింపబడినదో గుర్తించినచో వీరికిట్టి భ్రాంతి కలుగకుండెడిది. (23) విశేష్యములు పూర్వ పదములయి విశేషణములగుచున్నవనుటకు వీరిచ్చిన పట్టిక చాలవరకు తిన్నగాలేదు. (88 పు). ఈ విశేషమును వ్యాకర్తలు గుర్తింపలేదనియు వ్రాసిరి. (122 పు). ఏ శబ్దములు విశేష్య విశేషణములు రెండును అగునో ప్రౌఢ వ్యాకర్త సూత్రించియున్నాడు. (శబ్ద 10). (24 ద్విగువువిషయమున ఆంధ్రవ్యాకర్తలు తూ చా తప్పకుండ సంస్కృతమునే అనుసరించిరనియు ఇది సంస్కృతప్రభావము వారిపై ఎంత ఎక్కువగా ఉన్నదో తెలుపుననియు వ్రాసిరి.(92—93 పు). ఇది కేవలము పరిశీలన రాహిత్య కృతము. "ద్విగోరమిశ్రతాయాంతుప్రాయ ఏకత్వమిష్యతే, మిశ్రతాయాం బహుత్వం స్యాత్" అను అధర్వణాశయము వీరు చూచుకొనలేదు. (25) నీదు—నాదు—మున్నగు వానిలోని 'దు' వర్ణము సమాసాశ్రయమని వ్రాసిరి. ఇది సూరికి సమ్మతమే. కాని ప్రాచీనులకు సమ్మతముకాదు. 'దు'వర్ణము షష్ఠీప్రత్యయమని పూర్వుల ఆశయము.

ఈ పరిశోధన గ్రంధము ఆంగ్లభాషలోకలదు. గ్రంధరూపమున ప్రకటించునప్పుడైనను పరిశోధన వ్యాసములను తెలుగులో వెలయింపజేయుట ఆవశ్యకమని తోచుచున్నది. సుహృద్భావముతో చేయబడిన యిందలి సూచనలను గ్రంధకర్తలు సహృదయతతో గ్రహింతురుగాక!

—శ్రీ వంతరాం రామకృష్ణారావు

## మీ మ న సు

[కర్త: చందూర్, ప్రచురణ: ప్రతిమా బుక్స్, మూకతాళ్ వీధి, మద్రాసు—7. పుటలు 104. వెల: 1—50.]

ఇంగ్లీషులో "The Mind goes forth" (మనస్సు పరుగులు పెట్టుతుంది) అనే ఆంగ్లగ్రంధానికి (By H & B. Over Street—రచయితలు వోవర్ స్ట్రీట్ దంపతులు) సంక్షిప్త స్వరూపంలో ఆంధ్రానువాదమిది. అనువాదకర్త బహు గ్రంధ రచయిత అయిన శ్రీ యన్. ఆర్. చందూర్.

అనువాదంలో గ్రంధనామాన్నిబట్టి ఇది మానసిక తత్త్వశాస్త్ర గ్రంధమో (Psychology) మనస్తత్వశాస్త్రానుగుణ వివరణమో (Psychologism) తత్ బహిః పరిధుల వివరణమో (Para Psychology) అనే భ్రమ కలిగే ప్రమాదం ఉన్నది. ఇది అటువంటి

గ్రంథంకాదు. ఈ పుస్తకాన్ని గురించి "మనుషులు ఒకర్ని ఒకరు తాము లోగడ చేసిన తప్పిదాలద్వారా పరిశీలించుకోబోతారు. కొన్ని తప్పులు పైకి ఒప్పుకోనివి; మరికొన్ని తప్పులు, తప్పులుకావని సమర్థించబడేవి. ఒక ఘటన అయిపోయిన తరువాత, అది అక్కడితో పరిసమాప్తి అని, మూసెయ్యగలగటం బహుకొద్ది మందికే చేతనవుతుంది. రాను రాను ఆమాదిరి నేర్పు అలవరచుకుంటేతప్ప, మన వ్యక్తిగత భవిష్యత్తు, చుట్టూతాగలవారి భవిష్యత్తు చీకాకు పాలవకతప్పదు. కొందరు వ్యక్తులు ఒక విషయాన్ని ఎందుకు మర్చిపోలేరంటే, వారికి క్షమించడంచేతగాక! క్షమాగుణం ఒక సంపదవంటిది. అదిలేనివారే 'న్యూరోటిక్సు' అవుతున్నారు గతం మర్చిపోయి మన్నించలేకపోవడం, వర్తమానాన్నీ, భవిష్యత్‌నీ చేజేతులా ధ్వంసం చేసుకోవడమే అవుతుంది. 'న్యూరోటిక్' భూతకాలపు బరువుతో, వర్తమానంలో కుమిలి, భవిష్యత్తుకి ఒంధుడవుతాడు"—ఈ మాటలు పరిచయ వాక్యాలుగా వ్రాయబడ్డాయి. అంటే ఈ పుస్తకంలో చెయ్యబడిన సైద్ధాంతిక ప్రతిపాదనల సంక్షిప్త స్వరూపమిది అన్నమాట.

పరుగెత్తుతున్న మనస్సును భిన్న భిన్న పరిస్థితులలో పరిశీలనచేసి, తమకుగల పరిధులలో—తమ పరిశీలనా భావాలకు గ్రంథకర్తలు కల్పించిన పుస్తక స్వరూపమే ఈ గ్రంథం. దీనికి ఒక ప్రచారదృష్టి ఆలంబనంగా ఉన్నట్లు కన్పడుతుంది. ప్రచార దృక్పథం లేకపోతే ఈ క్రింది వాక్యం అక్కర కనుపించదు.

"ఫాసిజమ్‌కివలెనే కమ్యూనిజమ్‌కూడా కేపిటలిస్టు విద్వేషంతో జీవంపోసుకు, నియంతృత్వరూపం దాలుస్తుంది. లోకంఅంతా మనమీద కత్తికట్టింది, మనం అప్రమత్తులమై ఉండకపోతే మనని మింగేస్తారు అనే పిచ్చి భయం ప్రాతిపదిక ఆ సిద్ధాంతానికి. 'కలసదార్లు, ఇంపీరియలిస్టులు, పెట్టుబడిదార్లు—అనే పేర్లతో శత్రువులని సృష్టించుకుని 'అదిగో అవన్నీ బూచులు' అని ప్రజలకి చూపెడుతూ పాలన సాగిస్తున్నారు." (పుట 32). ఇటువంటి విసురులు చాలా తక్కువ రకానికి చెందినవనీ—మేధావులు ఈమాదిరి అల్పమైన ఎగతాళికి (Cheap gibes) దిగరనీ నాగరికులకు తెలిసిన విషయమే. ఇటువంటి భావాలు ఈ పుస్తకంలో ఎక్కువగానే ఉన్నాయి. ఈ పుస్తకానికి వ్రాయబడిన పరిచయంలో అన్నట్లుగానే ఈ పై భావాలు 'భూతకాలపు బరువుతో, వర్తమానంలో కుమిలిపోయి ఉన్నాయి.

ఈ గ్రంథరచయితలు మానసికతత్త్వ పరిశీలనలో క్రైస్తవ మత అభినివిష్టవాదాల (Dogmatic) దృష్టిని అవలంబించినట్లుగా కూడా విద్యమానం అవుతుంది (పుటలు 52, 53). కాబట్టి ఈ గ్రంథం ఒక శాస్త్రగ్రంథంగాకాని, ఒక నిష్పాక్షిక ఆలోచనా పరంపరగాగాని, లేదా ఒక మాధుర్య సమాకృష్ట భావనాలహరిగాగాని—స్థానం సంపాదించుకోలేకపోయింది.

ఇటువంటి గ్రంథాలు మన సాహిత్యాన్ని సుసంపన్నం చెయ్యవు. అమెరికావారి సామాన్య (Mediocre) తనాన్ని ప్రచారంచేసే ఈ మాదిరి గ్రంథాల అనువాదాలకు అవసరం ఏమిటో బోధపడదు. మేధామేరువుగా ప్రసిద్ధమైన భారతదేశంలోకి, ఇటువంటి గ్రంథాలు దిగుమతి చెయ్యడంవల్ల—మనవాళ్ళకు అమెరికాలోని మేధావివర్గంమీద చులకనభావాలు కలిగే ప్రమాదం ఉన్నది.

అనువాదం 'చందూర్'గారి సహజ ధోరణిలో ఉన్నది.

## జూలై 4

[కర్త: చందూర్; ప్రచురణ: ప్రతిమా బుక్స్, మూకతాల్‌వీధి, మద్రాసు—7. పుటలు 136+XII. వెల రూ. 2—00.]

ఇంగ్లీషులో Four days in July (జులై నెలలో నాలుగు రోజులు) అనే గ్రంథానికి (కర్త Carnel Lengyel—కార్నెల్ లెన్‌గ్యెల్) శ్రీ చందూర్ చేసిన ఆంధ్రానువాదమిది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలకు స్వాతంత్ర్యం లభించిన సందర్భంలో—స్వాతంత్ర్య తీర్మానపత్రాన్ని (Declaration of independence) తయారుచేసిన థామస్ జఫర్‌సన్ నిర్వహించిన పాత్రను, సమీచీనమైన చారిత్రకదృష్టితో, విషయనిష్ఠమైన యథార్థత్వంతో రచింపబడిన గ్రంథం లెన్‌గ్యెల్‌ది. ఈ గ్రంథం 1958 లో ప్రకటింపబడి—ఆంగ సాహిత్య

భావుకుల, చారిత్రక వస్తుబావుకుల మన్ననలు గడించుకొన్నది. మూలగ్రంథంలోఉన్న విషయ నిష్పత్యం (Objectivity) ఆంధ్రానువాదం ప్రతి బింబించలేకపోయింది. స్వాతంత్ర్య తీర్మాన సందర్భంలో అత్యంత ప్రముఖులైన జాన్‌యాడమ్స్, జెఫర్‌సన్‌ల వ్యక్తిత్వాలనుకూడా మూలగ్రంథంలో ఉన్నంత ప్రస్ఫుటం చెయ్యలేకపోయింది అనువాదం.

స్వాతంత్ర్యపత్రంలోఉన్న పరమోదాత్తభావా లనూ—స్వాతంత్ర్యపత్రంపైన ప్రతినిధులు సంతకాలు పెట్టుతున్న సన్నివేశాన్ని వర్ణించే ఘట్టంలోనూ అనువాదం రక్తికట్టలేదు.

అచ్చుతప్పులు మోతాదుకుమించి ఉన్నాయి. స్వాతంత్ర్యప్రియులైన ఆంధ్ర పాఠకులు ఈ పుస్తకాన్ని ఆదరిస్తారనడానికి సందేహించవలసిన పని లేదు.

—తు రా.

## తి మ్మ రు సు మం త్రి

[చరిత్రాత్మక నాటకము. రచయిత కవిరాజు శంభర సూర్యనారాయణశాస్త్రి. ప్రచురణకర్త: శంభర సూర్యనారాయణశాస్త్రి విజయనగరం—2. వెల: రు. 3/—]

తిమ్మరుసు రాచకీయ జీవితము ప్రధానేతి ముగాగల ఈ నాటకంలో కృష్ణదేవరాయలపాత్రకు జరుగవలసిన న్యాయం జరుగలేదు. నీచకుల సంజాత యైన చిన్నాదేవిచేతిలో కీలుబొమ్మయైన కృష్ణరాయలకు ఆమె బ్రాహ్మణద్వేషము తలకెక్కించుట వలనను, చిన్నాదేవి బంధువొకడు వజ్రముష్టియను వాడు తుళువ వంశమువిూద పగబూని కుట్రచేయుట వలనను, తిమ్మరుసునకు పదవీచ్యుతి తదుపరి మరణము సంభవించినవని రచయిత చేసిన కథా సంవిధానము చాల దుర్బలముగా నున్నది. అందుకు ప్రధాన కార ణము కృష్ణరాయలు, వజ్రముష్టి, చిన్నాదేవిపాత్రలను చిత్రించుటలో రచయిత కృతకృత్యుడు కాలేకపోవుట. కాని, తెనాలి రామలింగకవివంటి అప్రధాన పాత్రలను పోషించుటలో రచయితకున్న ఆసక్తి ప్రధాన పాత్ర లను పోషించుటలో కన్పించుటలేదు. తిమ్మరుసుపాత్ర ద్వితీయాంకమున, షష్ఠాంకమున రాణించినది. కాని వజ్రముష్టి పుట్టుపూర్వోత్తరము లెరింగిన తిమ్మరుసు అతని నెందుకు ఉపేక్షించినాడో తగిన చూపకపోవుట కథకేకాదు, తిమ్మరుసుపాత్ర పరిపూర్ణ తకుకూడా భంగకరముగా నున్నది. రచయిత ప్రతిభ సంభాషణలలో కొంత చమత్కారమును, సరసమైన వ్యంగ్యమును సాధించుటలో వ్యక్తమైనది. అటుపై భువన విజయమువంటి రంగములలో రచయిత కవితా శక్తి చక్కగా ఉపయోగించినదని చెప్పవచ్చును. అసలు నాటకమునకంటె నాటకముయొక్క అవతారిక, కృతి సమర్పణము, ముద్రణము, అందు శ్రీ స్థానం నరసింహారావుగారి ప్రోత్సాహము మొదలగు విషయ ములు ఆసక్తి జనకములుగా నున్నవి.

ఆర్. ఎస్.]

## అమెరికా ప్రజల ఆర్థిక వ్యవస్థ

[మూలము—గెర్హార్డ్ కోమ్స్; థియొడోర్ గీగర్; అనువాదము. శ్రీ ఎ. వెంకటేశ్వరరావు; ప్రతిమా బుక్సు, 3 మూకతాల్‌వీధి, మద్రాసు—7 ధర— 4 రూపాయలు.]

ఇంగ్లీషులో "ఎకానమీ ఆఫ్ ది అమెరికన్ పీపుల్" అన్న పేరుగల గ్రంథమునకు ఇది తెనుగు అనువాదము. అమెరికాలో నిది 1961 నాటికి మూడు సార్లు ముద్రింప బడినది. నేషనల్ ప్లానింగ్ అసోషియేషన్ వారి ప్రచురణ ఇది. అమెరికాలో ఇది యొక స్వతంత్ర సంఘము. కొలంబియా జిల్లా శాసనము క్రింద రిజిష్టర్ అయినట్టిది. వారు యీ గ్రంథమును వ్రాయించి ప్రకటించి యుండిరి. దీనిని ఆంగ్లమున వ్రాసిన వారిలో థియొడోర్ గీగర్ ఈ నేషనల్ ప్లానింగు అసోషియేషన్ లోని అంతర్జాతీయ విషయ విచా రణ సంఘము అదినేత, ప్రఖ్యాతి నందిన ఆర్థిక వేత్త మరి యొకరు గెర్హార్డ్ కోమ్స్. ఆయన కూడా యీ అసోషియేషన్ లోనే పని చేస్తూ వున్నారు. ఆ అసోషియేషన్‌లో ఆయన ప్రధాన ఆర్థిక శాస్త్రవేత్త. జార్జి వాషింగ్టన్ విశ్వ విద్యాలయం ఆర్థిక శాస్త్రాచార్యులుగా వున్నారు.

ఇట్టి హేమా హేమీలు ఇద్దరు కలిసి రచించిన యీ గ్రంథం యొక్క ప్రాశస్త్యాన్ని గురించి వేరే చెప్ప నవసరము లేదు. ఇది

ఇదివరకే స్పానిష్, జపాన్, ఫ్రెంచి భాషల లోనికి అనువదితమై వుంది. 1961 లో జర్మన్ భాష లోనికి అనువదింప బడింది. అమెరికా అధికో త్పత్తిని ఏ విధంగా సాధించింది? ఆ ఉత్పత్తిని ఎట్లా వినియోగిస్తున్నది? ఈ రెండు మహా విషయాలు అమెరికా ఆర్థిక వ్యవస్థలో ఎట్లా సాధింపబడుతూవున్నాయి? అమెరికాలో వస్తూత్పత్తి అధికంగా అభివృద్ధి చెందడానికి, ల[illegible] జల జీవన ప్రమాణాలు అత్యున్నతమైన స్థాయిలో వుండటానికి కారణాల ఏమిటి? ఈ మొదలుగా గల విషయాలే గాక, ఈ మహదభ్యుదయ కార్యంలో ఆ దేశం యొక్క సహజ సంపద యే విధంగా వినియోగ పడింది? కార్మికులు, యజమానులు, సాంకేతిక విజ్ఞానము, ప్రభుత్వమూ, పెట్టుబడి — వీని భూమికలు ఏమిటి? ఈ [illegible] యొక్క పర్యవసానం యే విధంగా వుంటూంది? మొదలైన విషయాలను గురించి కూడా యీ యిద్దరు వేత్తలు సవిమర్శకమైన దృష్టి తో వివరించి వున్నారు.

ఇటువంటి ఉత్కృష్ట గ్రంథాన్ని అనువదించడంలో తెలుగు రచయితలు చాలా జాగ్రత్త వహించ వలసి వుంటుంది. అందుకు అనేకమైన కారణాలు వున్నాయి. మనది ఇంకా అభివృద్ధి చెందని, చెందుతూవున్న ఆర్థిక వ్యవస్థ. ఇచ్చటి ప్రజలకు అధికంగా అభివృద్ధి చెందివున్న ఒక స్వతంత్ర సమాజంయొక్క ఆర్థిక చరిత్రను అనువదించి ముందు వుంచుతున్నాము. విషయం జటిలంగా వుంటుంది. అనేక పారిభాషిక పదాలు వుంటాయి. అవి అర్థం అయితేనే గాని విషయం అర్థం కాదు. మరి తెలుగు బాషకు ఉన్నత ఆర్థిక శాస్త్ర విషయాలను సునాయాసంగా చెప్ప గలంతటి శక్తి లేదు. ఈ కారణాల చేత అనువాద కుని పని కొంచెం కష్టతరంగానే వుంటుంది.

అయినా శ్రీ వెంకటేశ్వర రావు తమశక్తి కొలది ప్రయత్నించారు. కాని మూల గ్రంథం శాస్త్రకట్టులో వున్నది కావడం వలన చాలా వాక్యాలు తెలుగులోనికి తెలుగువలె, అనువదింప బడటం కష్టం అయి పోయింది. ఈ గ్రంథంలో— అనువాదంలో— ఒక వాక్యం చూపిస్తాను. "నేషనల్ ప్లానింగ్ సంఘం 'రు (ఇప్పటి సంఘం అని అనువదించడం కన్నా ల[illegible] అని వున్న మాటను వున్నట్లు వుంచడమే బాగుండేది) ప్రకటించిన చాలా నివేదికం కంటె ఈ ప్రచురణ అనేక విధాల ఉపయోగ పడుతుంది. వ్యవసాయము, వ్యాపారము, కార్మికులు, ఇతర ఉద్యోగములకు సంబంధించిన కమిటీ సభ్యులు అంగీకరించగల విధాన ప్రకటనంకు పూర్వాధారమైన విషయ ములను ఫలితములను తెలుపుటకే ఇవి సాధారణ ముగా తయారు చేయబడినవి" — ఆదిగాగల వాక్యాలు ద్రావిడప్రాణాయామం చేస్తున్నట్లు వున్నాయి. ఆ వాక్యాలలో వున్న విషయం చప్పున గోచరం కాదు. ఇంగ్లీషు వాక్య విన్యాసమునందు అనువాదకుని మనస్సు చిక్కు పోయి, తెలుగు పలక్క పోవడం వలన ఇటువంటి వాక్య రచన పరిపాటి అవుతూ వుంటుంది.

ఇటువంటి వాక్యాలు యీ గ్రంథం నిండా చాలా వున్నాయి. అది సహజం కూడాను. కారణం అనువాదంలో రచయిత స్వతంత్రుడు కాదు గనుక, మూల రచయితలు చెబుతున్న విషయం వారి భాషలో తేలిగ్గా అర్థం అవుతున్నట్లు వున్నా మరియొక భాషవారికి కొంత దురవగాహం కావచ్చు గనుక, ఇట్లా జరుగుతూ వుంటుంది.

ఒక గ్రంథాన్ని అనువదిస్తున్నప్పుడు దృష్టిలో వుంచుకోవలసిన విషయాలు కొన్ని వున్నాయి. ప్రతి భాషలోను పలుకుబడులు వుంటాయి. తదితర భాషలలో వానికి సమానార్థకాలైన పలుకు బడులు వుంటాయి. అనువాదంలో ఈ పలుకు బడులను గమనించి, ఏరి, వెయ్యాలి.

ఒక గ్రంథాన్ని అనువదించేప్పుడు అది చదువ నేర్చిన అందరికి అర్థము అయ్యేలాగున వుండాలి గనుక, అలాగున అది అర్థమయ్యేలాగున అనువదించడం ఎట్లాగో చూచుకోవాలి. ఇచ్చట మాటల బరువు సమస్య కాదు. విషయం అర్థం అయ్యేలాగున భాషను వాడటం ప్రధానం.

ఇందుకోసం శ్రీ వెంకటేశ్వరరావు చాలా ప్రయత్నించారు. కొంత వరకు కృత కృత్యులైనారు. ఇటువంటి గ్రంథాలను తెలుగువారికి అందించడం

కూడా అవసరం. అభివృద్ధి పద్ధతులు ఎట్లా వుంటాయో, వానిని అర్థం చేసుకొనడం ఎట్లాగో ఇటువంటి గ్రంథాలవలన తెలుస్తుంది.

గ్రంథం అంతా బాగానే వున్నది. అచ్చు తప్పులు తక్కువగా వుండివుంటే ఇంకా బాగుండెది.

—అ. ఆ.

### నా గొడవ—3 : పరాభవగ్రీష్మం

గేయ సంపుటి. రచన: శ్రీ కాళోజీ నారాయణ రావు. పుటలు—20. వెల—అమూల్యం. "అయితే ఎవరైనా ఏమిచ్చినా, ముందు ప్రచురణల ఖర్చుకు వెచ్చించబడగలదు". ప్రాప్తిస్థానం — శ్రీ కాళోజీ నారాయణరావు, నక్కలగుట్ట, హనుమకొండ.

### శ్రీ సత్యసాయీశ్వర కృతి తరంగిణి

ఉదాహరణాది మధుర కవితా గుచ్ఛం. ప్రథమ ప్రవాహం. రచయిత— శ్రీ ఉప్పాడ రాజారావు. పుటలు: 76. వెల—రూ. 2—00. ప్రాప్తిస్థానం—శ్రీ సత్య సాయి సారస్వతకేంద్రము, 6091 దేవనగర్, న్యూఢిల్లీ.

### అమర పద్మిని

చారిత్రక ఖండ కావ్యం. రచన—శ్రీ మూలపూడి వేంకట జగన్నాథరావు. పుటలు—16. వెల: రూ. 1—00. ప్రాప్తిస్థానం—సాహిత్యసీమా ప్రచురణలు, C/o శ్రీ బి. వి. నరసయ్య, రాజావారివీధి, విశాఖపట్నం—1.

### ప్రాచీన అంధ్రదేశ గ్రంథాలయ చరిత్ర

రచయిత—శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ. పుటలు 88. వెల—రూ.2—50. ప్రాప్తిస్థానం—శ్రీకొడాలి లక్ష్మీనారాయణ, రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్, మోపర్రు, తెనాలి తాలూకా.

### (శ్రీ) వెంకటేశ్వర స్తుతి

శతకం. రచన—శ్రీ పేరాల భరతశర్మ. పుటలు: 30. వెల—రూ.1—00. ప్రాప్తిస్థానం శ్రీ పేరాల భరతశర్మ, సంస్కృతోపన్యాసకుడు. ప్రభుత్వ కళాశాల, విజయవాడ—4.

### మంచి—చెడు

మంచి-చెడు, స్వాతంత్ర్యం అనే రెండు పిల్లల నాటికల సంపుటి. రచన—శ్రీ జి. ఎస్. కె. సాయి బాబా, శ్రీ కవుల ఆంజనేయులు. పుటలు—42. వెల—0—60. ప్రాప్తిస్థానం—రామా బాలానంద సంఘ ప్రచురణలు, శాఖవీధి, అనకాపల్లి.

### అరవింద చరిత్రాతి మానసము

యక్షగానం. రచన—శ్రీ వప్పంగి రామారావు. పుటలు— 36 వెల—0—60. ప్రాప్తిస్థానం—దివ్య జీవన కార్యాలయం, శ్రీ అరవిందకేంద్రం, జయపురం (కోరాపుట్టిజిల్లా.)

### రవీంద్రుడు

పిల్లలకు ఉపయోగపడే వచన రచన. రచయిత—శ్రీ కృత్తివెంటి వేంకటేశ్వరరావు. పుటలు—76. వెల: 1—25. ప్రాప్తిస్థానం—శ్రీ వేంకటేశ్వర గ్రంథమాల, కొత్తపేట, గుడివాడ.

### శ్రీపదులు

తిరువళ్ళువర్ తమిళంలో రచించిన తిరుక్కురళ్ కు తెనుగు అనువాదం. అనువాదకులు—శ్రీ సౌంఠి శ్రీపతి శాస్త్రి. పుటలు—278. వెల—రూ. 4—00. ప్రాప్తిస్థానం—శ్రీ సౌంఠి శ్రీపతిశాస్త్రి, 184, లింగిచెట్టివీధి, మద్రాసు—1.

### నివేదన—నళిని గీతాలు

కవితా సంపుటి. రచన — బాలాంత్రపు నళినీకాంతరావు. పుటలు-60. వెల-రూ. 3 50. ప్రాప్తిస్థానం—ఆంధ్ర మహిళాసభ, మద్రాసు—4.

### నాట్యరాణి

నాట్యానికి సంబంధించిన పదకొండు వ్యాసాల సంపుటి. రచన—శ్రీ నటరాజ రామకృష్ణ. పుటలు—172. వెల— 4—50. ప్రాప్తిస్థానం— శ్రీముఖ పబ్లికేషన్స్, ఫోర్ట్‌రోడ్, మచిలీపట్టణం—1.

### రాగరేఖలు

కథల సంపుటి. సంకలనం—శ్రీ కె. ఆర్. కె. మోహన్. పుటలు—196 వెల—రు. 3—00 ప్రాప్తిస్థానం— శ్రీముఖ పబ్లికేషన్స్, ఫోర్ట్‌రోడ్, మచిలీపట్టణం—1.

## గ్రంథవిమర్శలు

### దైవత మణిమాల

జో॥ పరిలింగస్వామి తమిళంలో పాడిన దైవ మణిమాలకు పద్యానువాదం. అనువాదం—శ్రీ మణి మంగళము పద్మనాభం. పుటలు—108. వెల—రూ. 1—50. ప్రాప్తిస్థానం శ్రీ మణిమంగళం పద్మనాభం, 1/55 కృష్ణప్పనాయకన్‌గుంటవీధి, కొండితోపు, మద్రాసు—1.

### సర్వజ్ఞని వచనములు

కన్నడంలోని సర్వజ్ఞని వచనాలకు మాత్రా చ్ఛందస్సులో తెలుగు అనువాదం. రచన—శ్రీ కలుగోడు అశ్వత్థరావు. పుటలు—112. వెల—రూ. 2—00 వీటిలో కొన్ని లోగడ భారతిలో ప్రచురించబడ్డాయి. ప్రాప్తిస్థానం—కవితా నికేతనం, రాయదుర్గం, అనంత పురం జిల్లా.

### (శ్రీ) వేంకటేశ్వరము

భారతి, సాహితి మొదలయిన పత్రికలలో లోగడ ప్రచురితమైన మధ్యాక్కరల సంపుటి. రచన—శ్రీ బండి నాగరాజు. పుటలు—28. వెల: 0—50. ప్రాప్తిస్థానం—మిత్రమండలి, 7/334, తూర్పువీధి, గూడూరు (నెల్లూరుజిల్లా.)

### గురుదక్షిణ

శ్రీ కలుగోడు అశ్వత్థరావు తమ గురువయిన శ్రీ కప్పగల్లు సంజీవమూర్తిరావుకు అంకితమిచ్చిన ఖండకావ్య సంపుటి. చివర శ్రీ సంజీవమూర్తిరావు వ్రాసిన "ఆంధ్ర సారస్వతము—విహంగమ దృష్టి" అనే వ్యాసం కూడా వుంది. పుటలు—60. వెల—రూ. 2—00. ప్రాప్తిస్థానం—కవితా నికేతనం, రాయదుర్గం, అనంతపురంజిల్లా.

### ఋతువిహారము

ఋతువులు వర్ణించే కావ్యం. రచన—శ్రీ రేపూరు సుబ్బారావు. పుటలు—46. వెల—రూ. 1—50. ప్రాప్తిస్థానం—శ్రీ రేపూరు సుబ్బారావు C/o శ్రీ బుడమగుంట సుబ్రహ్మణ్యం, టంకుంోడ్డు, నెల్లూరు.

### పరకాల విలాసము

తిరుమంగయాళ్వారు జీవితం తెలిపే లఘు కావ్యం. రచన—శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు. పుటలు—68. వెల—రూ. 1—50. ప్రాప్తిస్థానం— శ్రీ గోదా గ్రంథమాల, శ్రీ మన్నారాయణపురం, ఉల్లిపాలెంపోస్టు, కృష్ణాజిల్లా.

### ప్రభు జననం

జర్మనీ సాహిత్యంలోని సుప్రసిద్ధ క్రీస్తు జనన కథలు. రచన—డాక్టర్ వి. ఎస్. శర్మ. పుటలు-76 వెల—రూ. 1—00. ప్రాప్తిస్థానం— ప్రతిమా బుక్స్, 3, మూకత్తాళ్ వీధి, మద్రాసు—7.

### సౌందర్యలహరి

శ్రీ శంకరాచార్యుల సంస్కృత కృతికి తెలుగు రచన—శ్రీ రావినూతల శ్రీనాధరావు. పుటలు—38. వెల—రూ. 1—00. ప్రతులకు—శ్రీ రావినూతల శ్రీరాములు, అగ్రహారం, బాపట్ల,(గుంటూరుజిల్లా.)

### శ్రీ సాయికృష్ణస్తోత్ర నక్షత్రమాల

రచన—శ్రీ పంచాంగం సీనప్ప. పుటలు—20. వెల—తెలియదు. ప్రాప్తిస్థానం—శ్రీ పంచాంగం సీనప్ప పాలసముద్రం, హిందూపురంతాలూకా, అనంతపురం జిల్లా.

### ఉరికికట్టె

నాటిక: రచన—శ్రీ ఆవుల శ్రీనివాసరావు.పుటలు 72. వెల—రూ. 1—50. ప్రాప్తిస్థానం—పద్మావతీ పబ్లికేషన్స్, 339, గిడ్డంగివీధి, నెల్లూరు.

### మమత, జైహింద్

రెండు నాటికల సంపుటి.రచన—శ్రీ పసుమర్తి వేణుగోపాలరావు. పుటలు—44. వెల—రూ.1—00 ప్రాప్తిస్థానం—నవోదయ పబ్లిషర్స్, విజయవాడ—2.

### సాహితీసుమాలు

కవితాసంపుటి.పుటలు—62. వెల 0—75. ప్రాప్తిస్థానం—సాహిత్యాభివర్ధిని సంఘం, చీరాల.

### సింహాశైలాలయ శతకం

రచయిత—శ్రీ బుర్రా నరసింహశర్మ. పుటలు. 32. వెల 0—30. ప్రాప్తిస్థానం—శ్రీ బుర్రా సన్యాసిరాజు, సారత్‌బవర్జిహవుస్, బక్కారాపోస్టు, విశాఖజిల్లా.

### శంభు శతకం

రచన : శ్రీ బుర్రా నరసింహశర్మ. పుటలు 32. వెల—రూ. 0—30. ప్రాప్తిస్థానం— శ్రీ బుర్రా సన్యాసిరాజు, సారత్ బనర్జీ హవుస్, బక్కారాపోస్టు, విశాఖజిల్లా.

### గోల్కొండ

కుతుబ్‌షాల చరిత్ర వర్ణించే కావ్యం. రచన— శ్రీ సురగాలి తిమోతి జ్ఞానానందము. పుటలు 114. వెల—రూ. 2—00. ప్రాప్తిస్థానం—శ్రీ తిమోతి జ్ఞానానందము, తెలుగుపండితుడు, మెక్‌లారిన్ హైస్కూలు, కాకినాడ.

### మాతృశ్రీ

జిల్లెళ్ళమూడి 'మాతృశ్రీ' (అమ్మవారు) సందేశం వ్యాపింపజేయడానికి ఉద్దేశించిన మాసపత్రిక. జన్మ దినోత్సవ అభినందన సంచిక. (ఏప్రిల్ మొదటి సంచిక) కల్యాణదినోత్సవ సంచిక(మే—రెండవసంచిక) ప్రారంభ సంచిక (జూన్ సంచిక) మా కార్యాలయం చేరింది. సంపాదకులు—శ్రీ అధరాపురపు శేషగిరిరావు. సంవత్సరం చందా—రూ. 10—00. విడి పత్రిక 0—80. జన్మదినోత్సవ అభినందన సంచిక వెల. రూ. 2—00. కల్యాణ దినోత్సవసంచిక, రూ. 1—00.

---

## సవరణ

జూలై భారతిలో ప్రచురించిన బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి 'అరవిందుల నవ్య తంత్రము' అన్న వ్యాసములో 'వేదాంతము' అన్న శీర్షిక క్రింద వ్రాసిన పంక్తులలో "ఈశ్వరుడు ప్రధాన కారణం, లేక సమవాయి కారణం; ప్రకృతి అప్రధాన కారణం లేక నిమిత్తకారణం" అని వున్నది. అది సరికాదు. అచ్చట "ఈశ్వరుడు కారణము, ప్రకృతి కరణము" అని యుండ వలయును.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishn
The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad.